4

ర చ యి త్రి

## యితర రచనలు

(1) జీవన మాధుర్యం

(2) మనుష్యులు - మనస్సులు

# 5

# అభాగిని

ఆవూరు పెద్దపట్టణంకాదు. ఆమాటకొస్తే బొత్తిగా పల్లెటూరూకాదు. గుంటూరుకి అయిదుమైళ్ళ దూరంలో ఉంది. ఎలక్ట్రిసిటీ ఉంది. నీళ్ళపంపు లున్నాయి. సినిమా హాలుంది. ఐదారు హోటళ్ళున్నాయి. ఆ వూరికి బస్తీహంగు లన్నీ ఉన్నాయి. కిళ్ళీ దుకాణాలు, బట్టల దుకాణాలు, మందుల షాపులు, బియ్యపు మరలు, సైకిలు షాపులు మొదలైన పట్టణ చిహ్నాలా వూళ్ళో కనిపిస్తాయి. కూరగాయల మార్కెట్టుకూడా ఉంది.

ఆ వూరికి చివర చిన్న పూరిపాక ఉంది. ఆ పూరింటి కెదురుగా పదిగజాల దూరంలో చెఱువుంది. చెఱువు ప్రక్కనే ఒక పాడుపడిన సత్రమున్నది. చెఱువు గటున పెద్ద చింతచెట్లు, రావి, జువ్వి, మర్రి, వేప చెట్లున్నాయి. చెఱువు ఒడ్డునే ఉన్నప్పటికీ ప్రమానులు మాత్రం చెఱువు వైపుకి వంగిఉన్నాయి. కొమ్మలన్నీ చెఱువువైపు విస్తరించి ఉన్నాయి. దారికి అడ్డంవచ్చిన కొమ్మలన్నీ గవర్నమెంటువారు నరికేయటంవల్ల కొమ్మలన్నీ చెఱువు వైపునఉన్నాయి. రోడ్డువైపు చెట్లు బోడిగా అవుపిస్తాయి. చెఱువునిండా తామరాకులు నిండి ఉన్నాయి. చెఱువు దగ్గర జనం ఎప్పుడూ కిట

కిట లాడుతుంటారు. చెఱువు ఒడ్డునే మంచినీటి బావిఉంది. నీటి సప్లయి యింకా యిళ్ళవరకూ రాలేదు. కుళాయిలు రోడ్ల మీద మాత్రం ఉన్నాయి. ఆ వూరివారు అందువల్ల సామాన్యంగా బావి నీరే వాడతారు. ఆ వూళ్ళోఉన్న బావులన్నీ ఉప్పునీటి బావులే. ఈ చెఱువు గట్టునఉన్న బావి ఒక్కటి మాత్రమే మంచినీటిబావి. అందులోని నీరు తియ్యగా అమృతం లాగా ఉంటుంది. అందువల్ల చాలామంది త్రాగటానికి కుళాయి నీరు బదులు ఈ బావి నీటినే వాడతారు. ప్రొద్దుటిపూట బావి దగ్గర జనం యిసకేస్తే రాలనట్లుంటారు.

చెఱువులో బట్టలుతికేందుకు చాకలి వాళ్ళు ప్రోగవుతారు. ఆ దగ్గర్లోవున్న యిళ్ళ వాళ్ళుకూడా ఆ చెఱువులోనే బట్ట లుతుక్కుంటారు. చెఱువు గట్టున పొయ్యిపెట్టి బానలలో బట్ట లుడక బెడతారు. ఉడకబెట్టిన బట్టలు శుభ్రంగా చెఱువు నీటిలో ఉతికి చెఱువుగట్టున ఉన్న చెట్లకి త్రాళ్ళుగట్టి ఆరవేస్తారు. కొందరు దగ్గర్లోఉన్న పొలాల్లో నేలమీద ఆరవేస్తారు. ఊళ్ళోని గొడ్లకాపర్లు బఱ్ఱెల్నీ, ఆవుల్నీ ఎడ్లనీ, దున్నపోతుల్నీ తోలుకొచ్చి వాటికి నీళ్ళు త్రాగించి, శుభ్రంగా కడిగి, కొంచెంసేపు నీళ్ళలో ఈతకొట్టి, గొడ్లని తోలుకెడుతుంటారు. కొందరు చెఱువు నీటిలో గోగులు నానవేస్తారు. అది మురిగిన తర్వాత గోగు నార తీస్తారు. పాడుపడ్డసత్రం అరుగుమీద కూర్చుని ఆ నారతో గొడ్లకి పలుపులూ, చిక్కాలూ, చేంతాళ్ళు, నులక పేనుతుంటారు. అలా పదిమందీ సత్రం అరుగుమీద

చేరి తమపని తాము చేసుకుంటూ లోకాభిరామాయణం మొదలెడతారు. కొందరు జాలర్లు చెరువులో చేపలు పడు తుంటారు.

సత్రం అరుగుమీద నిత్యం పేకాట సాగుతుంటుంది. కొందరు పులిజూదం ఆడుకుంటారు. కొందరు ఒట్టిపోచు కోలు కబుర్లు చెప్పుకొని కాలక్షేపం చేస్తారు. అడుక్కొనే వాళ్ళూ, కూలీ, నాలీ కొరకు ఊరూరాతిరిగే అలగావాళ్ళూ, పట్నంపోయే గడ్డి బళ్ళవాళ్ళూ, కూరా, నారా, పట్నం తీసుకుపోయే రైతులూ, ఊరూరా తిరిగి దోస, చిలకడ దుంపలు, ఉల్లిగడ్డలు అమ్మేవాళ్ళు సత్రం ముందు చెట్ల క్రింద రాళ్ళతో పొయ్యిలు ఏర్పాటు చేసుకొని వంట చేసు కొని భోజనం చేస్తుంటారు. అస్తమానం వచ్చే పొయ్యే బళ్ళ వాళ్ళుకూడా ఆగి భోజనం చెయ్యటమో లేక వంట చేసుకోవటమో పరిపాటి. పాములవాళ్ళుకూడ కూర్చొని తాటాకు బుట్టలూ, ఈతాకు చాపలూ అల్లుకుంటూ ఉంటారు. అన్ని రకాల మనుష్యులతోటీ ఆ సత్రం కళ కళ లాడుతుంటుంది.

సత్రానికెదురుగా ఓ పెద్ద మర్రిచెట్టుంది. ఆ చెట్టు క్రింద కోమటి పేరమ్మ పకోడీలూ, బజ్జీలు, వడలూ, గారెలూ, అట్లూ, మిరపకాయ బజ్జీలూ, కజ్జికాయలు, పును గులూ-యింకా అనేక రకాల తినుబండారాలుచేసి అమ్ము కొంటుంది. ఇవిగాక శనగపప్పు బఠాణీలు, ఉప్పుశనగలు, మరమరాలు, వేరుశనగకాయలు, చక్కిలాలు, బిస్కట్లు

అమ్ముతుంది. ఆవిడ దగ్గర ఒకరకం ఉన్నది, మరో రకం లేదని చెప్పటానికి వీలులేదు. ఆ ప్రక్కనే సింగు కిల్లీ దుకాణం ఉంది. అందులో బీడీలు, సిగరెట్లు, కిల్లీలు, బిస్కట్లు, పిప్పరమెంట్లు,చాకొలెట్లు, అగ్గిపెట్టెలు దొరుకుతాయి. దానికి నాలుగు గజాల దూరంలో అయ్యరు కాఫీహోటలుంది. ఇడ్లీ సాంబారు, కాఫీ, టీ, పెసరట్టు మొదలైన హోటలు సరుకులన్నీ దొరుకుతాయి. బస్సులన్నీ యిక్కడే ఆగుతాయి. ఓ అరగంటసేపు అలా బస్సులాపినందుకుగాను కండక్టర్లు, డ్రైవర్లు, క్లీనర్లు ఊరికే సుష్టుగా తింటారు. ఆ పైన కబుర్లాడుతారు. వీరి తిండి అయ్యేలోపల ప్రయాణీకులు కాఫీ, గట్రా సేవించి ముడుపు చెల్లించుకొని మళ్ళీ బస్సు ఎక్కుతారు. బస్సుప్రయాణీకుల్లో రకరకాల మనుష్యులుంటారు కదా! ఎవరికి తగ్గట్లు వారు అయ్యరు హోటల్లో తినటమో, కిల్లీ దుకాణంలో కిల్లీ వేసుకోవటమో, సోడా త్రాగటమో, సిగరెట్, బీడీ మొదలైనవి కొనుక్కోవటమో చేస్తుంటారు. కొందరు బీదవాళ్ళు పేరమ్మ దగ్గర అణా, బేడకి తినుబండారాలు కొనుక్కొని తిని చెలువు బావి దగ్గర మంచి నీళ్ళు త్రాగి తృప్తి పడుతుంటారు. పిల్లల తల్లులు పేరమ్మదగ్గర ఓ అణాకాసుపెట్టి ఏదైనా కొనిపెడుతుంటారు. ఇలా ఎవరికి తగ్గ బేరాలు వారికి వస్తూనే వుంటాయి. ఎవరికి తగ్గట్టువారికి గిరాకీ ఉంటుంది. లాభం వస్తుంది. అక్కడ పోటీ ఏమీలేదు ఆ వూరిచివరవాళ్ళు యిక్కడికే వచ్చి బస్సు ఎక్కుతారు. వచ్చేపొయ్యే బస్సులు

లారీలు, బళ్ళరొదతో ఆ రోడ్డు ఎప్పుడూ సందడిగా ఉంటుంది. ఊరిచివర అన్న భయమే ఉండదు.

ఆ చెఱువు సమీపంలో ఉన్న పూరి గుడిసెలోనే నారాయణాచారి మకాం. పచ్చటి దేహచ్ఛాయ. ఉక్కు కడ్డీలాంటి శరీరం. ఆజాను బాహుడు. తల నెరిసి పోవటం వల్ల నైతేనేమి, మరే కారణంవల్ల నైతేనేమి తల మాత్రం బోడిగుండు. నిగనిగలాడుతూ ఉంటుంది. ముఖాన ఎర్రటి నిలువు బొట్టు. మెడలో జంధ్యం, వెన్నంటిన కడుపు, లోతుకిపోయిన కళ్ళు, కోటేరంటి నాసిక. మనిషి చాలా నెమ్మదస్తుడు.

నారాయణాచారి కిద్దరే సంతానం. ఒక ఆడపిల్లా, ఒక మొగపిల్ల వాడూను. పిల్లవాడు పెద్ద.

నారాయణాచారిది చక్కని గాత్రం. కంఠమెత్తి హరి నామ స్మరణచేస్తూ, పాటలు పాడుకొంటూ, తంబుర మీటుతూ పూరూరూ, యిల్లిల్లూ తిరిగి భిక్షాటన చేస్తాడు. అదే అతనివృత్తి. పండ్రెండు గంటలదాకా కాళ్ళరిగిపోయేట్లు భిక్షాటన కొరకు తిరిగి తిరిగి నకనకలాడే కడుపుతో యిల్లు చేరతాడు. అప్పటికి అతని భార్య సుభద్ర పనంతా ముగించు కొని వంట సిద్ధంచేసి ఉంచుతుంది. పిల్లలు ప్రొద్దున్నే చద్ది అన్నం తింటారు. పిల్లవాడి పేరు గోవిందాచారి. పిల్ల పేరు చంద్రిక. గోవిందాచారి ఆ పూరి హైస్కూల్లో చదువు తున్నాడు. చంద్రికకు తండ్రిలాగే మంచి కంఠంవుంది. కంఠ మెత్తితే కోకిల కంఠం గుర్తుకొస్తుంది. ఆ విషయం గ్రహిం

చిన నారాయణాచారి కూతుర్ని సంగీత పాఠశాలలో చేర్పించాడు.

చంద్రిక కంఠ మాధుర్యానికి ముగ్ధుడైన వేణుగోపాలాచారి ఫీజు లేకుండానే సంగీతం చెప్పటానికి ఒప్పుకున్నాడు. చంద్రికకు వయస్సెంతో లేదు. పది సంవత్సరాలు నిండాయి. పేరుకి తగ్గ ముఖవర్ఛస్సు; మిసమిసలాడే బంగారు మేని ఛాయ; చంద్రుని బోలు గుండ్రటి ముఖం. కలువ రేకుల్లాంటి కళ్ళు. సన్నని ముక్కు. చిన్న నోరు. గడ్డం చివర నల్లటి పుట్టుమచ్చ. చొట్టలుపడే మెత్తటి బుగ్గలు. దానిమ్మ గింజల వంటి పలువరుస. నల్లగా నిగనిగలాడే జుట్టు. పెద్ద జడ. పిల్ల చూడ ముచ్చటగా ఉంటుంది. ఎవరినైనా యిట్టే ఆకర్షించ గలదు. వేణుగోపాలాచారికి ప్రియ శిష్యురాలు.

వేణుగోపాలాచారికి దాదాపు అరవై అయిదేళ్ళుంటాయి. మనిషి ఎర్రగా ఉంటాడు. ఖద్దరు లుంగీ, లాల్చీ ధరిస్తాడు. తల బోడిగా ఉంటుంది. మనిషి తడబడుతుంటాడు. దానికి తగ్గట్లు నత్తి. గొగ్గి పళ్ళు. ముఖాన ఎర్రటి నిలువు బొట్టుంటుంది. మనిషి ఎప్పుడూ నవ్వుతూ, త్రుళ్ళుతూ ఉంటాడు. ముద్దొచ్చే పిల్లల్ని తొడమీద కూర్చోబెట్టుకొని కబుర్లు చెప్తుంటాడు. అందరికీ ఆయన స్వయంగా పాఠాలు చెప్పడు. క్రొత్తగాచేరిన వాళ్ళకీ, బాగాపైకి వచ్చినవాళ్ళకీ మాత్రమే ఆయన చెప్పేది. మిగతా వాళ్ళని యితర్లకి వప్పగిస్తాడు.

ఆయన దగ్గర సంగీతం నేర్చుకునే వారిలో ఐదారు గురు బీద విద్యార్థినులున్నారు. వాళ్ళకి ఉచితంగా సంగీతం నేర్పుతాడు. వీళ్ళు పై పరీక్షలకి నేర్చుకుంటూ తమకంటే తక్కువలో ఉన్న వారికి నేర్పుతుంటారు. ఈ పిల్లలకి ఉచితంగా నేర్పటమే కాక వీరికి పండగలకీ, పబ్బాలకీ, చీరో రవికో, పరికిణీయో, జాకెట్లో కొని యిస్తుంటాడు. అప్పుడప్పుడు ఒకటీ, రెండూ రూపాయలు రొక్కం రూపంలో యిస్తుంటాడు. వేరేచోట స్కూల్లో చదువుకొనే పిల్లలకి పుస్తకాలకీ, జీతాలకీ సాయంచేస్తుంటాడు. ఉన్నవారివద్ద హెచ్చు జీతాలు పుచ్చుకుంటాడు. ఇక్కడ వచ్చే ఆదాయం కాక యింటికివెళ్ళి చెప్పే ట్యూషన్లవల్ల కొంత వస్తుంది. సాయంకాలం ట్యూషన్లు చెప్తాడు. నెలకి ముప్పైనలభై చొప్పున యిస్తుంటా రొక్కొక్కరు. ఆదాయానికి లోటులేదు. మధ్య, మధ్య పాట కచ్చేరీలు చేస్తుంటాడు. వీటికి తోడు రేడియో ప్రోగ్రాములు వస్తుంటాయి.

చంద్రికను తొడమీద కూర్చోబెట్టుకొని పాఠం నేర్పుతుంటాడు రోజూ. గాత్రమే కాక వీణమీదకూడా నేర్పేవాడు. ఎవరికి తగ్గట్లు వారికి వీణలు జమచేసేవాడు వేణుగోపాలాచారి. పెద్ద వాళ్ళకి పెద్దవి, చిన్నవాళ్ళకి చిన్నవి.

చంద్రిక శిశింద్రీలాంటిది. ఏకసంతగ్రాహి అంటే అతిశయోక్తికాదేమో! వేణుగోపాలాచారి ఒక్కసారి పాడి వినిపిస్తే మళ్ళీ అదే తీరులో వినిపించేది వెంటనే. అందువల్ల

చంద్రిక అంటే వేణుగోపాలాచారికి ప్రాణం. అప్పుడప్పుడు బిస్కట్లు, మిఠాయిలు కొనుక్కొచ్చి స్కూల్లోని చిన్నపిల్ల లందరికీ పంచేవాడు. అతని కదో సరదా.

ఆయన గది ప్రత్యేకంగా ఉంటుంది. ఆ గది అంతా త్యాగరాజువంటి సంగీత విద్వాంసుల ఫొటోలతో అలంకరింప బడి ఉంటుంది. రోజూ పూలమాలలతో త్యాగరాజు ఫొటో అలంకరింపబడుతుంది. అగరు వత్తులు వెలిగించబడుతాయి. వేణుగోపాలాచారి పాఠం చెప్తే ఆ గదిలోనే చెప్తాడు.

ఈ సంగీత పాఠశాల ప్రొద్దుటపూట మాత్రమే వుంటుంది. ప్రొద్దున ఆరుగంటలనుండి పది పంద్రెండు గంటల దాకా తెరిచి వుంటుంది. బడికివెళ్ళి చదువుకునే విద్యార్థి నులు ప్రొద్దున ఆరుగంటలనుంచీ తొమ్మిది గంటలవరకూ ఉంటారు. రాగానే తమ తమ వీణలు, ఫిడేళ్ళు పట్టుకొని క్లాసుల వారీగా కూర్చొని ప్రాక్టీసు చేస్తారు. ఆ తర్వాత వేణుగోపాలాచారో, మరో టీచరో వెనకటి పాఠం పాడించి, తప్పులు లేకపోతే క్రొత్త పాఠంచెప్పి పంపుతారు. ఆ తర్వాత కొంతసేపు కూర్చొని వెనకటి పాఠాలు, ఆ రోజున చెప్పిన క్రొత్త పాఠం వాయించి యింటికి వెడతారు. ఇక్కడ నిత్యమూ జరిగే కార్యక్రమ మిది.

ఓనాడు నారాయణాచారి వేణుగోపాలాచారి దగ్గరికి వచ్చాడు తిరిగి యింటికి వెడుతూ.

"నమస్కారం మాష్టారూ" అన్నాడు నారాయణా చారి.

"నమస్తే! రా, రా, కూర్చో" అంటూ చాప చూపించాడు వేణుగోపాలాచారి. నారాయణాచారి వచ్చి కూర్చున్నాడు చేతిలోని తంబురా ప్రక్కన పెట్టాడు. చంకకి తగిలించుకున్న జోలె తీసి ప్రక్కన పెట్టాడు.

"ఏమిటీ విశేషాలు" అన్నాడు వేణుగోపాలాచారి పొడుము పట్టు పీలుస్తూ.

"ఏమీ లేదు. ఇంటికి పోతూ వచ్చాను. చంద్రిక ఎలా నేర్చుకుంటున్నదీ కనుక్కుపోదామని." అన్నాడు నారాయణాచారి.

"ఆ! ఆ! అది రత్నంవంటి పిల్లోయ్. నీ కడుపున పుట్టవలసిన పిల్ల కాదు. రాజులింట్లో పుట్టవలసిన పిల్ల. మణి పూస అంటే ఆశ్చర్య పడనవసరం లేదనుకో" అన్నాడు వేణుగోపాలాచారి తుమ్ముతూ.

"ఏం? అలా అంటున్నారు? పేదవాళ్లు పిల్లల్ని కన టానికి అనర్హులా?" అన్నాడు నారాయణాచారి మ్లాన వదనంతో.

"ఏబ్బే! అదికాదు నా ఉద్దేశ్యం. పిల్ల బంగారపు బొమ్మ. కోయిలను మైమరపించే కంఠ మాధుర్యం. ఇటు వంటి వాళ్లు భాగ్యవంతుల యిళ్ళల్లో పుడితే రాణిస్తారు. వారి తెలివి తేటలకి తగ్గ ప్రోత్సాహం లభిస్తుంది. మనబోటి వాళ్ళ యిళ్ళల్లో అవన్నీ సాగవుగా" అన్నాడు వేణుగోపాలాచారి నచ్చ చెప్పడానికి ప్రయత్నిస్తూ.

"అవును. మీరన్నమాటా నిజమే" అని నిట్టూర్చాడు నారాయణాచారి.

"దేనికోయ్ నిట్టూరుస్తున్నావు! నేనన్న దాంట్లో తప్పేమీ లేదు కదా" అన్నాడు సానుభూతి కనపరుస్తూ.

"అబ్బే, అదేమీ లేదు. పిల్లకి పెళ్ళిచెయ్యమని నా భార్య పోరుపెడుతున్నది. ఏదో సంబంధం నిశ్చయం చెయ్యమని నా గొంతుమీద కూర్చుంది. అచ్చటా, ముచ్చటా యిప్పుడేనట. నోములూ, వ్రతాలూ జరిపించటానికి తగిన వయస్సిదేనట" అన్నాడు నారాయణాచారి విచార వదనంతో.

"ఆ! ఇప్పుడవన్నీ ఎక్కడున్నాయి లేవోయ్. పాతికా, ముప్ఫై ఏళ్ళు దాటినా పెళ్ళికాని పిల్లలున్నారు. మా స్కూల్లో నేచూడు ఎంతెంత వయస్సు పిల్లలున్నారో! మరేం తొందరలేదు. చంద్రికను సంగీతంలో బాగా తర్ఫీదు పొందనివ్వండి. ఆనక చేయవచ్చు పెళ్ళి" అన్నాడు వేణుగోపాలాచారి.

"ఊహు, లాభంలేదు. అది పట్టుపడితే భల్లూకపు పట్టే. తా పట్టిన కుందేటికి మూడే కాళ్ళనేరకం. మనమాట నెగ్గనివ్వదు." అన్నాడు నారాయణాచారి దీర్ఘంగా నిట్టూరుస్తూ.

"మరి, మంచి సంబంధ మేదైనా చూశావా?" అన్నాడు వేణుగోపాలాచారి.

"ఆఁ! మంచి సంబంధం మనమెక్కడ తేగలం! నక్కెక్కడ? నాగలోకమెక్కడ? అందని ద్రాక్షపండ్ల కి అర్రులు చాచటం నా వల్ల కాదు. ఏదో గంతకి తగ్గ బొంత మనకి దొరక్కపోతుందా?" అన్నాడు నారాయణాచారి నిస్పృహతో.

"అందుకే గదుటోయ్ నేనన్నది, రాజులింట్లో పుట్ట వలసిన పిల్ల రాళ్ళ పాలవుతున్నదని! అదే ఏ భాగ్యవంతు లింట్లోనో పుడితే రాజభోగాలు అనుభవించేది. కోరిన చదువు నేర్చుకునేది. అయితే భగవంతుడు ప్రసాదించిన ఆ కంఠమాధుర్యాన్నిలా వృధా చేస్తారన్నమాటేనా ?" అన్నాడు వేణుగోపాలాచారి నిట్టూరుస్తూ.

"ఆ! అంతగాక పోతే మరెంత? ఇంతా చేసి ఆడపిల్లే కదా! మొగపిల్లాడయితే ఏదో ప్రయోజకుడై పేరు నిల్పె తాడనీ, పాటకచ్చేరీలు చేసి పేరు ప్రఖ్యాతులు సంపాయిస్తా డనీ అనుకోవచ్చు. ఎన్నాళ్ళు పోయినా ఆడపిల్ల అత్తారింటికి వెళ్ళేదేగా! మర్యాదగల కుటుంబీకు లెవరూ తమ భార్యల్నీ, కోడళ్ళనీ పాటకచ్చేరీలకని వూరూరూ తిప్పరు. అందులో పేదవారేమి చేసినా తప్పే. అందువల్ల అసలు పొసగదు. భర్తా, పిల్లలూ, సంసారమే వారి లక్ష్యం. అదేవారి ఆశయ సిద్ధికి మూలమూ, అంతమూ. సంసారంలోనే మునుగు తుంటారు, తేలుతుంటారు." అన్నాడు నారాయణాచారి.

"అయితే చంద్రిక పెళ్ళి త్వరలోనే జరుగబోతున్న దన్నమాట! వివాహం విద్యానాశనం అని అందుకే పెద్ద

లన్నారు సుమా." అంటూ వేణుగోపాలాచారి నిట్టూ ర్చాడు.

"ఆ అదృష్టమే మా గోవిందాచారికుంటే చాలా సంతోషించేవాడ్ని. వాడిని పెద్ద విద్వాంసుడుగా తయారు చెయ్యటానికి నా శాయశక్తులా ప్రయత్నించేవాడిని. కానీ వాడు గొంతువిప్పితే గార్ధభాలు తలుపుకొస్తాయి" అన్నాడు నారాయణాచారి నవ్వి.

"ఆ! ఏమో అంతా దైవలీల. ఎవరి కేమివ్వాలో - అంతా ఆ పరమేశ్వరుడి యిచ్ఛానుసారం జరుగుతుంటుంది. మనం విచారించి లాభంలేదు. కేవలం మానవులం మనం." అన్నాడు వేణుగోపాలాచారి.

"ఇంక శలవిప్పించండి వస్తా" నంటూ లేచి జోలె చంకకి తగిలించి తంబుర చేతపట్టి నిలుచున్నాడు నారా యణాచారి.

"అప్పుడేనా! కూర్చో" అన్నాడు వేణుగోపాలాచారి.

"ఆ! ప్రొద్దెక్కింది. మిమ్మల్ని చూచిపోదామని వచ్చాను. అంతే నా భార్య ఎదురుచూస్తుంటుంది. వెడ తాను" అన్నాడు నారాయణాచారి.

"మంచిది వెళ్ళిరా" అన్నారు వేణుగోపాలాచారి.

చంకకి తగిలించుకున్న జోలె నిండుగాఉంది. నారా యణాచారి రొప్పుతూ, రోజుతూ యిల్లుచేరాడు.

చంద్రిక ఎదురొచ్చింది. నారాయణాచారి జోలెతీసి చంద్రిక చేతికిచ్చాడు. ఆ పిల్ల ఆ జోలె పొట్టకానించుకొని ఆయాసపడుతూ యింట్లో పెట్టింది. తండ్రికి కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళిచ్చింది. ఓ పెద్ద చెంబుతో మంచి నీళ్లు పట్టుకొచ్చి యిచ్చింది. చెంబెత్తి నీళ్ళు గొంతులో పోసుకున్నాడు. గట, గట చెంబెడు నీళ్లూ త్రాగేశాడు. అంగవస్త్రం భుజాన వేసుకొని చెఱువువైపు నడిచాడు. చెఱువులో మునిగి, స్నానంచేసి అంగవస్త్రము మొలని చుట్టుకొని ధోవతి జాడించి, పిండి, ధోవతికొంగులు ఒక వైపువి రెండూ రెండు చేతుల్లోటీ పట్టుకొని ఎండలో నిలబడ్డాడు. ధోవతి రెండోచివర గాలికి రెపరెపలాడుతూ ఎగురుతున్నది. పదిహేను నిముషాల్లో ధోవతి ఆరిపోయింది. అది శుభ్రంగా మడిచి బుజాన వేసుకొని యింటి ముఖం పట్టాడు.

భార్య పీట వేసింది. నారాయణాచారి పీటమీద కూర్చొని పంగనామాలు తీర్చి భోజనానికి తయారైనాడు. నారాయణాచారి భార్య సుభద్ర విస్తట్లో దోసకాయపప్పూ, వంకాయ పులుసూ వడ్డించింది.

"ఇంతేనా? ఇంకా ఏమైనా చేశావా ?" అన్నాడు నారాయణాచారి నవ్వుతూ.

"ఏం ? అలా అడుగుతున్నారు ? అంటూ వడియాలు, వళ్ళగోంగూర పచ్చడీ తెచ్చి వేసింది విస్తట్లో.

"ఏమిటే విశేషం ? పెళ్ళిభోజనం పెట్టేస్తున్నావు?" అన్నాడు నారాయణాచారి భార్యవంక కొంటెగాచూస్తూ.

"ఏమీ లేదుగానీ అమ్మాయి పెళ్ళిమాటేం చేశారూ?" అన్నది సుభద్ర మంచినీళ్లు గ్లాసులో పోస్తూ.

"పెళ్ళనగానే మాటలా? తగిన సంబంధం దొరకాలి. దొరికిన సంబంధం నచ్చాలి. అప్పుడు కదా పెళ్ళిమాట." అన్నాడు నారాయణాచారి.

"సంబంధం దొరకటానికేముంది? అయిన సంబంధమే కదా! పరాయి వాడైతే ఆలోచించాలి. అనుకోవటమే తరువాయి. పెళ్ళి రేపీపాటికి అయిపోదూ?" అన్నది సుభద్ర విసన కర్రతో భర్తకి విసురుతూ.

"అదా సంగతి! అట్లా చెప్పు! మీ తమ్ముడి కొడుక్కి ఏమిచూసి యివ్వమన్నావు? బంగారంవంటి పిల్లను చూస్తూ చూస్తూ ఆ మూగమొద్దు కివ్వమన్నావా? అంతకంటే కాళ్ళూ, చేతులూ కట్టేసి గంగలో పారేయటం మంచిది." అన్నాడు నారాయణాచారి మండిపడుతూ.

"వాడికేం నిక్షేపంలాగున్నాడు. పండంటి పిల్లాడు. నోరొక్కటే లేదుగానీ - వాడికేం తక్కువ? మా తమ్ముడు రెండుచేతులా సంపాయిస్తున్నాడు" అన్నది సుభద్ర భర్త చేతగానితనాన్ని దెప్పిపొడుస్తూ.

"ఆ, సంపాయించాడులే! ఓ గొప్ప! వంటలుచేసి ఏమాత్రం సంపాయిస్తాడేమిటి? అతగాడి సంపాదన వాళ్ళ తిండికి సరిపోతుంది. ఇంకా కొడుకుల కేమిస్తాడు? అయినా వాడొక్కడే కాదుగా! మరొకడుండె" అన్నాడు నారాయణాచారి.

"అయితేమాత్రం! నోరులేనివాడికే ఎక్కువ యిచ్చి పోతాడు. ఆ మాత్రం వాడికి తెలీదా?" అన్నది సుభద్ర.

"నీ వెన్నైనా చెప్పు. నేను మాత్రం నా కూతుర్ని ఆ వాజమ్మకిచ్చి అంటగట్టను" అన్నాడు నారాయణాచారి.

"నా కూతుర్ని నా యిష్టంవచ్చిన చోట ఎలా యివ్వాలో నేనూ చూస్తాను. ఏమైనాసరే. నాకూతుర్ని నా తమ్ముడికొడుక్కి యిచ్చితీరవలసిందే. లేదంటే ఏ నుయ్యో, గొయ్యో చూచుకొంటాను" అంటూ ఏడ్పుసాగించింది.

"సరే, నీ యిష్టంవచ్చినట్లుచావు. చూస్తూ చూస్తూ ఏ తల్లి తన కూతురు గొంతుకోస్తుంది? నీ లాంటిది తల్లేనా? రాక్షసా? బంగారంవంటి పిల్లను చూసిచూసి ఆ మూగ మొద్దుకి అంటగట్టటానికి నీకెలా మనసొప్పిందోగాని, నాకు మాత్రం సుతరామూ యిష్టంలేదు" అంటూ విస్తరి అవతలికినెట్టి బయట చెయ్యి కడిగేసుకున్నాడు.

---

## 2

సుభద్ర తమ్ముడు మరినాలుగు రోజులికి ఊడిపడ్డాడు.

"ఏమే అక్కా— అంతాకులాసా?" అంటూ కుశల ప్రశ్న వేశాడు.

అప్పుడు నారాయణాచారి యింట్లో లేడు. యాయ వారానికి వెళ్ళాడు.

"రారా తమ్ముడూ! ఇంటి దగ్గర మరదలూ, పిల్లలూ అంతా కులాసాగా ఉన్నారా! స్నానం చేస్తావా? నీళ్ళుతోడ మన్నావా?" అన్నది సుభద్ర ఆప్యాయంగా.

"ఆ! ఎందుకూ? చెరువులో రెండు మునకలేసి వస్తాను. ఆఁ! అయితే బావగారింకా యింటికి రానేలేదా? ఆయన కెన్నిసార్లు చెప్పానూ, ఆ వృత్తి మానేయమని? నలుగుర్లో నగుబాట్లపని" అన్నాడు సుభద్ర తమ్ముడు వెంకటాచారి.

"ఆఁ! ఏదో పని ఉండాలిగా తమ్ముడూ? ఆయనకి అదితప్ప మరోపని చేతకాదు. మరి తిండెలా గడుస్తుంది చెప్పు?" అన్నది సుభద్ర.

"ఆహా! ఈ వృత్తివల్ల గడుస్తుందా ఏమిటి నీ వెర్రిగాని? ఇంటింటికీ కాళ్ళరిగిపోయేలా తిరుగుతూ ఎండనక

వానవక ఉస్సురంటూ "భిక్షాం దేహి" అనాల్సిన కర్మమేం? హాయిగా నావెంటరమ్మను. రోజుకి రెండుమూడు రూపాయలు తేలిగ్గా దొరుకుతాయి. ఒళ్ళువంచాలేగాని కనకవర్షం కుర వదూ ?" అన్నాడు వెంకటాచారి.

"ఏమో! ఆయన కివన్నీ నచ్చవు. ఆయనవద్దతేమో, ఆయనేమో! ఒకరిమాట చెవికెక్కదు. సరే, ఈ కబుర్ల కేంలే. ప్రొద్దెక్కుతున్నది. నీవువెళ్ళి స్నానంచేసిరా భోజనం చేద్దువుగాని" అన్నది సుభద్ర.

ఆ, తొందరేముంది? బావనిరానివ్వు. అది సరేకాని పిల్లలేరీ" అన్నాడు వెంకటాచారి.

"పిల్లవాడు బడికెళ్ళాడు, పిల్ల రోడ్డుమీద పేడ ప్రోగేస్తున్నట్లుంది" అన్నది సుభద్ర.

"అమ్మాయ్, నీకూ బొత్తిగా మతిపోతున్నట్లుంది. ఆడపిల్లని, అందులో ఈడొచ్చినదాన్ని పెళ్ళిగాని పిల్లని అలా రోడ్లంట త్రిప్పట మేమిటి? అది పేడ వేసుకురావట మేమిటి?" అన్నాడు వెంకటాచారి ముఖం చిట్లించి.

"ఆ! ఆయన ఒక్కడి సంపాదనమీద ఆధారపడితే రోజులెలా గడుస్తాయి చెప్పు? అయినా ఊరికే తిని కూర్చుని చేసేదేమున్నది? ఈ వేళకి ఊళ్ళో గొడ్లన్నిటినీ చెఱువు దగ్గరికి తోలుకొస్తారు గొడ్లకాపరులు. కాసేపు నిలుచుంటే పదితట్టల పేడ ప్రోగవుతుంది. అవి పిడకలుచేస్తే యిటు

పొయ్యి క్రిందకీ పనికివస్తాయి, అటు అమ్మకానికీ పనికివస్తాయి. వంద పదణాలు తెలుసా?" అన్నది సుభద్ర.

"ఆ! నీ వెన్నైనా చెప్పు. నా కిదేమీ నచ్చలేదు. మొగవాడు కష్టపడి సంపాయించాలి. ఆడకూతురు వండి పెట్టాలి. అంతేకాని ఆడవాళ్ళు వీధులవెంట తిరగటం నా కిష్టంలేదు. చూడు! ఈచీరె నీకు నచ్చిందా? పిల్లకి పరికిణీ, ఓణీ, జాకెట్టు తెచ్చాను. బాగున్నాయో, లేవో చూడు! నచ్చకపోతే మరో రకం తెస్తాను. అబ్బాయికీ లాగు గుడ్డా, షర్టుగుడ్డా తెచ్చాను." అంటూ సంచివిప్పి బట్టలన్నీ నుక్కా మంచంమీద కుప్పపెట్టాడు. ఆ బట్టలన్నీచూసేసరికి సుభద్రకి ఆనందం పట్టశక్యం కాలేదు. ఇన్నేళ్ళ కాపరంలో భర్త ఒక్కసారైనా అటువంటి బట్టలుకొనలేదు, తమ్ముడిమీద ఎక్కడలేని ప్రేమా పుట్టుకొచ్చింది.

"బాగుండకేమిరా? నిక్షేపంగా ఉంటేను! మీబావ ఒక్కసారైనా యిల్లాంటి బట్టలు తెచ్చారా? కట్టుకునే చీరె ఒక్కటేఉంది. రెండోది తెచ్చిపెట్టమని ఎన్నాళ్ళనుంచో పోరుతున్నా ఆయన చెవినవేసుకుంటేగా? పిల్లకి రెండంటే, రెండే పరికిణీలున్నాయి. అవికూడ వెలిసి బొంత రేగిపోయాయి. మోకాళ్ళదాకా వస్తున్నాయి. అన్నీ అతుకులే. ఓణీలు వేసుకునే యీడుకదా, ఓ రెండు పట్టుకు రమ్మని అస్తమానం పోరుతున్నాను. ఆయన వినిపించుకుంటేనా?" అన్నది సుభద్ర నిట్టూరుస్తూ.

"ఓసి పిచ్చిదానా, నాకు కబురంపితే నేను పంపక పోయాననుటే! ఆయన్ని అవస్థ పెట్టకపోతే" అన్నాడు వెంకటాచారి.

"ఆఁ! పెట్టేవారున్నారు కదా అని పైనబడి తింటే ఏం బాగుంటుంది? ఒక రోజుదా ఈ జీవితం? ఒక నాటితో తీరేదా ఈ దరిద్రం? కష్టమో, నిష్ఠూరమో మనకి మనం భరించాలిగానీ" అంటూ బట్టలన్నీ క్రిందామీదా తిరగేసి చూసి భద్రంగా మడత పెట్టింది.

ఇంతలో చంద్రిక ఓ పది తట్టల పేడ యింటి ముందు ప్రోగేసింది. చేతులుకడుక్కొని యింట్లోకివస్తూ "అమ్మోయ్. ఈరోజు ఎంత పేడ అనుకున్నావ్? ఐదువందల పిడకలకి తక్కువ కాదంటే నమ్ము. అవి అమ్మి నాకో మంచి ఓణీకొని పెట్టవ్?" అంటూ చంద్రిక గారాబం చేసింది.

సుభద్ర నవ్వి "ఓసి పిచ్చి పిల్లా! మీ మామయ్య వచ్చాడు చూడు! ఓణీ, జాకెట్టు, పరికిణీలకి బట్టలు తెచ్చాడు" అన్నది.

చంద్రిక సిగ్గుపడుతూ నిలుచున్నది.

"ఇలా రావే కోడలు పిల్లా. ఇవిగో చూడు." అంటూ మంచంమీది బట్టలు తీసి పట్టుకున్నాడు.

చంద్రిక ఉన్నచోటునుంచి కదలలేదు. తలవంచుకొని అలాగే నిలబడ్డది.

"ఊ! వెళ్ళమ్మా. మామయ్య పిలుస్తుంటే వెళ్ళాలి. ఊ. వెళ్ళిచూడు. సిగ్గెందుకు" అన్నది సుభద్ర.

చంద్రిక కదలలేదు. వెంకటాచారి లేచివచ్చి చంద్రిక చెయ్యి పుచ్చుకొని తీసుకెళ్ళాడు.

"ఇవిగో చూడు. నచ్చాయా?" అంటూ ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు.

చంద్రిక బట్టల వంక ఓసారి చూచింది. ముఖం వికసించింది. చిరునవ్వు చిందులాడింది.

"ఏం బాగున్నాయా! మాట్లాడవేం?" అన్నాడు వెంకటాచారి కోడలి బుగ్గగిల్లుతూ.

"ఉ! ఫో. మామయ్యా." అన్నది చంద్రిక కోపం నటిస్తూ.

"మరి మాట్లాడవేం? చెప్పు ఎలావున్నాయో" అన్నాడు వెంకటాచారి.

"బాగున్నాయి" అంటూ మామచేతి పట్టువిడిపించుకొని వంటింట్లోకి పరుగెత్తింది.

"అంత సిగ్గెందుకే పిల్లా! మరి మావాడ్ని చేసుకుంటావా? చేసుకుంటే యింకా మంచి బట్టలు కుట్టిస్తా! తెలిసిందా?" అన్నాడు వెంకటాచారి నవ్వుతూ.

ఇంతలో నారాయణాచారి 'ఉస్సు' రనుకుంటూ యిల్లు చేరాడు. బావమరిదిని చూచాడు. ముఖం చిట్లించుకున్నాడు.

"ఏం బావా? ఇంత శ్రమ దేనికోయ్. ఈ శ్రమే మరో రూపంలో ఖర్చుచేస్తే శ్రమకి రెండింతలు ఫలితం దక్కును కదా!" అన్నాడు వెంకటాచారి.

"ఆ విషయాలన్నీ తర్వాత మాట్లాడు కుందాం కానీ నీవు స్నానంచేసి భోజనం చేశావా? నాకు మాత్రం ఆకలి దహించుకు పోతున్నది. స్నానానికి వెడుతున్నా" అన్నాడు నారాయణాచారి.

"నేనూ చెయ్యలేదు. పదపోదాం" అంటూ నారాయణాచారి వెంట నడిచాడు వెంకటాచారి. ఇద్దరూ స్నానం చేసి బట్టలు పిండుకొని ఆరవేశారు.

"ఆచారిగోరూ! ఎవరో చుట్టాలొచ్చినట్టుండారే! ఏందీ సంగతి?" అన్నాడు సూరయ్య బారెడు చుట్ట నోట్లో యిరికించి.

"ఆ! ఎవరూలేరు. మా బావమరిది సూరయ్యా" అన్నాడు నారాయణాచారి.

"ఆయనగోరికి ఎందరు పిల్లలు సామీ" అన్నాడు సూరయ్య చుట్టతీసి తుపుక్కున ఉమ్ముతూ.

"ఆఁ! ఎందుకులే! ఇద్దరే సంతానం. ఇద్దరూ మొగ పిల్లలే" అన్నాడు నారాయణాచారి.

"అదృష్ట వంతుడన్నమాటే! ఆదాయేగాని కరుసు లేదన్నమాటే! కొట్టాడు చాన్సు నా సామి రంగా" అన్నాడు వెంకయ్య నులక పేనుతూ.

"ఆ! ఏం ఛాన్సులే వెంకయ్యా. అదంతా భాగ్య వంతుల విషయం. లేని వాళ్ళకి ఎవరైనా ఒకటే. ఆడా, లేదు, మగా లేదు". అన్నాడు నారాయణాచారి.

"అట్టెట్టా పంతులుగోరూ! మీరైన్నైనా సెప్పండి. ఓరి యిలవ ఆరిదే. కలవాళ్ళకి కావెడుకాసులు సంపాయించి పెడితే కూలోడి కొడుకు కుండెడు నూకలైనా సంపాయించడా? ఎట్టయినా మొగబిడ్డ మొగబిడ్డే. ఆడబిడ్డ ఆడబిడ్డే. ఇంతకీ ఆచారిగారి అదుష్టం బాగుంది. అందుకే పైసా కర్చు కాకుండా అల్లుడు దొరికేడు. ఏం ఆచారిగోరూ! ఏమంటారు" అన్నాడు సాంబయ్య ఆవుకి పలుపు వేసుతూ.

"ఆఁ! ఎవరైతే మాత్రమేమిటోయ్! అయినా అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది. విధి విలాసం ఎవరూ తప్పించలేరుగా! జరిగేది జరక్క మానదు" అన్నాడు నారాయణాచారి.

"అంతేలే మరి. కడుపు నిండిన వాడికబుర్లకేం. కట్ట పడకుండా అల్లుడు దొరికితే అట్టాగే ఉంటదిలే. కాళ్ళరిగేలా నాలుగూళ్ళు తిరుగుతే అప్పుడు తెలిసొచ్చుద్ది అల్లుడి యిలవ" అన్నాడు సూరయ్య.

ఆరిన బట్టలు మడతపెట్టి "పదవోయ్ బావా. ఇంటికి పోదాం" అన్నాడు నారాయణాచారి వెంకటాచారితో.

"ఆచారిగోరింకా బోజనం సెయ్యేనట్టుంది. ఎల్లిరండి బాబూ. సాయంత్రం తీరిగ్గా మాట్టాడుకోవచ్చు" అన్నాడు వెంకయ్య.

"ఆ! మరే. వస్తాం" అన్నాడు నారాయణాచారి.

"పురాణం సంగతి మరిసిపోమాకండి ఆచారిగోరూ" అన్నాడు సాంబయ్య గుర్తుచేస్తూ.

"ఆ! అదెందుకు జరుగుతుంది! పురాణశ్రవణం మామూలే" అన్నాడు నారాయణాచారి నడుస్తూ. వెంకటాచారి, నారాయణాచార్ని అనుసరించాడు. ఇద్దరూ యిల్లు చేరారు.

సుభద్ర యిద్దరికీ వడ్డన ప్రారంభించింది. "ఏమిటోయ్ విశేషాలు! అంతా కులాసాయేనా?" అన్నాడు నారాయణాచారి బావమరిదిని పలకరించకపోతే బాగుండదన్న ధోరణిలో.

"ఆ! ఏమున్నాయి? అంతా కులాసాయేగాని నీవింకా ఆ వృత్తే పట్టుకు వ్రేలాడటం నాకేమీ నచ్చలేదోయ్ బావా" అన్నాడు వెంకటాచారి.

"ఏ వృత్తి?" అన్నాడు నారాయణాచారి నొసలు చిట్లించి చూస్తూ.

"అదే. యాయవారం" అన్నాడు వెంకటాచారి.

"ఓస్, అదా! అది మా వాళ్ళంతా చేశారు. నేనూ చేస్తున్నాను. అయితే నాతోనే ఆఖరులే. మావాడు చదువుకొంటున్నాడుగా! ఏదో వుద్యోగం దొరక్కపోదు" అన్నాడు నారాయణాచారి.

"వాడిసంగతి సరేలే, నీవుమాత్రం ఎందుకుచెయ్యాలి? నా వెంటరా, రోజుకు రెండూ, మూడు రూపాయలకు

తక్కువ కళ్ళచూడవు. నామీద ఒట్టు" అన్నాడు వెంకటా చారి.

"డబ్బుకు మితమేమున్నదోయ్ ఎంతవచ్చినా చాల దన్న అసంతృప్తి తప్ప. తీరినకొద్దీ కోర్కెలు మీరు తుంటాయి. భిక్షాధికారికి లక్షాధికారి కావాలని వుంటుంది. లక్షాధికారికి కోటీశ్వరుడు కావాలని వుంటుంది. ఈ కోర్కెల తీరే అంత. ముఖ్యంగా మనం చూడవలసినదల్లా మన కనీసపు టవసరాలు తీరుతున్నాయా లేదా అని. తిండికీ బట్టకీ లోటు లేకుండా జరిగితే యింక చింతించవలసింది దేనికీ? ఈ జీవితాలు క్షణభంగురాలు కదా వీటికోరకింత తాపత్రయం దేనికి?" అన్నాడు నారాయణాచారి.

"బాగానేవుంది వేదాంతం. ఇదెప్పటి నుంచోయ్. నీకూ నాకూ కోర్కెలు లేవుకాబట్టి అంగవస్త్రంతో సరి పెట్టుకుంటాం. కానీ పిల్లలూ, పెళ్ళాం మాటో. నీవు చెప్పే వేదాంతం గోచీపాత రాయుళ్ళకి చెల్లుతుంది. కానీ సంసా రుల మాటో. ముక్కుమూసుకు కూర్చోమంటే అంతా కూర్చుంటారా ? ఈ జీవితంలో అందమేముంది ? బ్రతికేది కొన్నాళ్ళేకదా. కష్టమైనా, సుఖమైనా ఆనందమైనా అనుభ వించేది యిప్పుడే. చనిపోయాక ఏమవుతామో ఎవరికి తెల్సు?" అన్నాడు వెంకటాచారి.

"అదీ నిజమే, చనిపోయాక ఏమవుతామో ఎవరికీ నిర్ధారణగా తెలియదు. అయితే చనిపోతామన్నమాట అంద రికీ నిర్ధారణగా తెల్సిన విషయమేగా. ఈ బ్రతికిన కొద్దీ

రోజులూ చీకూ, చింతా లేకుండా కలిగిన దానితో తృప్తిగా జీవించటం మంచిది కాదా? అది లేదనీ, యిది లేదనీ బాధ పడి వాటిని పొందటానికి యమయాతనపడి చివరికి సాధించా మనుకో, అది అందనంతవరకే దానిమీద మనకి మక్కువ. అందిన తర్వాత దానిమీద విముఖత్వం ఏర్పడుతుంది. దాని మీది వ్యామోహం తొలగిపోతుంది. దృష్టి మరోదాని మీదికిపోతుంది. జీవితమంతా ఈ పోరాటంతోనే సరి పోతుంది. ఇంక సుఖం ఎక్కడ? శాంతి ఎక్కడ? మాన వుడికి తృప్తే ముఖ్యమైంది. అది కరువైననాడు ఎన్నిఉన్నా జీవితానికి శాంతి సుఖాలు కలుగవు" అన్నాడు నారాయణా చారి.

"అదంతా మీబోటివాళ్ళకి. మాబోటి పామరులకి అవి నచ్చవు. బ్రతికినంతకాలం రెండుచేతులా సంపా యించటం, కావలసినదల్లా అనుభవించటం, తృప్తిగా చావటం. జీవితమంతా మడికట్టుకు కూర్చుంటే చివరికి అది అనుభవించలేదు, యిది అనుభవించలేదు, అప్పుడే జీవితపు ఒడ్డుకి చేరామే అన్న బాధ పీడిస్తుంది. కావలసినవన్నీ అనుభ విస్తే ఎప్పుడు చచ్చినా దిగులులేదు" అన్నాడు వెంకటా చారి.

"అదే పొరపాటు, అన్నిసుఖాలూ అనుభవిస్తుంటే, యింకా అది అనుభవించకపోతినే, యిది అనుభవించక పోతినే, అప్పుడే జీవితం ముగిసిపోతున్నదే అని చింతించక మానరు. మానవుడికి తృప్తేదీ? అనుభవించిన కొద్దీ అనుభ

వించాలన్నకోర్కె సహజం. తిన్నకొద్దీ రుచులు పెరుగు తాయి. తిన్నవాడికే వాపిరిగొట్టుతనం హెచ్చన్న సామెత నీవు వినలేదా? సరే, ఇప్పుడా వేదాంత చర్చలన్నీ దేనికీ, భోజనం విషయంచూడు" అన్నాడు నారాయణాచారి నవ్వుతూ.

"ఆ విషయంలో మనకి ఒకరు హెచ్చరికచేయ నవ సరంలేదు. అహారంపట్ల వ్యవహారంపట్ల మొహమాటంకూడ దని ఆర్యోక్తి. మనకా రెండిటిపట్లా మొహమాటం లేదులే. భయపడకు. ఇంతకీ అమ్మాయి కెడొస్తున్నది. పెళ్ళిమాటేం చేశావు?" అన్నాడు వెంకటాచారి అసలు విషయానికొస్తూ.

"అప్పుడే ఏంతొందర? పట్టుమని పదేళ్ళు నిండలేదు. అమ్మాయి సంగీతం నేర్చుకుంటున్నది. వాళ్ళ మాష్టారు గూడా పెళ్ళికి తొందరేమి టంటున్నారు" అన్నాడు నారా యణాచారి తప్పించుకొనే ధోరణిలో.

"అదేమిటి బావా? ఏ వయస్సులో జరగాల్సిన పని ఆ వయస్సులో జరిపితే అచ్చటా, ముచ్చటా. చదువులూ, సంగీతాలూ దేనికీ? ఊళ్లేలనా? ఉద్యోగాలు చెయ్యనా? పాటకచ్చేరిల చెయ్యనా! ఏదో చాకలిపద్దు చూసుకుందుకూ, ఓ ఉత్తరంముక్క వ్రాయగలందులకూ చదువు. అంతవరకొస్తే చాలు. ఇక సంగీతమంటావా? మంగళ హారతులూ అష్ట పదులూ పాడటంవరకొస్తే సరి. దైవ సంకీర్తన చెయ్యటానికి సంగీతం నేర్వాలా? సామాన్య సంసారికి యింతకంటే చదు వులూ, సంగీతాలూ అనవసరమని నా అభిప్రాయం. అతి

సర్వత్రవర్జయేత్ అన్నారు. ఏ విషయంలోనూ 'అతి' పనికి రాదు" అన్నాడు వెంకటాచారి.

"అది నిజమేనోయ్. కానీ దాని కంఠం బాగుందనీ, సంగీతంలో విద్వాంసురాలు కాగల సూచనలున్నాయనీ వాళ్ళ మాష్టారంటున్నారు. పెళ్ళంటూ తలపెట్టి విద్యానాశ నానికి పూనుకోవద్దని సలహా చెప్పారు" అన్నాడు నారాయణాచారి.

"ఒకళ్ళ సలహాతో మనకి పనేమిటి? మన పరిస్థితుల కనుగుణంగా మనం నడుచుకోవాలి గానీ" అన్నాడు వెంకటాచారి.

"మన పరిస్థితులూ ఏమీ బాగాలేవుగా! పెళ్ళంటే మాటలా? వందల్తో పని. ఎక్కడనుంచి తెచ్చేది?" అన్నాడు నారాయణాచారి ఆ విధంగానన్నా తప్పించుకో వచ్చునని.

దాని దేముంది? ఉభయ ఖర్చులూ నేనే భరిస్తాను. పరాయివాళ్ళం కాదుగా. అక్క కూతుర్ని చేసుకోవటానికి ఎవరు ఖర్చు భరిస్తేనేం" అన్నాడు వెంకటాచారి.

"నీవు భరిస్తావనుకో, కానీ లోకం ఊరుకోదుగా. పెళ్ళి యినా చెయ్యలేనివాడివి పిల్లల్నెలా కన్నావని ఆడి పోసుకుంటారు" అన్నాడు నారాయణాచారి.

"అన్నీ తెలిసేనా యిందాక అలా మాడాట్లావు! అందుకే నేను చెప్పాను లాభంలేనిపని దేనికీ చెయ్యటం అని, అంటే వింటేనా? ధనమూలమిదం జగత్ అన్నారంటే

ఎంత అనుభవంమీద చెప్పినమాటో యిప్పుడైనా గుర్తిం చావా? దీపముండగానే యిల్లు చక్కపెట్టుకోమని సామెత ఈ శరీరం శాశ్వతమా? ఏనాడో చెప్పా, చెప్పాపెట్టకుండా కన్నుమూస్తాం. మనని నమ్ముకున్నవాళ్ళు నట్టేట్లో మునిగి పోతారు. పైగా ఏ నాడేమి వస్తుందో ఎవరికెరుక? రోగం, రొష్టూ వస్తే మందూ మాకూ చూడాలా? తిండీ తిప్పలూ గడవాలా? రేపన్నరోజుకింత ఆధరువు అట్టేపెట్టుకోవాలి. ఏరోజు ఎటువంటిదో." అన్నాడు వెంకటాచారి ఉపదేశించే ధోరణిలో.

నారాయణాచారికి చిరాకెత్తుకొచ్చింది. "సరే, మీ యిష్టం. ఎలా చెయ్యాలనుంటే అలా కానివ్వండి. ఈ యింట్లో నా పెత్తనం తగలడింది గనుకనా" అన్నాడు విసుక్కొంటూ.

"అదేమన్నమాట. ఆమాటకొస్తే మావాడికి పిల్ల దొరకదని భయపడకు. ఎవరైనా యిస్తారు. ఏదో అయిన సంబంధం కదా, మేనరికం పోగొట్టటం దేనికని నా ప్రాకు లాట అంతే. పైగా అక్కయ్య ఏమైనా అనుకుంటుందని నా బాధ. చూచావా, సంపదచూసుకొని చుట్టరికం వదులుకున్నా డని నిష్టూర మాడుతుందని బాధపడుతున్నా. నీవేదో తల కెత్తే ధోరణిలో మాట్లాడుతున్నావు." అన్నాడు వెంకటా చారి నిష్టూరంగా.

నారాయణాచారి మెత్తబడక తప్పలేదు. "అలా ఎవ రన్నారోయ్. చూస్తూచూస్తూ బంగారమంటి పిల్లని ఆ నోరు

లేనివాడి కెలా యివ్వమన్నావు? నీ కూతురైతే యిలా మాట్లాడుతావా?" అన్నాడు నారాయణాచారి అసలు విషయం బయటపెడ్తూ.

"వాడి కదొక్కటే లోటు. అయినా నోరుండి మీ రంతా చేసిన నిర్వాక మేమిటి? తిండికీ బట్టకూ లోటుండదు. నోరుంటేనేం? లేకుంటేనేం? చంద్రిక జీవితం నిశ్చింతగా వెడుతుంది. నీకా బెంగ అక్కర్లేదు. నేను అంతా ఆలోచించే వెనకేస్తున్నాను. వాడిని అన్యాయం చేస్తానా? ఇద్దరూ ఒక కడుపున పుట్టినవాళ్ళే. ఒకర్ని అన్యాయంచేసి సంపాయించే దేముంది?" అన్నాడు వెంకటాచారి.

"ఏమో, నీవు చూచినంతమాత్రాన వాడితమ్ముడూ, మరదలూ సరిగాచూస్తా రనేమిటి?" అన్నాడు నారాయణాచారి సందేహం వదలక.

"అలాంటి పిచ్చిఊహలు మానెయ్యి. నా కిద్దరూ రెండుకళ్ళు. చూస్తూ చూస్తూ ఎవరూ ఒక కంట్లో పొడుచుకోరు. నేనెవర్నీ అన్యాయం చెయ్యను." అన్నాడు వెంకటాచారి.

"ఆ విషయం పెళ్ళికిముందే తెల్చితే మంచిది. వాడి భాగం వాడికి పంచియివ్వు. రేపటి రోజెలా వుంటుందో ఎవరు చెప్పారు?" అన్నాడు నారాయణాచారి.

"అయితే నామాట నమ్మనన్నమాట. నా కొడుకుని నేనే అన్యాయం చేస్తానా?" అన్నాడు వెంకటాచారి.

"తెగేదాకా లాగటం మంచిదికాదు. అంతగా వాడు చెప్తుంటే అపనమ్మకం దేనికీ. వాడి పిల్లల విషయం వాడికి తెలీదా ? మనం చెప్పటందేనికీ? తొందరేముంది ! వాళ్ళ తదనంతరం విషయంకదా" అంటూ మధ్యవర్తిత్వం వహించింది సుభద్ర యింక విషయం ముదరకుండా.

"సరే, మీరూ మీరూ ఒకటైనప్పుడిక నేను చెప్పేదేముంది ? మీ యిష్టమొచ్చినట్లు కానివ్వండి." అన్నాడు నారాయణాచారి.

అంతటితో ఆ ప్రసంగం ముగిసింది. సుభద్రకి బరువు దింపి నట్లయింది. ఇంక నిశ్చింతగా పనులు చూచుకోసాగింది.

నారాయణాచారి మామూలు వేళకి పురాణం చెప్పటానికి వెళ్ళాడు. అతని మనస్సు మనస్సులో లేదు. పరిస్థితులు చెయ్యిదాటి పోయాయి. ఏదైతే చెయ్యకూడదనుకున్నాడో అందుకు తనే అనుమతించాడు. ఇంక దానికి తిరుగేముంది ? నిష్కృతేముంది? జరిగేది జరక్కమానదు. విధిని దాట తరమా ?

---

# 3

చంద్రిక పెళ్ళి నిరాడంబరంగా జరిగి పోయింది. చంద్రిక సంగీత సాధనకి అంతరాయం ఏర్పడింది.

చంద్రికచేత పళ్ళూ, కొబ్బరికాయా, తమలపాకులూ సంగీత మాస్టారు వేణుగోపాలాచారి కిప్పించాడు నారాయణాచారి.

వేణుగోపాలాచారికి దుఃఖం ముంచుకొచ్చింది. చుబుకం పుణికి దగ్గరికి తీసుకొన్నాడు. చంద్రిక చేతిలో చీరా, రవికా ఉంచాడు.

"అమ్మా, చంద్రికా నీకెప్పుడైనా సంగీతం నేర్చుకునే అవకాశం అవసరం వస్తే నాదగ్గరికిరా. సందేహించకు. నీకే సాయం కావలసినా నేనున్నాను. సుఖంగా అత్తవారింటికి వెళ్ళిరా తల్లీ. మన ఆచారం ప్రకారం ఆడపిల్ల పెళ్ళి చేసుకొని అత్తారింటి కెళ్ళక తప్పదుతల్లీ. చదువులూ, సంధ్యలూ సామాన్యులకి గగన కుసుమాలు. గృహిణీత్వమే సర్వసామాన్యం, వెళ్ళిరాతల్లీ" అంటూ దీవించి పంపారు. చంద్రిక కివేమీ అవగాహనకావు. కాని పెద్దల కళ్ళల్లోని నీళ్ళుచూస్తే తనకీ కన్నీళ్ళాగలేదు. వారెందుకంత బాధ పడుతున్నారో ఆ పసిహృదయానికేం తెల్సు?

చంద్రిక అత్తవారింట అడుగుపెట్టింది. చంద్రిక మేనత్త అలివేలు చంద్రికనుచూసి పొంగిపోయింది. అంత చక్కనిచుక్క తన కోడలైంది. అందులోనూ నోరూవాయీ లేని ఆ మూగవాడికి భార్యదొరికింది. ఇన్నాళ్లూ పిల్లని ఎవరిస్తారా, పెళ్ళెలా అవుతుందా అని విచారించింది. కానీ యిప్పుడిక నిశ్చింత. ఇంక రెండో వాడికికూడా ముడిపెడ్తే తనుబాధ్యత తీరినట్లే. అదెంతపని! ఎవరైనాగంతేసి పిల్లనిస్తారు. అన్నీ వున్నవాడికి పెళ్ళెంత సేపులో అవుతుంది?

చంద్రిక అత్తగారింట్లో అడుగు పెట్టిన కొద్దిరోజులకే మరిదికి పెళ్ళయింది. తోడికోడలు కాపరానికి వచ్చింది.

చంద్రిక తోడికోడలు అనంతలక్ష్మి అందగత్తేమీ కాదు. అతి సామాన్యంగా ఉంటుంది. కానీ పుట్టింది కలవారింట్లోనే, పిల్లవాడు రూపవంతుడు, విద్యావంతుడు. అందువల్ల పుట్టింది పేదవారి కడుపునైనా, తండ్రి వంటవాడైనా యిచ్చిచేశారు అనంతలక్ష్మి తల్లిదండ్రులు.

చంద్రిక భర్తపేరు సుబ్రమణ్యాం. మరిది రామచంద్రం. అన్నదమ్ములిరువురూ అందగాళ్లే, అయితేయేం? విధివశాత్తు సుబ్రమణ్యాం మూగవాడిగా పుట్టాడు. రామచంద్రానికే లోటూ లేదు. అందువల్ల అతగాడు చదువు నేర్చాడు. అందానికితోడు విద్య సమకూరింది. అది గర్వకారణమైంది. అన్నగారి పట్ల విముఖత్వాం ఏర్పడింది. గౌరవభావం స్థానే అలక్ష్యాం, తేలిక భావం స్థావర మేర్పరచుకొన్నాయి. సామాన్యంగా అన్నగారందుండవలసిన మక్కువ

గౌరవం, శ్రద్ధాసక్తులు రామచంద్రానికి కలుగలేదు. అందు వల్ల 'అన్నయ్యా' అని ప్రేమగా పిల్చేబదులు 'మూగీ' అంటూ హేళనగా పిల్చేవాడు.

అనంతలక్ష్మి కొద్దిగా చదువుకున్నది. పైగా కలవారి బిడ్డ. గారాబుపట్టి. తను కలవారి బిడ్డననే భావం, గర్వం అనంతలక్ష్మిలో పాతుకుపోయాయి. బీదవారిపట్ల అలక్ష్యం, అసహ్యం ఆమెకి ఉగ్గుపాలతో వచ్చిన గుణాలు.

అసలే గర్వపోతు. ఆపైన భర్త అండదండలున్నాయి. బావగారియందు భక్తి శ్రద్ధలు, గౌరవాలకి బదులు అల సత్వం ఏర్పడింది. అందుకు రామచంద్రం ప్రవర్తనే కారణం. స్వంత తమ్ముడే అలక్ష్యం చేస్తుంటే తను గౌరవంగా ఎందుకు చూడాలని అనంతలక్ష్మి ఉద్దేశ్యం.

బావగారిపట్ల విముఖత్వం వహించిన అనంతలక్ష్మి అక్కగార్నెలా గౌరవిస్తుంది పైగా చంద్రిక పుట్టింది పేదరికంలో, పెరిగింది పేదరికంలో, పేదరికం చంద్రికను నర నరాలా జీర్ణించుకు పోయింది. చంద్రికను చూచినప్పుడల్లా హేళనగా నవ్వేది లక్ష్మి. పైగా చంద్రికపట్ల విముఖత్వానికి మరో హేతువుకూడాఉంది. చంద్రిక పేదరికంలో పుట్టినా పంకజం లాంటిది. ఆమె అందచందాలలాంటివి. లక్ష్మికి ధనం సమకూర్చగల కృత్రిమ సౌందర్యమేగాని సహజ సౌందర్యం మృగ్యం.

చంద్రికను 'అక్కా' అని సంబోధించేందుకు మారుగా 'చంద్రా' అంటూ పిలుస్తుంది. చంద్రిక యిలాంటి విష యాలు పట్టించుకోదు. ఏ పేరుతో పిల్చినా, ఎలా మాట్లా

డినా తన సహజ కంఠంతో సమాధానం చెప్పడమే ఆమె కలవాటు.

"చంద్రా, నీ జడెంత పొడవుగా ఉందో" అంటూ చంద్రిక జడవంక రెప్పవాల్చక చూచేది. తన జడవంకచూచు కొనేది. చంద్రజడంత తన జడా ఉండాలన్న ఉద్దేశ్యంతో కుచ్చులు పెట్టో, సవరంపెట్టో జడ అల్లుకొనేది. దానితోనే తృప్తిపడేది.

చంద్రిక మేనిచ్ఛాయ పచ్చని పసిమి. లక్ష్మి చామన చాయ. చంద్రికవంక ఈర్ష్యతో చూచేది. తనవంక జుగుప్సా దృష్టితో చూచుకొనేది. అనేక రకాల పౌడర్లూ, స్నోలూ, లిప్‌స్టిక్‌లూ వాడేది! వాటితో సౌందర్యాన్ని పెంపొందించుకో చూచేది. ఎంత పౌడరు రాసినా సహజరంగు మరుగు పడు తుందా ? నల్లటి శరీరంమీద తెల్లటి పౌడరురాస్తే వీధిభాగ వుతులను తలపింప జేసేది.

చంద్రిక అంటే భయపడేది లక్ష్మి. అందుకు కారణం చంద్రిక లావణ్యవతి కావడమే. తను చంద్రికతో తులతూగ గల అందగత్తెకాదు. ధనం వెచ్చించి సంపాదించగల అంద మైతే అది ఏనాడో సమకూర్చుకొని వుండేది. కానీ అది భగవత్ ప్రసాదంకదా! చంద్రిక భర్త మూగవాడు. అమా యకుడు. అందువల్ల చంద్రిక తన భర్తని వలలో వేసుకో ప్రయత్నిస్తుందేమోనన్న భయం లోలోపల పీడిస్తుండేది లక్ష్మిని. ఏనాడైనా తన భర్త చంద్రిక సౌందర్యంముందు దాసోహమనగలడని భీతిల్లేది. అందుకే చంద్రికను దూరంగా ఉంచటానికి ప్రయత్నించేది.

అలివేలుకి చంద్రిక అంటే ఆప్యాయత. లక్ష్మి అంటే భయం. లక్ష్మి ధనవంతుల పిల్ల. ఏమంటే ఏమనుకొంటుందో నని భయం. ఇంటిపనంతా అలివేలు చేసుకొనేది. కోడళ్ళు వచ్చాకకూడా ఆమే చేసుకునేది. కాని చంద్రిక అత్తగారికి ప్రతిపనిలోనూ సాయపడేది. లక్ష్మి సహజంగా సోమరి. పైగా పుట్టింది భాగ్యవంతుల యింట్లో. నడిస్తే అరిగిపోతుందని భయ పడేవారు లక్ష్మి తల్లిదండ్రులు. అన్ని పనులూ పనివాళ్లే చేసేవారు. లక్ష్మికి ఏపనీ చెయ్యటం అలవాటు లేదు. "అమ్మాయ్ లక్ష్మీ! అక్క ఒక్కర్తే నీళ్ళు చేదుతున్నది. నీవు వెళ్ళి సాయంపట్టు. త్వరగా తెములుతుంది" అన్నది అలివేలు.

"ఏమోనండి అత్తయ్యా, అలాంటి పనులు నాచేత కావు. మా వూళ్ళో నీళ్ళకి కొదవలేదు. కుళాయి యిలా త్రిప్పితే అలా ఝుమ్మంటూ నీళ్ళొస్తాయి. ఈ పల్లెటూరి పనులు నాచేతకావు బాబూ. చంద్రికనే చెయ్యనివ్వండి. ఆవిడకివన్నీ పుట్టినప్పటినుంచీ అలవాటు" అన్నది లక్ష్మి ముఖం చిట్లించి.

"ఆ, మరేనమ్మా. లక్ష్మిపుట్టింది లక్ష్మి సంపన్నుల యింట్లో, గారాబుకూతురు. పెరిగింది పట్నంలో సుకు మారంగా. మనమోటు పనులు ఆవిడకి చేతకావు. వదినని చెయ్యనిద్దూ" అన్నాడు రామచంద్రం బట్టలు విప్పి టవలు చుట్టబెట్టుకొని స్నానానికి వస్తూ.

"వదినా నీళ్లుకాగాయా? చూడు. నేను స్నానం చేస్తాను. నీళ్ళు తోడిస్తావా?" అన్నాడు రామచంద్రం చంద్రికతో.

చంద్రిక నీళ్ళుతోడుతున్నదల్లా చేద బావి ఒడ్డున పెట్టింది మరదికి నీళ్ళుతోడిచ్చే ఉద్దేశ్యంతో.

బ్రష్‌తో పళ్ళుతోముతున్న లక్ష్మి గబగబ ఆ పని ముగించింది.

"నీవెందుకులే చంద్రా. నీపని నీవు కానివ్వు. ఆయనకి నేను నీళ్ళు తోడిస్తానులే" అంటూ బకెట్ పట్టుకొని తయారైంది లక్ష్మి.

"ఆ, నీకుదేనికే ఆ శ్రమ. వదిన తోడిస్తుందిలే. మళ్ళీ బట్టలు దేనికి ఖరాబుచేసుకుంటావు?" అన్నాడు రామచంద్రం నవ్వుతూ భార్యని వారిస్తూ.

చంద్రి లక్ష్మిచేతిలోని బకెట్ తీసుకుంది నీళ్ళుతోడ డానికిగాను.

లక్ష్మి రుసరుస లాడుతూ "అదేమిటె నా భర్తకి నీళ్ళుతోడటానికి నాకు అధికారంలేదా? అనవసర విష యాల్లో దేనికి జోక్యం కల్పించుకుంటావు? ప్రతిసారీ మామధ్య వస్తావు దేనికీ" అంటూ చరచరా యింట్లోకి వెళ్ళిపోయింది.

చంద్రిక నిర్ఘాంతపోయి అల్లాగే చూస్తూ నిలబడింది. కొంతసేపు శిలా ప్రతిమలా అలాగే ఉండిపోయింది. ఆ తర్వాత మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ బావి దగ్గ రికి వెళ్ళి చేదతీసుకొని మళ్ళీ నీళ్ళు తోడటాని కుపక్ర మించింది.

"లక్ష్మీ, నీళ్ళుతోడిపో" అన్నాడు రామచంద్రం నిట్టూరుస్తూ.

"ఆ! నేను దేనికీ? మీ ప్రియమైన వదిన ఉందిగా అన్నీ చేసిపెట్టేందుకు, చేయించుకోండి. మళ్ళీ నన్ను పిలవటం దేనికీ" అంటూ లక్ష్మి జవాబిచ్చింది. రామచంద్రం దీర్ఘంగా నిట్టూర్చి నీళ్ళ కాగు దగ్గరికి బకెట్ తానే స్వయంగా తీసుకెళ్ళాడు. చెంబుతో వేడి నీళ్ళుతీసి బకెట్‌లో పోస్తున్నాడు. అలివేలు దొడ్లోకివచ్చింది ఏదో పనిమీద. కొడుకుని చూచి "దేనికిరా నీకా పని. ఉండు. చంద్ర తోడి పోస్తుంది. అమ్మా చంద్రా, మీ మరిదికి నీళ్ళుతోడివ్వమ్మా" అన్నది.

"వద్దమ్మా, ఎంత పని. నేనే తోడుకుంటాను. చేస్తే చేసే పనిని చెడగొట్టకు" అంటూ వారించాడు.

"సరే. అయితే. నీవులే. నేనే తోడిస్తాను" అన్నది అలివేలు కొడుకు చేతిలోని చెంబు తీసుకుంటూ.

రామచంద్రం సబ్బుపెట్టి తెచ్చుకొని స్నానం ముగించాడు.

"టవల్ తీసుకురా లక్ష్మీ" అన్నాడు రామచంద్రం బిగ్గరగా.

"నేను దేనికీ? మీ వదిన ఉందిగా. ఆవిడ్ని అడగండి" అంటూ సాధించింది లక్ష్మి.

తడి టవల్‌తో అలాగే నీళ్లు కారుతూ యింట్లోకి అడుగెట్టాడు. చంద్రిక మరదికి టవల్ అందించింది.

"మీ వదిన యిచ్చిందిగా. ఇంక నన్నెందుకు రొష్టు పెడతారు?" అంటూ మూతి ముడిచింది లక్ష్మి.

"సరేలే, ఎవరో ఒకరు పని చెయ్యాలిగా! ఏదైనా అడిగితే మా పుట్టింట్లో చెయ్యలేదంటూ ప్రారంభిస్తావు. ఇతరులు చేస్తే ఓర్చలేవు. మరి పను లెలా గడుస్తాయి? ఆ బట్ట లిలా అందివ్వు" అన్నాడు రామచంద్రం భార్యను మందలించే ధోరణిలో.

"ఇంకేం. మీరూ ఆవిడనే వెనకేసుకు రండి. ఈ యింట్లో నే నుంటేనేం? చస్తేనేం! ఎవరికి కావాలి. భార్యంటూ ఉందన్న జ్ఞానం మీకు లేకపోయె. నేను ఉండీ లేని దాన్నయి పోయాను." అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది లక్ష్మి.

రామచంద్రం నిట్టూర్చి బట్టలు స్వయంగా తనే తీసుకున్నాడు. లక్ష్మి చుబుకం పట్టుకొని "దేనికీ అర్థంలేని తగాదాలు, వ్యర్థపు మాటలు! నిన్ను ఎవరన్నా చెయ్యావద్దన్నారా? నీవే నాకీ పని చేతకాదు. ఆ పని చేతకాదు. మా పుట్టింట్లో ఈ పనులన్నీ నవుకర్లు చేస్తారంటూ చెప్తావు. ఎవరో ఒకరా పనిచేస్తే మళ్ళీ ఓర్చలేవు". అన్నాడు.

లక్ష్మి బుంగ మూతి పెట్టింది "అనండి. అనండి. అంతా నన్నే అనండి" అంటూ కళ్లు తుడుచుకుంది.

రామచంద్రం త్వరగా బట్టలు వేసుకొని "వదినా, వంటయిందా! త్వరగా వడ్డించు. నేను స్కూలుకి వెళ్ళాలి. టైము అయింది" అని కేక వేశాడు.

"అదిగో. చెట్టంత మనిషిని ఎదురుగా పెట్టుకొని అస్తమానం వదినా, వదినా, అంటూ కలవరిస్తారేం? ఏం? మీకు వడ్డించటానికి నేను తగనా?" అంది లక్ష్మి ముఖం చిట్లించి.

"అదుగో. అదే నీతోటి చిక్కు. ఎవరైనా వద్దన్నారా? వడ్డించ దల్చుకుంటే నిక్షేపంగా వడ్డించు. రోజూ ఆమె పెడుతున్నది కనుక కేక వేశాను. నీవు చెయ్యవు. ఇతరుల్ని చెయ్యనివ్వవు. నీతో వచ్చిన చిక్కే అది" అన్నాడు రామచంద్రం తల దువ్వుకుంటూ.

"మిగతా పనులు నా చేత కావన్నాను గానీ భర్త అవసరాలను సమకూర్చడం కూడా చేత కాదన్నానా? ఏ ఆడదైనా తన భర్త పనులు తనే చేసుకుంటుంది. ఇందులో వింతేముంది? మీ కేపని ఎవరిచేత చేయించుకోవాలో కూడా తెలియదు. అంతా నా ఖర్మ." అంటూ నుదురు మీద కొట్టుకుంది లక్ష్మి.

"అదిగో. అక్కడే పెద్ద చిక్కువచ్చింది. నీకు ఏ పనులు చెయ్యటం వచ్చో, ఏవి రావో నాకెలా తెలుసు? ఓ లిష్టు వ్రాసి పడెయ్యి. ఆ ప్రకారం ఎవర్ని పిలిచి చేయించుకోవాలో అర్థమవుతుంది" అన్నాడు నవ్వుతూ భోజనానికి తయారై.

"మీకు నేనంటే అంత హేళనగా వుందన్నమాట. సరే. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి. నేను పుట్టింటికెడతాను. నా అవసరం లేనిచోట నేనుండి మాత్రం ప్రయోజన మేమిటి?" అంటూ మూతి విరిచింది లక్ష్మి.

"సరే. ఆ విషయం తర్వాత ఆలోచిద్దాం. నాకిప్పుడు టైములేదు. ముందు అన్నం వడ్డించు. ఆ పైన నీ సంగతి చూస్తాను" అన్నాడు రామచంద్రం పుస్తకాలు తీసి పెడుతూ.

"ఏమో బాబూ. మీ వదినగార్ని వడ్డించమన్నారుగా. మళ్ళీ నేను దేనికి? ఆవిడనే వడ్డించ నివ్వండి" అన్నది లక్ష్మి కోపంతో బిర్రబిగిసి.

"సరే. నీ యిష్టం. నేను చేస్తా, నేను చేస్తా నంటూ ఉబలాట పడుతుంటే చెప్పాను. మళ్ళీ కాదంటున్నావు. నిన్ను బ్రతిమిలాడేందుకు నాకు టైము లేదు. త్వరగా వెళ్ళాలి. వదినా. అన్నం వడ్డించవమ్మా" అంటూ వంటింటి వైపు నడిచాడు రామచంద్రం.

లక్ష్మి పందిరిమంచంమీద వాలి తలగడలో తల దూర్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

రామచంద్రం భోజనం గబగబా పూర్తిచేసి స్కూలుకి వెళ్ళిపోయాడు.

పండ్రెండు గంటలు కావస్తున్నది. చంద్ర బట్టలు పిండి ఆరవేసింది. మళ్ళీ స్నానం చేసింది. భర్తకి వడ్డించింది. అత్తగారికీ, మామగారికీ వడ్డించింది. లక్ష్మి ఏ వేళకీ భోజనానికి లేవలేదు.

అలివేలు చంద్రతో "అమ్మాయ్, లక్ష్మి ఈ రోజింకా భోజనంచెయ్యలేదు. ఎందువల్లో అడిగిరా. నేను రమ్మంటున్నానని పిలు." అన్నది.

చంద్ర "అలాగే నత్తయ్యా" అంటూ లక్ష్మి పడక గదిలో అడుగుపెట్టింది.

"చెల్లీ, భోజనానికిలే, అత్తయ్య రమ్మంటున్నది. మధ్యాహ్నం కావస్తున్నది." అన్నది చంద్ర భయపడుతూనే

"ఆ. నేనుతింటే ఎవరికి కావాలి, చస్తే ఎవరికి కావాలి? ఈ యింట్లో నేనున్నా ఒకటే, లేకున్నా ఒకటే. నా కాకలిలేదని చెప్పు. ఈ పూట భోజనంవద్దు. తలనొప్పిగా ఉంది" అన్నది లక్ష్మి యిటు తిరగకుండానే.

చంద్ర మారుమాటాడకుండా వంటింటి వైపు వెళ్ళింది.

"ఏం ? లక్ష్మిరానందా ? ఒంట్లో బాగా లేదన్నదా?" అన్నది అలివేలు ఆత్రంగా.

"అవును, ఆకలిలేదట. తలనొప్పిగా ఉందట. ఈ పూట తినదట" అన్నది చంద్రం తలవంచుకొనే.

"నేను పిలుస్తాలే. నీవు కూర్చొని వడ్డించుకో" అంటూ అలివేలు లక్ష్మి గదిలో అడుగు పెట్టింది.

"అమ్మా లక్ష్మి. భోజనం చెయ్యకుండా అలా వస్తు పడుకోకూడదు. తప్పు. లే. పెద్దదాన్ని చెపుతున్నాను. తల నొప్పిగాఉంటే అమృతాంజనం రాచుకొందువుగాని. అంతే కాని యిలా అభోజనంగా పడుకోకూడదు. గా, నేను వడ్డిస్తా" అన్నది అలివేలు లోపల భయపడుతున్నా.

"ఉహూ, ఆకలిగా లేదండీ అత్తయ్యా! ఒకపూట మానేస్తే ఆరోగ్యం చక్కబడుతుంది. ఈ భాగ్యానికి మీ రింత శ్రమపడి యిక్కడికి వచ్చి పిలవటం దేనికీ? ఆకలిగా ఉంటే నేనే తినేదాన్ని. ఆమాట చంద్రతో చెప్పానే!

ఆవిడ చెప్పలేదామీకు" అన్నది లక్ష్మి పడకనుంచి క్రిందికి దిగి.

"అవును చెప్పింది. కానీ నాకే నమ్మకంలేక యిలా వచ్చాను. నేను పిలిస్తే కాదనవని ఆశ" అన్నది అలివేలు లక్ష్మివంక చూస్తూ.

"ఈ పూటకి మన్నించండి. తినలేను. రాత్రికి తింటాలే" అన్నది లక్ష్మి తప్పుచేసినదానిలా నేలచూపులు చూస్తూ.

అలివేలు మారుమాటాడకుండా ఓమారు నిట్టూర్చి అక్కడినుండి కదలివెళ్ళిపోయింది.

సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో రామచంద్రం యింటికివచ్చాడు. లక్ష్మి అప్పటికి పెట్టే, బెడ్డింగు సర్దేసింది. చీరెమార్చింది. నగలు ధరించింది. ప్రయాణానికి సిద్ధంగా ఉంది. రామచంద్రం లక్ష్మి వాలకంచూసి విస్తుబోయాడు.

"లక్ష్మి, ఏమిటీ ముస్తాబు? ఎక్కడికీ ప్రయాణం? ఎవరితోటీ చెప్పకుండా యిలా తయారైనావేం?" అన్నాడు రామచంద్రం ఆశ్చర్యంగా.

"ఊ, త్వరగా తెమలండి. నన్ను మా పుట్టింట్లో దిగ విడిచి వద్దురుగాని. నేనీ యింట్లో ఒక్కక్షణమైనా ఉండలేను. ఆవిడైనా ఉండాలి. నేనైనా ఉండాలి. లేదా వేరింటి కాపుర మైనా పెట్టాలి" అన్నది లక్ష్మి పెదిమలు బిగబట్టి.

"ఛీ! అవేం మాటలు. ఎవర్నినీవు సాధించేది? అమ్మా వాళ్లెలా అనుకుంటారో ఆలోచించావా? వదినా అన్నయ్యా ఎలాబాధపడతారో కాస్త విచారించు. చూడు, ఏవనీ

తొందరపడి చెయ్యకూడదు. తర్వాత ఫలితంచూసి విచారి స్తే లాభంలేదు" అన్నాడు రామచంద్రం.

"ఫలితాలదేముంది? అందరిమాటా నాకెందుకు. నాకీ యింట్లో స్థానంలేదు. నేను చచ్చానో, బ్రతికానో ఎవరికీ అక్కర్లేదు. నేనున్నా ఒకటే, లేకున్నా ఒకటే, అలాంట ప్పుడు నేను వెడితే మాత్రమేమిటి!" అన్నది లక్ష్మి.

"కాస్త ఆలోచించు. మీవాళ్ళుమాత్రం మేమను కుంటారు? మమ్మల్ని దుయ్యబడతారు. పుట్టింట్లో నీకు మాత్రం గౌరవమా? అందరూ నవ్వరూ? నామాట కాస్త విను. అలా తొందరపడకూడదు. పెద్దవాళ్ళు తమంతట తామే వేరుపరిచే దాకా ఉండాలి. అమ్మా, నాన్నా ఉన్నారు. వాళ్ళనిచూడాలి. వాళ్ళ తదనంతరం మనం విడిపోవచ్చు. ఎవరికివారే, ఎమునా తీరే. కానీ అంతదాకా ఓర్చుకో. పెద్ద వాళ్ళకి కష్టం కలిగించటం మంచిదికాదు. ఒకటిగా ఉన్న కాపరాన్ని విడగొట్టి అందర్నీ బాధపెట్టకు" అన్నాడు రామచంద్రం.

"ఉహూ, మీకు నేను కావాలని అనుకున్ననాడు వచ్చితీసుకురండి. అంతేకానీ నేను మాత్రం, ఆవిడతో కలిసి బ్రతకలేను. మీరెన్నైనా చెప్పండి. మా వాళ్ళకి నేనేమీ బరువుకాను. నేనుతప్ప వాళ్ళకిం కెవరున్నారు?" అన్నది లక్ష్మి.

"సరే, నీ యిష్టం. అయితేపద. అమ్మతో చెప్పి దిగ బెట్టి వస్తాను." అన్నాడు రామచంద్రం చిన్నబుచ్చుకొని.

"పోనీ, ఒకపని చెయ్యకూడదా ? మీరూ నాతో రండి. ఈ బడిపంతులు ఉద్యోగంవల్ల వచ్చేదేమిటి, చచ్చేదేమిటి ? హాయిగా తిని, కాలుమీద కాలువేసుకొని ఉండవచ్చు. మనని అడిగేవాళ్ళు లేరు. మీకంతగా ఉద్యోగం చెయ్యాలని అనిపిస్తే మానాన్న ఏదో ఒక ఉద్యోగం యిప్పించకపోడు. ఏమంటారు ? మీ యిష్టమైతే చదువుకో వచ్చును. డబ్బుకేమీ లోటుండదు" అన్నది లక్ష్మి.

"ఊహూ, నేను రాలేను. తల్లినీ తండ్రినీ విడిచిరావటం నా కిష్టంలేదు. పైగా ఒక రింట్లో, తినికూర్చోవటం అసలే యిష్టంలేదు. నీవు వెళ్ళాలని పట్టుపడుతున్నావు, చివరికి అనుభవిస్తావు. సరే నీ యిష్టం నిన్ను వారించటంకూడా నా కిష్టంలేదు" అన్నాడు రామచంద్రం.

"ఊహూ. అవును. ఎందు కిష్టం ఉంటుంది. మీకు భార్య కావలసి వస్తేగా. నా మీద చిన్నమెత్తుకూడా ప్రేమ, అభిమానం లేదు. పైగా నేనుండటంవల్ల మీ కిబ్బందిగా ఉంది కాబోలు. సరే, రేపటినుండీ మీకీ పీడ ఉండదు లెండి. మీ అమ్మతో చెప్పిరండి. నన్ను త్వరగా దిగబెట్టి వద్దురుగాని" అన్నది లక్ష్మి.

"అదేమిటీ? నీవు కూడా రా. అమ్మతో చెప్పి వెడుదువుగాని. పెద్దవాళ్ళ అనుమతిలేకుండా యిష్టంవచ్చినట్లు వెళ్ళటం రావటం మంచిదికాదు. అమ్మకి నమస్కారంచేసి వెడుదువుగాని" అన్నాడు రామచంద్రం.

"ఉహూ, నేను రాను. ఆవిడతో ఏమనిచెప్పేది? అయినా నేను ఈ యింట్లో ఉండాలని కోరేవవాళ్ళేవరూ లేరుగా! మరింక నేను దేనికి?" అన్నది లక్ష్మి.

"సరే, నీ యిష్టం. నిన్ను బలవంతం చెయ్యటం నా కిష్టంలేదు. నీ వెలా తలుచుకొంటే అలాగేచెయ్యి" అన్నాడు రామచంద్రం వంటింటివైపు వెడుతూ.

"అమ్మా" అంటూ కేకవేశాడు రామచంద్రం వంటింటి గుమ్మంముందు నిలబడి.

"ఓయ్, దేనికి బాబూ" అంటూ వచ్చింది అలివేలు.

"పద, కాళ్ళు కడుక్కురా. నాలుగు బజ్జీలు తిందువు గాని" అన్నది అలివేలు కొడుకువంక చూచి.

"ఉహూ, ఇప్పుడు టైము లేదమ్మా రేపుచూద్దాం" అన్నాడు రామచంద్రం.

"రేపు చూడటమేమిట్రా నా ముఖం! రేపటికి పాసి పోవా?" అన్నది అలివేలు.

"అదికాదమ్మా" అన్నాడు రామచంద్రం ఎలా ప్రారంభించాలో అర్థంకాక.

"ఏమిట్రా ఆ నసుగుడు. చెప్పేది సవ్యంగా చెప్పు. ఏం? ఏదైనా ప్రయివేటు చెప్పటానికి పోతున్నావా? అయితే టిఫిన్ తీసుకోవటానికి అభ్యంతరం దేనికిరా?" అన్నది అలివేలు అయోమయంగా చూస్తూ.

"అదికాదమ్మా, మీా కోడలు పుట్టింటి కెడుతుందట. పంపించమన్నావా?" అన్నాడు రామచంద్రం తలవంచి.

"ఆ! ఏమిటీ? లక్ష్మి పుట్టింటికి కెడుతుందా? ఎందుకూ ఏమైనా ఉత్తరంగాని వచ్చిందా? వాళ్ళు వాళ్ళంతా కులాసాయేనా? అంటూ ప్రశ్నలవర్షం కురిపించింది అలివేలు.

"అలా గాబరా పడవలసిన విషయమేమీ లేదమ్మా. ఉత్తరం రాలేదు. ఊరికి వెడతానంటున్నది" అన్నాడు రామచంద్రం.

"దేనికీ? ఇక్కడ ఏమైనా కష్టంగా ఉందా? పద అడుగుతాను. పిచ్చిపిల్ల, పుట్టింటికెళ్ళి ఏమిచేస్తుందట? పండగా, పబ్బమా, నోములా, వ్రతాలా? ఏమున్నాయని యిప్పుడంత అర్ధాంతరంగా వెళ్ళాలంటున్నది? ఇదేమీ బాగా లేదు. ఏదైనా కష్టంగా ఉంటే పెద్దదాన్ని నేనున్నానుకదా. మీ నాన్న ఉన్నారుకదా. మాతో చెప్పాలిగానీ యిలా వెడితే బాగుంటుందా! నలుగురూ నవ్వరూ? అన్నది అలివేలు నోరు నొక్కుకుంటూ.

రామచంద్రం వెనక అలివేలు నడిచింది.

"అమ్మాయ్ లక్ష్మీ" అన్నది అలివేలు గొంతు సవరించుకుంటూ.

"ఊ" అన్నది లక్ష్మి ఉలిక్కిపడి.

"ఊరికి వెడదామనుకుంటున్నావటగా. మాట మాత్రమైనా నాతో అనలేదేం? దేనికో అడగవచ్చా?" అన్నది అలివేలు పమిటకొంగు నడుముచుట్టూ దోపుతూ.

"ఊరికెనే" అన్నది లక్ష్మి తడబడుతూ.

"ఊరికే ఎవరైనా వెడతారా? పెళ్ళయ్యాక కష్టమో నిష్ఠురమో అత్తవారింట్లోనే ఆడదాని బ్రతుకు

వెళ్ళమారి పోతుంది. మాటిమాటికీ పుట్టింటికి వెడితే గౌర వం ఉంటుందా? నలుగురూ నవ్వరూ? నామాట విను. పెద్దదాన్ని. పండగో, పబ్బమో అయితే నిక్షేపంగా వెడు దువుగాని. నిష్కారణంగా వెళ్ళటం బాగుండదు" అన్నది అలివేలు.

"మా వాళ్ళనిచూచి చాలా కాలమైందండీ అత్తయ్యా. ఒకసారి వెళ్ళాలని ఉంది" అన్నది లక్ష్మి తత్తర పాటును కప్పిపుచ్చుకుంటూ.

"నీ కిక్కడేమైనా యిబ్బందిగా ఉందా? చెప్పు తల్లీ. నేను నీకు తల్లిలాంటిదాన్ని భిడియపడకు" అన్నది అలివేలు.

"ఉహూ" అంటూ పెదవి బిగబట్టి బలవంతాన సమాధానమిచ్చింది లక్ష్మి లోపల మండిపడుతున్నా.

"అయితే దేనికీ నీవు వెళ్ళటం! ప్రయాణం మానెయ్యి తల్లీ. నామాట తీసివేయకు" అన్నది అలివేలు.

"ఉహూం, వెళ్ళాలని అనుకున్నాను. అంతా సిద్ధం చేశాను. ఇప్పుడు వెళ్ళకపోతే ఎలా? బాగుండదు." అన్నది లక్ష్మి.

"ఊ...సరే, నీ యిష్టం. చెప్పవలసిన మేరకు చెప్పాను. తర్వాత నీయిష్టం." అన్నది అలివేలు దీర్ఘంగా నిట్టూర్చి.

అక్కడినుండి మెల్లగా కదిలి వెళ్ళిపోయింది అలివేలు.

"అమ్మని దేనికిలా కష్టపెడతావు? చూశావా? ఆవిడెంత బాధపడుతున్నదో! నామాట విని ఈ ప్రయాణం ఆపు. పెద్దల అభిప్రాయానికి వ్యతిరేకంగా నడవటం పిన్నలకు

శ్రేయస్కరంకాదు. ఎందుకు చెప్తున్నానో ఆలోచించు. చేతులుకాలాక ఆకులుపట్టుకుని లాభంలేదు. మూర్ఖత్వం మాను” అంటూ ఎంతో నచ్చచెప్ప ప్రయత్నించాడు రామచంద్రం.

“ఉహూ, మీకంతగా నామీద ప్రేమఉంటే మళ్ళీ తీసుకొద్దురుగాని. స్థానంలేనిచోట బలవంతంగా ఉండటం నా కిష్టంలేదు” అన్నది లక్ష్మి.

“సరే అయితే అనుభవిస్తావు. అనుభవం మీదగానీ ఏ విషయమూ వంట బట్టదు. అప్పుడు విచారించి లాభం లేదని తెలుసుకో.” అన్నాడు రామచంద్రం.

“అలాగే. ముందు నన్నిక్కడినుండి తీసుకెళ్ళండి. ఆ తర్వాత ఆలోచిస్తాను. ఇక్కడ ఉంటే, తేళ్ళూ, జెర్రులూ ప్రాకినట్లుంటుంది” అన్నది లక్ష్మి చిరాగ్గా.

“సరే. పద. పోగాలము దాపురించిన వారికి హితుల మాటలు చెవికెక్కవని పెద్దల అభిప్రాయం. రిక్షా పిలుస్తాను” అంటూ బయటికి నడిచాడు రామచంద్రం దిగాలు పడి.

రిక్షావచ్చి ఆగింది. లక్ష్మి ఎవరికీ చెప్పకుండా వెళ్ళి రిక్షా ఎక్కింది.

“ఇంట్లో చెప్పిరా” అన్నాడు రామచంద్రం.

లక్ష్మి వినబడనట్లు ముఖం ప్రక్కకి త్రిప్పుకుంది. రామచంద్రం సామాన్లన్నీ తెచ్చి రిక్షాలో పెట్టాడు. తను సైకిలు వేసుకొని రిక్షా వెనక బయలు దేరాడు.

అలివేలుకి మనసు మనసులో లేదు. చాలా బాధగా ఉంది. దీని పరిణామ మెలా ఉంటుందో ఆమె ఊహకి అందటం లేదు. స్తబ్దుగా కూర్చుంది గోడ కానుకొని.

"అత్తయ్యా, బియ్యం ఎన్ని వెయ్యమన్నారు? కూర ఏమి చెయ్యాలి?" అన్నది చంద్ర వంటింటి గడపలో నిలబడి.

"ఏదో నీకు తోచి నన్ని వేద్దూ నన్ను చంపక" అన్నది అలివేలు. అంతవరకు చంద్రమీద ఒక్కసారైనా విసుక్కోని అలివేలు విసుగ్గా మాట్లాడే సరికి చంద్రం విస్తు బోయింది.

"ఏమండీ. అలా ఉన్నారేం? ఒంట్లో బాగా లేదా? తలనొప్పిగా ఉందా? అమృతాంజనం రుద్దేదా?" అన్నది చంద్ర.

"అమృతాంజనం వద్దూ, వల్లకాడూ వద్దు. నన్ను పలకరించకు. నీ పని నీవు చేసుకుందూ" అన్నది అలివేలు చిరాకుతో.

"సరే" నంటూ లోపలికి వెళ్ళింది చంద్ర.

"ఒసే. చంద్రా. ఇలారా" అన్నది అలివేలు స్పృహలోకి వచ్చి.

"పిలిచారా అత్తయ్యా. దేనికీ" అన్నది చంద్ర.

"ఊ. లక్ష్మి వెళ్ళటానికి కారణ మేమిటంటావు. ఇంత అర్థాంతరంగా దేనికి వెడుతుంది? నీకేమైనా తెలుసా? తెలిస్తే చెప్పు" అన్నది అలివేలు చంద్ర వంక ఆశగా చూస్తూ.

"ఊహూ" అన్నది చంద్ర బిక్క చచ్చిపోయి. ఏమని చెప్తుంది? లక్ష్మికి తనమీద ఈర్ష్యని చెబుతుందా? తనమీద లక్ష్మికి అనుమానమని చెబుతుందా? ఎలా విడమరిచి చెప్పగలదు?

"సరే. అయితే. నీ పని చూసుకో" అన్నది అలివేలు.

వెంకటాచారి, సుబ్రమణ్యాం వంటకి వెళ్ళి అప్పుడే వచ్చారు. చెమటలు కక్కుతున్నారు.

"ఏయ్" అంటూ కేక పెట్టాడు వెంకటాచారి.

"దేనికండీ" అన్నది అలివేలు ఉలిక్కిపడి.

"దేనికలా గోడకి చేరగిల బడ్డావు. కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు పట్రా" అన్నాడు వెంకటాచారి.

వంటింట్లో పని చేసుకుంటున్న చంద్ర మేనమామ మాట విని నీళ్ళ చెంబులు రెండు పట్టుకొచ్చింది. అంగవస్త్రాలు రెండు తెచ్చి కుర్చీమీద వేసింది.

వెంకటాచారి, సుబ్రమణ్యాం కాళ్ళు కడుక్కొని వచ్చారు.

"భోజనం వడ్డిస్తావా?" అన్నాడు వెంకటాచారి.

"ఊఁ" అన్నది అలివేలు కూర్చున్నచోటినుంచి లేవకుండానే.

"దేనికే అలా బెల్లం కొట్టిన రాయిలా కూర్చున్నావు? అసలు విషయ మేమిటో చెప్పు చంపక" అన్నాడు వెంకటాచారి.

"ఊఁ... అదేనండీ. మన రామచంద్రం లేడూ?" అన్నది అలివేలు తికమక పడుతూ.

"ఉండక ఎక్కడికి పోతాడుగాని అసలు విషయం చెప్పు" అన్నాడు వెంకటాచారి విసుగ్గా.

"రామచంద్రం పెళ్ళాం...లక్ష్మి" అన్నది అలివేలు మెల్లిగా.

"ఆ...వాడి పెళ్లాం...ఏమైంది? కులాసాగా లేదా?" అన్నాడు వెంకటాచారి ఆతృతగా.

"అది కాదండీ. లక్ష్మి పుట్టింటి కెళ్ళింది. అబ్బాయ్ దిగబెట్టటానికి వెళ్ళాడు" అన్నది అలివేలు.

"ఓస్. దానికింత పరధ్యానం దేనికీ? పుట్టింటి మీద గాలి మళ్ళి ఉంటుంది. చిన్న పిల్ల కదా. నీ కాలంలో నీవూ అలాగే చేసే దానివిగా" అన్నాడు నవ్వుతూ.

"అది కాదండీ బాబూ. అర్థాంతరంగా వెళ్ళింది. కారణ మేమిటో బోధపడక సతమత మవుతున్నాను" అన్నది అలివేలు.

"కారణాని దేముంది? హఠాత్తుగా వాళ్ళ అమ్మా, నాన్నా గుర్తు వచ్చి ఉంటారు. ఇంకేం, దగ్గరే కదా అని వెళ్ళి ఉంటుంది. పది రోజులుపోతే మళ్ళీ మొగుడిమీద గాలి మళ్ళుతుంది. అప్పుడు మళ్ళీ యిక్కడికి పరుగెత్తు కొస్తుంది. ఇవన్నీ నీకు తెల్సిన విషయాలేగా" అన్నాడు కొంటెగా చూసి నవ్వుతూ.

"పొండి బాబూ, మీ వేళాకోళాలకి, వేళా, పాళా లేదు. పుట్టింటిమీద గాలిమళ్ళి వెళ్ళలేదండి బాబూ." అన్నది అలివేలు చిరాకుపడుతూ.

"మరి దేనికి వెళ్ళిందంటావు? నీకేమో తోచదు. ఒకరు చెప్తే నమ్మవు. ఆ పిల్లనే అడక్కపోయావూ? నిజం తెలిసేది." అన్నాడు వెంకటాచారి.

"బాగుంది వరస. నాకే కష్టం వచ్చింది అంటూ ఎవరైనా నోరువిప్పి చెపుతారా? మీదంతా విడ్డూరం!" అన్నది అలివేలు.

"చచ్చాం! ఈ ఆడవాళ్ళ మనసుల్లో ఎప్పుడేం ఆలోచన్లు వస్తాయో ఆ బ్రహ్మదేవుడికి కూడా తెలియదు. ఇంక నాబోటి సామాన్యుని మాట చెప్పనేల? సరే, ఇంతకీ అన్నం వడ్డించి ఆ తర్వాత తీరిగ్గా కూర్చుని ఆలోచించు. కడుపులో ఎలికలు దూరుతున్నాయి" అన్నాడు వెంకటాచారి.

"ఏం? వెళ్ళినచోట తినిరాలేదా?" అన్నది అలివేలు.

"ఉహూ, నీచేతిపాకం రుచిచూద్దామని, నా చేతిపాకం నేను తినటం బాగుండదని" అన్నాడు వెంకటాచారి.

"సరేలెండి బాబూ. మీకు హేళన చెయ్యటానికి సమయా సమయాలు తెలియవు. పదండి కాళ్ళు కడుక్కోందురుగాని" అన్నది అలివేలు.

"ఆ పని ముగించి ఎంతకాలమైంది. ఈ రోజు అమ్మగారి బుద్ధి ఎక్కడికి వేంచేసిందట" అన్నాడు వెంకటాచారి నవ్వుతూ.

చంద్ర విస్తళ్ళువేసి అన్నం వడ్డించింది. తలుపు చాటున నక్కిచూస్తున్నది ఎవరికేమి కావాలోనని. అలివేలు భర్తకి దగ్గర్లో పీటవేసుకొని కూర్చుని విసనకర్రతో

విసురుతున్నది. రోజూ ఎవరికేమి కావాలో అడిగి కోడలికి పురమాయిస్తుండేది వడ్డించమని. ఈ రోజు మౌనంగా కూర్చుంది. చంద్రే మారు వడ్డించింది.

భోజనాలు ముగించి ఎవరి గదికి వారు వెళ్ళారు.

అత్తగారికి వడ్డించి పిలిచింది చంద్ర.

"నా కాకలిగా లేదే చంద్రా, నీవుతిని వంటిల్లుసర్దు" అంటూ వెళ్ళి చాప పరుచుకొని, కొంగు పరుచుకొని మోచెయ్యి తలక్రింద ఆన్చి పడుకుంది.

చంద్ర వంటిల్లు సర్ది భర్త గదిలోకి వెళ్ళింది.

"తమ్ముడేమైనాడు? మరదలేమైంది"దన్నట్లు సంజ్ఞ చేసి అడిగాడు సుబ్రమణ్యం.

"పుట్టింటికి తోడుకోడలు వెళ్ళిందనీ, ఆమెని పంప డానికి మరిది వెళ్ళాడనీ" సౌంజ్ఞచేసి చెప్పింది చంద్ర.

"అలాగా" అంటు ప్రక్కమీదచేరి నిద్రపోయాడు సుబ్రమణ్యం.

చంద్ర భర్త కాళ్ళువత్తి కాళ్ళదగ్గర అలాగే ఒరిగింది.



# 4

అనంతలక్ష్మిని వెంటబెట్టుకొని వెళ్ళిన రామచంద్రం మరునాటి పొద్దుటికి తిరిగి వచ్చాడు.

అల్లుడిని ఉండమని చాలా బలవంతం చేశారు అత్తమామలు.

"నాకు శలవలు లే"వంటూ తప్పించుకొని వచ్చేశాడు రామచంద్రం.

భర్త వెళ్ళిన తర్వాత నిశ్చింతగా నిట్టూర్చింది లక్ష్మి. బరువు తీరిపోయినట్లు భావించింది.

"అమ్మాయ్, లక్ష్మీ! మీ ఆయన అప్పుడే వెళ్ళాడేమే? నాలుగు రోజులుండమన్నా వినిపించుకోలేదే" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏమో పోనిద్దూ! ఆయనకంత ఇష్టంగా లేకపోతే మనం బతిమిలాడటం దేనికి?" అన్నది లక్ష్మి చిరాగ్గా.

"అదేమిటే పిచ్చిపిల్లా. అలా అంటారుటే. తప్పుకాదా? అతగాడికేం తక్కువైందో? ఏమిటో" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏమీ తక్కువకాలేదు గానీ, యింతకీ విమల యిక్కడే ఉన్నదా? అత్తవారింటి కెళ్ళిందా? శ్యామల

యిప్పు డెక్కడ ఉన్నది? ఉమ మళ్ళీ వచ్చిందా? ప్రభతి పిల్లలెందరు?" అంటూ స్నేహితురాళ్ళ క్షేమసమాచారాలు అడిగింది.

"పిన్నీ! మా అమ్మ ఓ గరిటెడు కాఫీ పొడరుంటే యిప్పించుకు రమ్మంది" అంటూ శ్యామల వచ్చింది. లక్ష్మిని చూచి చిరునవ్వు నవ్వింది.

"ఏమే లక్ష్మీ? ఎప్పుడూడి పడ్డావు? ఏమిటే విశేషాలు? అంతా కులాసా?" అన్నది శ్యామల గుక్కతిప్పుకోకుండా.

అనంతలక్ష్మి అంత ఉత్సాహంగా లేదు అత్తవారింటి సంగతులేమని చెపుతుంది?

"ఆ! ఏ ముంటాయే, మామూలేగా. అంత విశేషా లేమీ లేవు." అన్నది ముక్తసరిగా.

"ఓహో! అప్పుడే దాపరికాలుకూడా నేర్చావూ? ఏం? అత్తవార్ని వెనకేసుకొస్తున్నావు? అది సరేగానీ యిప్పుడింత హఠాత్తుగా ఊడిపడ్డావేం? స్కూళ్ళకేమీ శలవులు లేవే!" అన్నది శ్యామల.

"స్కూలుకి శలవులేకపోతే రాకూడదా? అయినా ఉద్యోగం చేసేది ఆయనకానీ నేను కాదుగా" అంది ముఖం చిట్లించి లక్ష్మి

"ఊరికే అలా అపార్థంచేసుకోకే. నేను మాత్రం ఏమన్నాను? మీ ఆయనకు శలవులు లేవుకదా. నిన్ను ఒక్కదాన్ని పంపాడా? అంటున్నాను సుమా" అన్నది శ్యామల.

"ఏం? ఎందుకు పంపరు?" అన్నది లక్ష్మి.

"అందరూ పంపుతారంటే, అందరికీ అంత అదృష్టమా? మా ఆయనకి క్షణం తీరిక ఉండదు, దమ్మిడీ ఆదాయం ఉండదు. ఎప్పుడూ ఆఫీసు ఫైళ్ళల్లో తల యిరికించుకొని కూర్చుంటాడు," అన్నది శ్యామల.

"అందరూ అందరే. మీ ఆయనకి ఆఫీసు ఫైళ్ళంటే మా ఆయనకి కాంపోజిషన్ పుస్తకాలు, పరీక్ష పేపర్లు... ఏమిటేమిటో ఉంటాయి. ఏవైతేనేం లే?" అన్నది లక్ష్మి నిర్లిప్తంగా.

"ఏమిటే అంత ఉత్సాహంగా లేవు. ఏమైనా మాట పట్టింపు లేమీ లేవు కదా" అన్నది శ్యామల ఉండబట్టలేక.

"ఆ! ఏమీ లేదు. అరే, కాఫీ పొడరు కోసమనివచ్చి అలాగే కూర్చుండి పోయావు. ఉండు తెచ్చిస్తా. అమ్మా! కాఫీ పొడరెక్కడుందో చెప్పు." అన్నది లక్ష్మి యింక ఆ సంభాషణకి స్వస్తి చెప్పాలన్న ఉద్దేశ్యంతో.

"నా తెలివి మండా. చూడు. వచ్చి గంటసేపయింది. నిన్ను చూచే సరికి వచ్చిన పని మర్చిపోయి అలాగే కూర్చున్నాను. మా అమ్మ అలాగే ఎదురు చూస్తూ ఉంటుంది" అన్నది శ్యామల స్పృహలోకి వస్తూ.

"ఇందు. తీసుకెళ్ళు" అంటూ ఓ గిన్నె నిండా పోసి యిచ్చింది. శ్యామల కాఫీ పొడరు తీసికొని "వస్తానే లక్ష్మి. మధ్యాహ్నం మా యింటికోసారి రా" అంది.

"నీవే రాకూడదా?" అన్నది లక్ష్మి.

"తీరదే బాబూ. తమ్ముళ్ళూ, చెల్లెళ్ళతో యిల్లంతా రణగొణ ధ్వనిగా ఉంటుంది". అంటూ వెళ్ళింది శ్యామల.

"అలాగే చూద్దాం లే" అన్నది లక్ష్మి.

"అమ్మా శ్యామల ఎందు కొచ్చేందే" అన్నది లక్ష్మి.

"ఎందుకేమిటే. కాఫీ పొడరు కోసం వచ్చింది కదే. ఇచ్చావుగా" అన్నది అన్నపూర్ణమ్మ పిండి జల్లెడపడుతూ.

"అది కాదే. పుట్టింటికి దేనికి వచ్చింది?" అన్నది లక్ష్మి,

"ఎందు కంటే, వాళ్ళమ్మ పురిటి రోజులని వచ్చింది" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఓహో అలాగా" అన్నది లక్ష్మి.

"అమ్మాయ్. మీ అత్త వారింటి విశేషా లేమిటి?" అన్నది అన్నపూర్ణమ్మ జల్లెడ పట్టిన పిండి గిన్నెలోకి పోస్తూ.

"ఏమున్నాయే" అన్నది లక్ష్మి తప్పించు కోవాలని చూస్తూ.

"అదేమిటే. మీ అత్తగారు నిన్ను బాగా చూస్తున్నదా? మీ తోడు కోడలు నీతో తగాదా లాడకుండా కలిసి మెలిసి ఉంటున్నదా?" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఇప్పుడవన్నీ దేనికమ్మా. అంతా బాగానే ఉన్నారెద్దూ. నా కాకలిగా ఉంది. టిఫిన్ చేద్దూ" అన్నది లక్ష్మి విసుగ్గా.

"అది సరేలే. టిఫిన్ చేస్తాన్లే. ఇప్పుడింత హఠాత్తుగా దేనికి వచ్చినట్లు!" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏమీ లేదు. ఊరికే...మిమ్మల్ని చూచి పోదామని" అన్నది లక్ష్మి.

"అలా రాకూడదమ్మా. అత్తగా రేమనుకుంటారు? ఎప్పుడో పండక్కో పబ్బానికో రావాలి" అన్నది అన్నపూర్ణమ్మ.

"అయితే నేను రావటం నీకిష్టం లేదా అమ్మా" అన్నది లక్ష్మి కోపగించుకొని.

"అది కాదే పిచ్చి పిల్లా. నిష్కారణంగా పుట్టింటికి రావటం మంచిది కాదంటాను. నలుగురూ నాలుగు మాటలంటారు" అన్నది అన్నపూర్ణమ్మ.

"అమ్మా ఊరికే ఎవరు మాత్రం వస్తారే. నేను అవసరంలేనిచోట పడివుండటం బాగుంటుందా? అన్నది లక్ష్మి.

"నీ అవసరం ఎవరికి లేదంటావే?" అన్నది అన్నపూర్ణమ్మ నివ్వెరపోయి.

"అదే...మా అత్త వారింట్లో. కట్టుకున్న వారికి అక్కర లేనప్పుడు బలవంతంగా ఉండటం నాకిష్టం లేదు" అన్నది లక్ష్మి.

"అదేమిటే తల్లీ. అతగాడి కెందుకిష్టం లేదు? ఆ మాట ముందే చెప్తే అతగాడిని అడిగి చూచే వాళ్ళంగా" అన్నది అన్నపూర్ణమ్మ.

"అడిగి ప్రయోజన మేమటమ్మా. భార్యమీద ప్రేమ తహాగా కలగాలిగానీ ఒకరు చెబితే వస్తుందంటావా? వెర్రిగానీ" అన్నది లక్ష్మి.

"అవేం మాటలే? నీమీద యిష్టంలేదు వెళ్ళి ...మ్మని చెప్పాడా ఏమిటి ఖర్మ" అన్నది అన్నపూర్ణమ్మ ...గాలుపడి.

"ఊహూ. నోటితో అలాగేమీ చెప్పలేదనుకో. ...యినా చేతలు తెల్పుతాయి కదా. కొట్టక్కర్లేదు. తిట్ట ...క్కర్లేదు. పొగపెడితే వాళ్ళే పోతారని సామెత. అట్లాగే ...ంది" అన్నది లక్ష్మి కళ్ళు వత్తుకుంటూ.

"అయ్యో తల్లీ. ఎంత కష్టం వచ్చి పడింది. మీ అత్తగారేమైనా అన్నారా? మీ ఆయనేమన్నాడు? ...తో సరిగా పలకడా? ఏమిటే నీ బాధ. స్పష్టంగా చెప్తే కదా తెలిసేది?" అన్నది తల్లి ఆదుర్దాగా.

"ఏమున్నదే అమ్మా. ఆయన కెప్పుడూ వదినగారి లోకమే. ఆవిడ కొంగు పట్టుకొని తిరుగుతాడు. ప్రతి పనీ ఆవిడచేసి పెట్టాల్సిందే." అన్నది లక్ష్మి.

"అదేవిటే పిచ్చికుంకా. నీవేం చేస్తావు? చూస్తూ ఊరుకుంటావా? నీ మొగుడి కేమికావాలో నీవు చూడవా? అతగాడి అవసరాలు కనుక్కొని అన్నీ చెప్పకుండానే అమర్చి పెట్టు. అప్పుడు నీ మాటెందుకు వినడో చూద్దాం" అన్నది అన్నపూర్ణమ్మ.

"లాభంలేదమ్మా, నే నేపని చెయ్యబోయినా చేతకాదుగా, చేసేవాళ్ళని చెయ్యనివ్వ అంటారు. స్నాన ఆవిడే నీళ్ళు తోడుతుంది. వంట ఆవిడేచేసి వడ్డిస్తుంది. మ కేమి కావాలన్నా ఆవిడే తయారవుతుంది. నన్ను నా భ_ కాకుండా ఆవిడే చేస్తున్నది" అన్నది లక్ష్మి.

"నీ ముఖం. నీవే కల్పించుకొని అన్నీ చెయ్యా వద్దన్నా వినకుండా అన్నీ అమర్చిపెట్టాలి. ఆవిడకి అవకా యివ్వకుండా నీవే అందుకోవాలి" అన్నది అన్నపూర్ణమ్మ

"లాభంలేదమ్మా, ఆవిడని వారించినా ఆయన నీ చేతకాని పనికి అడ్డందేనికి వస్తావు ?" అంటారు. అని అ_ గారిచేతనో, వదినగారి చేతనో చేయించుకుంటారు. ఏమీ లేం ఎందుకట్లా చేస్తారు ? నిప్పులేంది పొగవస్తుందా" అన్న లక్ష్మి.

"అవేంమాటలే, ఆవిడకి మాత్రం భర్తలేడూ అన్నది అన్నపూర్ణమ్మ.

"ఉన్నాడులే, మూగివెధవ. మాటాలేదు, పలుకూ లేదు. అటువంటివాడితో ఎవరైనా కాపరంచేస్తారంటే నమ్మ వద్దూ. ఈయనేమో చదువుకున్నాడాయె. ఉద్యోగం చేస్తు న్నాడాయె. అన్నీ ఉన్నవాడాయె, వాడికి ఈయనకీ పోటీ ఎక్కడ ?" అన్నది లక్ష్మి.

"తప్పమ్మా, బావగార్ని అలా ఈసడించకూడదు. పెద్ద వాళ్ళని గౌరవించటం నేర్చుకోవాలి" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఆ, ఆముూగివాడ్ని గౌరవించేదేమిటే అమ్మా.
తా మీా కాలంలోలాగా ఉండాలంటావు, అవన్నీ
ప్పుడు సాగుతాయా ?" ఇంక పోనిద్దూ. ఈ రోజు సినిమాకి
ళదామా ? అన్నది లక్ష్మి.

నీకింకా జ్ఞానం రాలేదేమే ? జీవితం అంటే నీళ్ళ
ర్లాట అనుకుంటున్నావా ? అనుభవంమీాదగానీ తెలియదు.
రేలే, అప్పుడే సినిమాలేమిటి ? నాముఖం" అన్నది అన్న
ూర్ణ ముఖం చిట్లించి.

"అబ్బ, అత్తవారిల్లు వదిలినా అదలింపులు, సద
ంపులు వదలలేదు కదా, పుట్టింటి కొచ్చానన్న సంతోషం
ండనివ్వవా ఏమిటమ్మా...అస్తమానం ఏదో బోధిస్తూనే
ంటావు" అంటూ లక్ష్మి విసుక్కుంది.

"అవునే, ఇప్పుడన్నీ అట్లాగే ఉంటాయి. పెద్దయితే
కానీ బరువు భారాలు తెలిసిరావు" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏమే పూర్ణీ, ఏమిటో ఉపన్యాసం యిస్తున్నావు.
ఏమిటే విశేషం" అంటూ శేషాచార్లు వచ్చాడు.

"ఆ! ఆ! మీాకూ, మీాకూతురికీ అన్నీ ఉపన్యాసాలు
గానే ఉంటాయి. పిల్లది అత్తవారింటినుంచి పారిపోయివస్తే,
ఏమిటే, ఎందుకూ అని మాటమాత్రమైనా కనుక్కున్నారు
కాదు. మంచైనా, చెడ్డైనా భరించాల్సింది మనమే కదా"
అన్నది అన్నపూర్ణమ్మ.

"పిల్లది వచ్చిందికదా అని సంతోషించక పారిపో
వచ్చిందంటావేం? అల్లుడువచ్చి దించిపోయాడు. ఇంక నీ
సందేహం దేనికి వచ్చింది? దాన్ని హాయిగా నాలు
రోజులు గడపనివ్వరాదూ. అక్కడా వేధించి, యిక్క
వేధిస్తే యింక అది సుఖపడేదెక్కడ? అన్నాడు శేషాచా

"ఏదైనా మంచిమాట చెప్పాలనుకుంటే వేధించ
నంటారు. సరే నాకెందుకు? దాన్నిలా నెత్తినెక్కించుక
బట్టే మంచీ, చెడూ, పెద్దా చిన్నా తారతమ్యం లేకుండ
నోటికెంతొస్తే అంత అనేస్తున్నది. దాన్ని అన్నా అన
పోయినా 'ఏతల్లి పెంచిందమ్మా యిట్లా' అంటూ నన్ను
తిట్టిపోస్తారు" అన్నది అన్నపూర్ణమ్మ.

"అదిసరేగానీ కాఫీ ఏమైనా యిస్తావా? టిఫిన్ ఏమైన
చేస్తావా? లేక యిలాగే శ్రీరంగనీతులు బోధిస్తూ కాల
యాపన చేస్తావా? అమ్మడూ, ఈరోజు మంచి సినిమా
ఉందిసుమా. భార్యాభర్తలట, ఏమే పూరీ, నీవూ వస్తావా!"
అన్నాడు శేషాచారి.

"ఆ! నా ముఖాని కదొక్కటే తక్కువ, ఇన్నే
ళ్ళొచ్చినా మీకింకా కుర్రతనం పోలేదు. సినిమాలూ, షికా
ర్లూను. మీరు చెడేదికాక పిల్లదాన్నికూడా చెడగొడ్తు
న్నారు. మీ అండ చూసుకొని అది మరీ బరితెగించి
పోతున్నది" అన్నది అన్నపూర్ణమ్మ.

"సరేలే, నీవురావద్దులే. ఇంటిదగ్గరుండి ఏ భారతమో,
రామాయణమో చదువుకో, మేము సినిమాకెడతాము.

సినిమాలకీ, షికార్లకీ వెళ్ళినంత మాత్రాన చెడ్డవాళ్ళయి పోతారా? నీవు ఈ కాలంలో పుట్టవలసిన దానివికాదు. ఏ త్రేతాయుగంలోనో పుట్టిఉంటే బాగుండేది" అన్నాడు శేషాచారి.

"సరేలెండి, మీతో వాదించటానికి నాకు తీరికలేదు. కాఫీ పెడ్తాను" అంటూ వంటింటివైపు వెళ్ళింది అన్న పూర్ణమ్మ.

లక్ష్మి సినిమాకి తయారవడానికి తనగదిలోకి వెళ్ళింది.

# 5

రామచంద్రం ఎప్పటిమాదిరిగా స్కూలుకి వెడుతున్నాడు వస్తున్నాడు. అతనిలో పైకి ఎలాంటి మార్పూ కన్పించటంలేదు.

అనంతలక్ష్మి వెళ్ళి అప్పుడే రెండు నెలలైంది. రామచంద్రం బెల్లంకొట్టిన రాయిలా ఊరుకున్నాడు.

అలివేలు మనస్సులో అనంతకోటి సందేహాలూ, అనుమానాలూను. ఎవర్ని ఏమని ప్రశ్నిస్తుంది ?

రామచంద్రం మామూలుగా భోజనానికి వచ్చాడు. “అమ్మా అన్నంవడ్డించు, బడికి త్వరగా వెళ్ళాలి” అంటూ వచ్చాడు.

‘అదిసరేగాని లక్ష్మివెళ్ళి రెండు నెలల పైచిలుకు అయింది. అయినా దాని దగ్గిర్నుంచి ఒక్క ఉత్తరం ముక్కయినా లేదు. నీవైనా వ్రాయరాదుట్రా. ఉత్తరందాకా ఎందుకు? ఆదివారం వెళ్ళితీసుకురా” అన్నది అలివేలు.

“చూద్దాంలే అమ్మా. ఇప్పుడు ఇనస్పెక్షన్ రోజులు. తీరికలేదు” అంటూ తప్పించుకో జూచాడు.

“తీరికేమిట్రా నా ముఖం. పెళ్ళాన్ని తెచ్చుకోవటానికీ, అన్నం తినటానికీ తీరిక దొరకని ఉద్యోగం చేసేం,

చెయ్యకేం, ఇంట్లో ఉంటే సరిపోదా? నీవు సంపాదిస్తేగాని గడవదని దిగులా" అన్నది అలివేలు కోపంతో.

"అది సరేనమ్మా. నీతో వాదించటానికి నాకు టైము లేదు. త్వరగా అన్నం వడ్డించు" అన్నాడు రామచంద్రం.

"ఏమో నాయనా. ఈ చాకిరీ అంతా నేను చెయ్యలేను. నీ పెళ్ళాం ఉంటే వడ్డించేది కదా. ఇంకా ఎన్నాళ్ళని నన్నిలా అవస్థ పడమంటావు?" అన్నది అలివేలు.

"పోనీ! వదినని వడ్డించమని చెప్పమ్మా నీకంత కులాసాగా లేనప్పుడు. నిన్నెవరు బాధపడమన్నారు?" అన్నాడు రామచంద్రం.

"ఆ! అది మాత్రం ఎన్ని పనులని చేస్తుంది? ఎందరికని అమరుస్తుంది? అదీ మనిషే, నీ పెళ్లాం ఉంటే నీ ఆలనా, పాలనా చూచుకుంటుంది ఓ మంచి రోజు చూచి శలవు పెట్టి వెళ్ళి తీసుకురా" అన్నది అలివేలు.

"అమ్మా, వద్దంటున్నా నా మాట ఖాతరు చెయ్యకుండా వెళ్ళిపోయింది. అలాంటి దాన్ని రమ్మని బ్రతిమిలాడటం నావల్ల కాని పని. దాని ఇష్టప్రకారం వెళ్ళింది. దానికి బుద్ధి పుట్టినప్పుడే రానివ్వు" అన్నాడు రామచంద్రం.

"అది చిన్న పిల్ల. దాని ముఖం. దానికేం తెలుసు? ఏవో లేనిపోని పట్టుదలలకి పోయి వచ్చుటి కాపరానికి చిచ్చు పెట్టుకో బోకండి. లోకులు నన్ను దుయ్యబడతారు. ఆ అత్తగారు గయ్యాళిది కాబోలు, ఆవిడ దగ్గర కోడం ప్రతికం చెయ్యలేక వచ్చేసిందని నలుగురూ నన్నంటారు. మీకేం నాయనా,

చిన్న తప్పులకు పెద్దల్ని తప్పుపడతారు. పెద్ద వాళ్ళుండి ఏమి ప్రయోజనం? మంచి మాటలు చెప్పి సరైన త్రోవలో పెట్టలేని పెద్దలుండేం? లేకేం? అంటా" రంటూ అన్నది అలివేలు.

"ఏమో నమ్మా. నీ వెన్నైనా చెప్పు. నాతో కాపరం చెయ్యటం యిష్టంలేని యిల్లాల్ని తెచ్చి బాధ పెట్టటం నా కిష్టంలేదు. ఆవిడకి పుట్టింట్లోనే సుఖంగా ఉంటే అక్కడే ఉండనీ" అన్నాడు రామచంద్రం.

"ఒరే బాబూ. లోపలి విషయా లెవరికి తెలుస్తాయిరా నాయనా. లోకులకి ఎంత తోస్తే అంతే అనుకుంటారు. పెద్ద దాన్ని చెప్తున్నాను విను. నా మాట విని తీసుకురా" అన్నది అలివేలు.

"ఉహూ. ఆ పని నా వల్ల కాదమ్మా" అన్నాడు రామచంద్రం.

"పోనీ పిల్లని దిగబెట్టి వెళ్ళమని మీ మామగారికి ఉత్తరం వ్రాయి. తీరుబడి లేనందున రాలేక పోతున్నాను. పిల్లను తీసుకొచ్చి దిగబెట్ట వల్సిందని రెండు ముక్కలు వ్రాయి" అన్నది అలివేలు అన్నం వడ్డిస్తూ.

"అలాగేనమ్మా. కానీ ప్రయోజనం ముండదు. ముందే చెప్తున్నా. మనం వాళ్ళ ముందు వెలితి పడటం కన్న మరోటి కాదు." అన్నాడు రామచంద్రం ఏదో తిన్నా నన్న సామెతచేసి కంచం దగ్గరి నుంచి లేస్తూ.

"అకే, అదేమిట్రా. పులుసు వేయించుకోనే లేదు. పెరుగుంది. పోనీ పెరుగుతోనన్నా ఒక్కముద్ద తిను" అన్నది అలివేలు బాధతో చూస్తూ.

"ఉహూ. నా కాకలిగా లేదమ్మా" అంటూ చెయ్యి కడిగేసుకున్నాడు రామచంద్రం.

కొడుకు భోజనం చెయ్యకుండా లేచేసరికి అలివేలుకి బాధగా ఉంది. అనవసర ప్రశ్నలువేసి బాధించానే అని మనస్సులో బాధపడింది.

రామచంద్రం స్కూలుకి వెళ్ళిపోయాడు.



# 6

"ఒసే, లక్ష్మి. ఇంకా ఎంత ప్రొద్దెక్కేదాకా నిద్ర పోతావే? ఆడ పిల్లవు కాదుటే. పెందరాడే నిద్రలేద్దాం, పనీ, పాటా చూద్దాం అన్న జ్ఞానమేలేదేమే" అంటూ తట్టి లేపింది అన్నపూర్ణమ్మ.

"అబ్బ ఉండమ్మా. లేస్తూనే ఏమిటే శాపనార్థాలు? సినిమాకి వెళ్ళాము. బద్ధకంగా ఉంది. లేస్తాలేమ్మా. అయినా యిప్పుడు నేను చెయ్యవల్సిన పనులేమున్నాయి." అంటూ బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని లేచింది విసుక్కుంటూ.

"అదే పనికి రాదన్నాను. ఆడపిల్ల అట్లా తొమ్మిది గంటల దాకా నిద్రపోగూడదు. ప్రొద్దున్నే లేచి కాల కృత్యాలు తీర్చుకొని ఏమైనా పనులుంటే చక్కబెట్టుకొని స్నానం, పానం ముగించి, పూజా పునస్కారాలు చేసుకోవాలి గానీ, తొమ్మిదింటికి లేచి ముఖం కడిగి పౌడర్లు అద్ది పేపరు చూసి స్నానంచేసి భోజనానికి తయారవటం మంచిది కాదమ్మా. అవి మొగవాళ్ళ లక్షణాలు" అన్నది అలివేలు.

"ఏం? ఎందుకుండ గూడదూ? ఆడవాళ్ళకో పద్ధతీ, మొగవాడికో పద్ధతీనా?" అన్నది లక్ష్మి ముఖం చిట్లించి బ్రష్ నోట్లో పెట్టుకుంటూ.

"మొగవాడు సంపాయించేవాడు కదా! బయట అనేక పనులుంటాయి. తిరిగి తిరిగి వస్తాడు. అందువల్ల విశ్రాంతి అవసరం! అన్నది అన్నపూర్ణమ్మ.

"ఆడది మాత్రం పగలంతా కష్టపడి పనిచెయ్యటం లేదా? ఆపనికి మాత్రం విశ్రాంతి అవసరం కాదా?" అన్నది లక్ష్మి ముఖం కడుక్కొని టవలుతో తుడుచుకుంటూ.

"అదిసరేగాని లక్ష్మి, మీ ఆయనింకా ఉత్తరం వ్రాయలేదేమే. వచ్చి తీసుకుపోనూలేదు." అన్నది అన్నపూర్ణమ్మ మాటమారుస్తూ.

"ఏమోనమ్మా ఆయనకి సెలవు దొరకలేదేమో," అంటూ అసలు విషయం మభ్యపరచ చూచింది లక్ష్మి.

"శెలవలు దేనికే, ఓ ఆదివారంవచ్చి నిక్షేపంగా తీసుకెళ్ళవచ్చుగదా" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏమమ్మా నీకంత బరువుగా ఉన్నానా? ఉంటే చెప్పు నేనే వెళ్ళిపోతాను. ఆయన రావటం దేనికి!" అన్నది లక్ష్మి రుసరుస లాడుతూ.

"ఛా! అవేం మాటలే, బరువనికాదు. ఎక్కడ ఉండాల్సినవాళ్ళు అక్కడుంటేనే అందం. నలుగురూ నన్ను అడుగుతున్నారు." అన్నది అన్నపూర్ణమ్మ.

"ఆ, అడిగేవాళ్ళని నన్నడగమని చెప్పు సమాధానం అతికేట్లు చెప్తాను మళ్ళీ నోరెత్తకుండా!!" అన్నది లక్ష్మి.

"అత్తయ్యా, ఓగిన్నెడు గోధుమరవ్వ యిస్తావా? రేపు తెప్పించి యిస్తాము" అన్నది సుధవస్తూ.

"ఓహ్, సుధా, ఎప్పుడొచ్చావే! దర్శనాలే కరువయ్యాయే! ఏమిటే విశేషాలు? సాయంత్రం సినిమాకి వస్తావా?" అన్నది లక్ష్మి ఉత్సాహంతో.

"ఉహూ, మావారొచ్చారే బాబూ. రావటానికి వీలుపడదు. రేపే ప్రయాణం. వచ్చివారం రోజులు కాలేదు" అన్నది సుధ.

అన్నపూర్ణమ్మ ఓ గిన్నెడు గోధుమ రవ్వ తెచ్చి యిచ్చింది.

"కూర్చోవే సుధా, పోదువుగానిలే. వచ్చి వారం రోజులుకాందే అప్పుడే ఏం తొందరొచ్చింది? రెండురోజులుండూ కులాసాగా కాలం గడుపుదాం. నిన్ను చూచి చాలా నెలలైంది" అన్నది లక్ష్మి తలదువ్వుకుంటూ.

"మ్చ్, లాభంలేదే. ఆయన వచ్చారుగా. ఇంక వెళ్ళక తప్పదు. హోటలు తిండి పడటంలేదు రమ్మంటూ వచ్చి కూర్చున్నారు. అసలు విషయం అదికాదనుకో, ఆయన నన్ను విడిచి ఒక్క క్షణమైనా ఉండలేరు. ఇన్నిరోజులెలా ఉన్నారా అని నేనే ఆశ్చర్య పడుతున్నాను" అంటూ సిగ్గు పడుతూ నవ్వింది.

లక్ష్మి దీర్ఘంగా నిట్టూర్చింది.

సుధ ఉలిక్కిపడింది. "అదేమిటే అలా నిట్టూరుస్తున్నావు. మీ ఆయనకి నీమీద అభిమానం లేదా? మొన్ననేగా పెళ్ళయింది. అప్పుడే పుట్టింటికి వెళ్ళనిచ్చాడా?" అన్నది సుధ.

"ఆ! అందరికీ అంత అదృష్టం ఉండవద్దా? ఆయనకి నేనున్నా ఒకటే, లేకున్నా ఒకటే...." అంది బరువుగా ఊపిరి విడుస్తూ.

"అవేం మాటలే!" నీనోటంట క్రొత్తగా వింటున్నాను. నేను నమ్మలేను సుమా అలాంటి మగవాళ్ళున్నారంటే. అందులో పెళ్ళయిన క్రొత్తల్లో యిలా ప్రవర్తించే వాళ్ళని నేనింతవరకూ చూడలేదంటే ఆశ్చర్యపడవలసిన పని లేదు" అన్నది సుధ.

"అంతా మీ ఆయనలాగే ఉంటారనుకుంటావు. కొంగున ముడేసుకొని తిరుగుతున్నావు. వచ్చి రెండు నెలల పైగా అయింది. ఒక్క ఉత్తరముక్క గానీ రాలేదు. తానొకసారైనా వచ్చి చూచిపోలేదు. రమ్మని అడగనూలేదు. అంతా ప్రారబ్ధం" అంటూ కణతలు నొక్కుకుంది. కళ్ళ వెంట నీళ్ళువచ్చాయి. ముఖం ప్రక్కకు త్రిప్పుకొంది.

సుధ, లక్ష్మి చుబుకంపట్టుకొని "ఛీ అలా ఏడవకూడదు. అసలు విషయం నాతో చెప్పు." అన్నది అనునయంగా.

"ఏమున్నది చెప్పేటందుకు?...." అంటూ లక్ష్మి బలవంతాన వచ్చే దుఃఖాన్ని దిగమ్రింగచూచింది.

"ఛా! ఛా! అలా బెంబేలు పడకూడదు. అసలు లోపమెక్కడ ఉన్నదో కనుక్కొని దానికి తగిన చికిత్సచేయాలి గానీ యిలా చేతులు ముడుచుకు కూర్చుంటే లాభంలేదు" అన్నది సుధ.

"ఏమిచెయ్యమంటావు. ఆయనకి నామీద ఈషణ్మాత్రమైనా అభిమానం లేందే...." అన్నది లక్ష్మి.

"అసలు నీ అంతట నీవేవచ్చావా లేక పుట్టింటికి వెళ్ళమని అతగాడే దిగబెట్టాడా?" అన్నది సుధ.

"నేనే వచ్చేశానే! వెడతానంటే ఆయనే దిగబెట్టి వెళ్ళారు" అన్నది లక్ష్మి.

"ఇంకేం అసలు కీలకం యిక్కడే ఉంది. నీవు దేనికి రావాలనుకున్నావో ముందు చెప్పు" అన్నది సుధ.

"దేనికేముంది? అక్కడ నాకు ముళ్ళమీద ఉన్నట్లుగా ఉంది. అందువల్ల వెడతానని చెప్పి వచ్చేశాను" అన్నది లక్ష్మి.

"వెడతానంటే వెళ్ళమన్నాడా? లేక వద్దన్నా నీవే పంతంపట్టి వచ్చావా?" అన్నది సుధ క్రాస్ ఎగ్జామిన్ చేసే లాయరులాగా.

"నేను వెడతానంటే ఆయనవద్దన్నారనుకో. అక్కడ బాగుండనప్పుడు ఉండి ప్రయోజన మేమిటి?" అన్నది లక్ష్మి తనది తప్పని ఒప్పుకోవటాని కిష్టంలేక.

"మరింకేం, తప్పు నీదగ్గరుంచుకొని యితర్లని నిందించటం దేనికి? అతను వద్దన్నా వినకుండా, మొండిపట్టుపట్టి వచ్చేశావు. ఆ కోపంతో అతగాడూ పంతంపట్టి ఉండవచ్చు. అందువల్లే యింతవరకు జాబు వ్రాసి ఉండకపోవచ్చు. కానీ, నీమాటో? నీవుమాత్రం వ్రాయకూడదా? పోనీ మీ నాన్ననో, అమ్మనో వెంటబెట్టుకొని వెళ్ళరాదా? పండంటి

కాపరం పంతాలతో పాడుచేసుకుంటావా? ఇదెవరు నీకు నేర్పారు? మీ అమ్మయినా నిన్ను మందలించ లేదంటే ఆశ్చర్యంగాఉంది సుమా! ఇలా అన్నానని కష్టపెట్టుకోకు" అన్నది సుధ లక్ష్మి జడపట్టి లాగుతూ.

"ఊ...పోదూ, తప్పంతా నా నెత్తిన రుద్దాలని చూస్తావు. నా కక్కడ సుఖంగాఉంటే యిక్కడి కెందుకు పరుగెత్తుకొస్తాను? నాకు మాత్రం అంత తెలియదా? చిన్న పిల్లనా? అందరిలాగా కాపరం చెయ్యాలని నాకుమాత్రం ఉండదా?" అన్నది లక్ష్మి తనని తాను సమర్థించుకొనే ధోరణిలో.

"అదే పొరపాటు. అక్కడ సుఖంగా ఉంటే మాత్రం ఉండటం, కష్టంగా ఉంటే పుట్టిలు చేరటం. ఇదేనా నీవు నేర్చిన విద్య. కష్టంలో, సుఖంలో అన్నిట్లోనూ భర్తతో పాలు పంచుకోవటమే సంసారం చెయ్యటంలోని అంతరార్థం. ఒకరి కొకరు అండగా నిలిచి ధైర్యంగా కష్టాన్నెదుర్కొని సుఖాల్ని చవి చూడాలనే పెండ్లి చెయ్యటంలో గల ఉద్దేశ్యం. అయినా కోపగించుకోకుండా ఉంటే ఓ మాట అడుగుతాను. నీకు నిజంగా ఏం కష్టం వచ్చి వచ్చావే దాచకుండా చెప్పాలి సుమా." అన్నది లక్ష్మి కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ.

"ఊ. చెప్తాలే. అయితే విను. కష్టమంటే మరేమీ లేదు. దాంపత్యానికి ముఖ్యమైంది అనురాగం, అన్యోన్యం. ఆ రెండూ మృగ్యమైనప్పుడు అక్కడ ఉండటంలో అర్థం లేదు" అన్నది. లక్ష్మి దూరంగా చూస్తూ.

"ఎందువల్ల అవి మృగ్యమైనా యంటావు? మీ ఆయన అందగాడు కాదా? చదువుకున్నవాడు కాడా? సరసుడు కాడా? కోపదారి వాడా? ధనవంతుడు కాడా? ఎందులో నీకా అసంతృప్తి" అన్నది సుధ.

"అది కాదే బాబూ, అవేవీ కావు. అస్తమానం వదిన గారి కొంగుపట్టుకొని తిరుగుతాడు. స్నానానికి నీళ్ళు ఆమె తోడాలి, వడ్డన ఆమె చెయ్యాలి, టిఫిన్ ఆమె అందించాలి. కాఫీ ఆమె యివ్వాలి... ఇలా సమస్తపనులూ ఆవిడ చేతి మీదగానే జరగాలి" అన్నది లక్ష్మి అక్కసు వెళ్ళబోసు కుంటూ.

"అసలు ఆవిడ చెయ్యటానికి అవకాశం దేనికివ్వాలి? నీవే ఎందుకు కల్పించుకొని అన్నీ అమర్చకూడదు? తప్పు నీలోనే ఉంది" అన్నది సుధ.

"ఉహూ, నీకెంత చెప్పినా అర్థంకాదే. ఏపనైనా చేస్తాననివస్తే నీకేం చేతకాదులే, నీవెందుకు చేస్తావు, వదిన చేస్తుం దంటా రాయన, మా అత్తగారుకూడా వంతపాడు తుంది. అదేమంటే మీ యింట్లో ఈ పనులన్నీ నౌకర్లు చేస్తారుకదా, నీ కివన్నీ అలవాటు లేవు, ఎందుకు నీకీ అవస్థ లని కూర్చోమంటారు" అన్నది లక్ష్మి అసలు విషయం బయటపెడ్తూ.

"ఊఁ, నీవే చెప్పిఉంటావు. ఆపని నాకు చేతకాదు, ఈపని నేను చెయ్యలేను, అవన్నీ మాయింట్లో నౌకర్లు చేస్తారని, ఇదంతా నీ అహంభావత్వంవల్ల వచ్చిందేసుమా" అన్నది సుధ.

లక్ష్మి కోపగించుకున్నది. "అవును అందరూ నన్నే నిందిస్తారు. నేను చెయ్యని పనులు చేస్తానని ఎలా చెప్పేది? మా యింట్లో ఆ మోటుపనులన్నీ అలవాటులేవు. వాళ్ళింట్లో ఎవరు చేస్తారే. అందుకని భర్త అవసరాలు చూడనని ఎందుకనుకోవాలి?" అన్నది లక్ష్మి తన నెవరూ సరిగా అర్థంచేసుకోవటంలేదని బాధపడ్తూ.

"అదికాదేపిల్లా. పసిపిల్లలా ప్రవర్తిస్తే ఎలా? పుట్టింట్లో సాగినట్లు జరగాలంటావు. అంతేనా? అదంతా కలలో జరిగే సంగతులు. జీవితంలో తటస్థపడాలంటే వీలవుతుందా! అదృష్టం కొద్దీ అనుభవించాలి" అన్నది సుధ.

"ఊ... అయితే యింతకీ నీవుచెప్పే దేమిటి?" అన్నది లక్ష్మి.

"ఏముందీ? నీవు గుట్టుచప్పుడు కాకుండా అత్తవారింటికి వెళ్ళిపో. ఇటు పుట్టింటికీ, అటు మెట్టినింటికీ పేరు తెచ్చేట్లు ప్రవర్తించు. పనిచెయ్యటం తప్పేమీకాదు. ఎవరింటి పని వారు చేసుకోవటంలో దోషమేమీ లేదు. అందులోనే ఆనందం ఉంది. తృప్తివుంది. ఇదంతా నాచేతిమీాద జరిగిందికదా అనే గర్వం ఉంటుంది. స్త్రీకి ఆనందం గృహనిర్వాహణలోనే. అంతేగాని ఆఫీసర్లలా నౌకర్లని గదమాయిస్తూ చేయించుకోవటంలో ఆనాదంలేదు. ఈ విషయం ముందుముందుగా నీవే తెల్సుకుంటావు" అన్నది సుధ.

"నీ వెన్నైనాచెప్పు. ఆయనంతట ఆయనరానిదే నేను వెళ్ళలేను. నన్ను నేను చులకన చేసుకొని యితర్ల ముందు చులకన కావటం నా కిష్టంలేదు" అన్నది లక్ష్మి.

"ఓసిపిచ్చిదానా, నీ వింత మూర్ఖపు పట్టు పడు తున్నావు. లోకం తీరింకా నీకు తెలియదు. పుట్టింట్లో మరి నాలుగు నెలలుండు నీకే తెలిసొస్తుంది" అన్నది సుధ.

"ఏమిటా తెలిసేది" అన్నది లక్ష్మి.

"అదే, లోకం నిన్నపార్థం చేసుకుంటుంది. భర్తను విడిచి వచ్చిందంటారు. అనేక అపవాదులూ, నిందలూ పైన వేస్తారు. అవన్నీ భరించలేవు" అన్నది సుధ.

"దేనికివేస్తారే, పెళ్ళికానప్పుడు పుట్టింట్లో ఉంటే ఏమీ అనరేం? భర్త వదిలిపెట్టిపోతే యింట్లో ఉంటే ఏమీ అనరేం? భర్తగతించి విధవరికం అనుభవిస్తూ పుట్టింటచేరితే ఏమీ అనరేం?" అన్నది లక్ష్మి లోకపుతీరును గర్హిస్తూ.

"ఎందుకనరే, అందుకేగా భయపడి చిన్నప్పుడే పెళ్ళి చేసి అత్తవారింటికి పంపడం. భర్త వదిలిపోయినా లోకం ఎవరిని నిందిస్తుందో నీకింకా తెలీదా? స్త్రీనే! భర్త గతించిన వితంతువులు పుట్టిల్లుచేరి అందరిచేత ఎంత అవమానింప బడ తారో, అనుమానింప బడతారో నీకేం తెలుసు. ముక్కు పచ్చ లారనిదానివి." అన్నది సుధ తానో పెద్ద ఆరిందలా.

"ఓ నీకు తెలుసు, మహాపెద్ద ముత్తయిదు వచ్చింది" అన్నది లక్ష్మి హేళనగా నవ్వుతూ.

"సరేలే, నీకెన్ని చెప్పినా మనసు కెక్కవు. ఎక్కిన నాడు నీవే విచారిస్తావు చాలా ఆలస్యంగా తెలుసుకున్నానని. నేనొచ్చి చాలా సేపయింది సుమా. మా అమ్మ కేక లేస్తుంది. గోధుమ రవ్వకనివచ్చి అసలు విషయం మరచి

యిక్కడే ఉండిపోయాను." అంటూ ఆదుర్దాతో గిన్నెపట్టు కొని లేచి నిలబడింది.

"సరే, వెళ్ళవే." అన్నది లక్ష్మి నిట్టూరుస్తూ. సుధ వెళ్ళినవైపే చూస్తూ నిలబడింది.

"లక్ష్మి, ఇంకా జడ వేసుకుంటూనే ఉన్నావుటే, నీ పిల్ల బంగారంగాను. ఎక్కడ కూర్చుంటే అక్కడే చెల్లు" అంటూ తల్లి సణిగింది.

లక్ష్మి బరువుగా అడుగులు వేసుకుంటూ యింట్లోకి వెళ్ళిపోయింది.

"ఇంతసేపూ ఏం చేస్తున్నావే" అన్నది అన్న పూర్ణమ్మ.

"సుధతో మాట్లాడుతున్నానమ్మా. ఏం కావాలో చెప్పు" అన్నది లక్ష్మి తల్లి నుద్దేశించి.

"ఏమిటా ? నా బొంద. ఏదో జ్ఞాపకం వచ్చింది పిల్చాను. ఇంతలో మరిచిపోయ్యాను." అన్నది అన్న పూర్ణమ్మ.

"సరే అయితే, నేనింక వెళ్లేదా ?" అన్నది లక్ష్మి.

"ఎక్కడికి ?" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఎక్కడికీ లేదు. పుస్తకం చదువుకోడానికి" అన్నది లక్ష్మి.

"ఏమిటా పుస్తకం? వేళాపాళా లేదు. ప్రొద్దున్నే స్కూలు పిల్లలా పుస్తకం ముందేసుకు కూర్చోవడ మేమిటి? సంసారంచేసే పిల్లవి. ఒక్క క్షణం రాలేదు. స్కూలు

పిల్లలా ప్రవర్తిస్తే నలుగురూ నవ్వుతారు. ఏ వయస్సులో ఆ పని చెయ్యాలిగాని" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏం చెయ్యమంటావో చెప్పు. వంట నీవేచేస్తా వయితివి. పై పనులు చెయ్యటానికి అప్పలమ్మ వుండనే వుండె" అన్నది లక్ష్మి విసుగుతో.

"సరే. వెళ్ళమ్మా" అన్నది అన్నపూర్ణమ్మ దీర్ఘంగా నిట్టూర్చి.

లక్ష్మి తన గదిలోకి వెళ్ళింది. ఏవో వార పత్రికలు తీసి చదివింది. కానీ మనస్సు వాటిమీద ఏ మాత్రం లగ్నం కాలేదు. అత్తవారిల్లూ, భర్త, తోడి కోడలూ, బావగారూ, మామగారూ గుర్తొచ్చారు. తన ప్రవర్తన మాటిమాటికీ గుర్తొస్తున్నది. తనదే తప్పేమోనని మనస్సు పీకుతోంది. కానీ స్వాభిమానం అందుకు అడ్డు పడుతున్నది. తనంతట తనే వెడితే! ఊహూ అంతా నవ్వుతారు. చులకన చేస్తారు. భర్తకి మరీ లోకువయి పోతుంది. ఆయనే వచ్చి రమ్మంటే బాగుండును. ఊహూ. అంత అదృష్టమా? ఆయన పట్టుదల యింత బలమైందని తన కానాడు తెలియదు. తెలిస్తే ఏం చేసేదో. బహుశ రాకనేపోను. ఇక్కడి వాళ్ళంతా తనని చిన్న చూపు చూస్తున్నారు. తండ్రి మినహాయించి అంతా తానేదో ఘోర తప్పిదం చేసినట్లే భావిస్తున్నారు.

నిజానికి తనది దోషమా? భర్త అభిమానించి ఆదరించనప్పుడు అక్కడ ఉండటం దేనికి. ఇదంతా కేవలం తన కల్పనేనా? లేక, తోడి కోడలికీ... భర్తకీ...ఛీ...ఛీ

...ఏమిటీ ఆలోచనలు. భగవాన్. అన్నీ యిలువంటి దురా లోచనలు కలుగుతున్నాయేం? వాళ్ళ ప్రవర్తనలో నిజంగా లోపం ఉందా? లేక తానే భ్రమపడుతున్నదా? తనమీద ప్రేమ లేకపోతే భర్త నిజంగా ఎందుకు వారిస్తాడు? ఎందు కంతగా బ్రతిమిలాడుతాడు? ఆయన రాక పోవటానికి నిజంగా తన ప్రవర్తనే కారణమా? సందేహం లేదు. బహుశ అదే కావచ్చు. తనమీద కోపం వల్లనే రాలేదు. తానొక్క ఉత్తరం ముక్క వ్రాస్తే ఈ పాటికివచ్చి వ్రాలేవాడు. ఉహూ. తనే ముందు వ్రాస్తే లోకువయి పోయింది. అది ఆధారంగా తీసుకొని యింకా తేలిగ్గా చూడవచ్చు. తనపట్ల ఆయనకి విముఖత్వం ఏర్పడవచ్చు.

ఆకాశాన్ని మబ్బులు కమ్మేశాయి. సూర్యుడు కప్పబడి పోయాడు. అంత తీక్షణమైన అతని వాడి చూపులు భూ దేవిని చలింప చెయ్యలేక పోతున్నాయి. ఇది వరకైతే సూర్య భగవానుని తీక్షణ చూపుతూపులకు తట్టుకోలేక వెలతెల బారుతుండేది. బీటలు వారి, నెర్రెలిచ్చేది. బాధగా మూల్గేది. కానీ నేడో. మేఘుడు సూర్యుణ్ణి తన నల్లటి వల వేసి పట్టేశాడు. వల వెనుకన దాచేశాడు. వలలోనుంచి బయటపడటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు సూరీడు. తొంగి తొంగి చూస్తున్నాడు జాలిగా. కానీ లాభంలేదు. దూది పింజలవలె తేలికైన మేఘుడు బలవంతుడైన సూర్యుణ్ణి బంధించి వేశాడు. అల్లిబిల్లిగా అల్లుకు పోయాడు. ఎట్టి తొంగి చూద్దామన్నా సందు చిక్క నివ్వకుండా పంతం పట్టు

పరుగు లెత్తుతూ అడ్డగిస్తున్నాడు. భూదేవిమీద తన సహస్ర హస్తాలతో అమృత ధారలు కృమ్మరించేశాడు. భూదేవి పులకరించి పోయింది. అనురాగంతో హృదయం కరిగి పొంగింది. నీటితో కలిసి ప్రవహించింది. సూర్యుని వేడి నిట్టూర్పులకు బిర్రబిగిసిన భూదేవి మేఘుని అమృత ధారలకు మెత్తబడి పోయింది. తనువు పులకించింది. దాని చిహ్నంగా పచ్చగా మొక్కలు బిలబిల లేచాయి. భూదేవి మనస్సు వికసించింది. పుష్పించింది. ఫలించింది. ఆ మనస్సు ప్రతిబింబమే ప్రకృతి. పచ్చని చెట్లు చిగురించాయి. మొగ్గలు తొడిగాయి. పూలు పూశాయి. కాయలు కాశాయి. పండ్లు పండాయి. ఇదంతా భూదేవి హృదయం పొందిన ఆనందానికి బాహ్య చిహ్నాలే.

కిటికీలోనుంచి కనిపించే పచ్చని చెట్లు, మిసమిసలాడే నవనీతం లాంటి ఆకులు, ఆకులపైన ముత్యాల సరాలను తలపింపజేసే నీటి బిందువులు ఒకటొకటి జలజల రాలుతున్నాయి. పిట్టలు వర్షానికి తడిసి తమ రెక్కలు టపటప కొట్టుకుంటున్నాయి. నీటి బిందువులను విదిలించుకుంటూ. లక్ష్మి మనస్సు బరువుగా నిట్టూర్చింది. తానెప్పుడలా భూదేవిలా ఉప్పొంగి, ప్రియుని కౌగిలిలో కరిగి మైమరస్తుందో? తన కంత అదృష్టమా? మళ్ళీ అత్త వారిల్లు చూస్తుందా? ఇదే ఆఖరి సారా? తానెందు కిలా ఆలోచించకుండా వచ్చింది? ఇప్పుడు తనంతట కాను పోలేదు. తన కాళ్ళకి తానే సంకెళ్ళు వేసుకుంది. వాటినుంచి విముక్తి లేదు. వాటిని

వదిలించి విముక్తి కల్గించగల్గిన వ్యక్తి ఒక్కడే. అతడు జడత్వం వహించాడు. తనకింక విముక్తి ఎప్పుడో. తన జీవితానికి అర్థం ఏమిటి? ఇలా తింటూ, తిరుగుతూ, సినిమాలూ, షికార్లుతో కాలం వెళ్ళబుచ్చటమేనా? తోటివారితో తలెత్తుకు తిరగలేకుండా వుంది. ఏదో కనపడని లోటు బాధిస్తున్నది, వేధిస్తున్నది. ఏమిటి చెయ్యాలి? బలవంతంగానైనా తల్లో, తండ్రో పంపితే బాగుండును. కానీ అలా జరుగదుగా. ఒకసారి తానే చెప్పేసిందిగా తన కిష్టంలేదని. ఇప్పుడు వాళ్ళేలా నడుముకట్టి బలవంతాన తీసుకెళ్ళి దింపుతారు? లక్ష్మికి దుఃఖం ముంచుకొొచ్చింది.

తలగడలో తలదూర్చి నిశ్శబ్దంగా ఏడ్చింది. తన బాధ ఎవరితో వెళ్ళబోసుకుంటుంది?

---

# 7

స్కూలికి వెడుతున్న రామచంద్రంతో తల్లి అలివేలు "ఏమిరా నాన్నా! ఎన్నాళ్ళిలా ఒంటరిగా గడుపుతావు. కోడల్ని తీసుకురమ్మని నీ కెన్నిసార్లు చెప్పాను?" అన్నది అలివేలు.

"ఏమోనమ్మా, నీకెందు కీ బాధ. నీ కెన్నిసార్లు చెప్పా నా విషయం కదిలించబోకని. ఆవిడని నేను రావద్ద న్నానా? నే నేవైనా కొట్టీ, తిట్టీ దింపి వచ్చాను కనుకనా! తీసుకురావటానికి? ఆవిడంతట ఆవిడే పట్టుపట్టి వెళ్ళింది. ఇక్కడికి రావటం ఆవిడ కిష్టంఉంటే తండ్రినో, తల్లినో వెంట బెట్టుకొని రాకపోయిందా? వస్తే నే నేమైనా అంటానా? నే నెటువంటివాడ్నో ఆవిడకి తెలీదా, మీకు తెలీదా? ఇష్టం లేని వాళ్ళని బలవంతంగా తీసుకొచ్చి ఉంచితే మాత్రం వాళ్ళు స్వేచ్ఛగా ప్రవర్తిస్తారా? ముళ్ళమీద ఉన్నట్లు బాధ పడతారు. ఇష్టంలేని వాళ్ళతో కాపరం ఎలా చెయ్యమం టావో చెప్పు" అన్నాడు విసుక్కుంటూ.

"పోనీలేరా? నీవుపెద్ద, నీవుపెద్ద అనుకుంటూ ఉంటే రైలు కాస్తా చక్కాపోయిందట. అల్లావుంది మీ యిద్దరివనీ. నీవేవచ్చి తీసుకెడతావని ఆవిడ అనుకుంటున్న

దేమో. అందువల్లే రాకపోవచ్చు. నీవేమో ఆవిడే వస్తుందిలే అని రోజులు నెట్టుకొస్తున్నావు. మధ్య బాధపడేది నేను" అన్నది అలివేలు బాధగా మూల్గి.

"నీకెందుకమ్మా బాధ" అన్నాడు రామచంద్రం, అంతకంటే మరేం చెప్పాలో పాలుపోక.

"అవున్రా, నీకేం తెలుస్తుంది. లోకం అంతా కోడై కూస్తుంది. నేను తలెత్తుకొని తిరగలేకుండా ఉన్నాను" అన్నది అలివేలు.

"ఏమని కూస్తున్నదమ్మా" అన్నాడు రామచంద్రం కుర్చీలో కూలబడి.

"ఏమనా ? సిగ్గు విడిచి ఎలా చెప్పమన్నావురా ? అతగాడికి భార్యమీద మోజుంటే తీసుకుపోడా, భార్య అవసరం లేనివారికి నెత్తిన బలవంతంగా పిల్లని దింపటం దేనికని మీ అత్తగారు అడిగినవారందరికీ చెపుతున్నదట. మొన్న సావిత్రి చెప్పింది. మొన్నీ మధ్య పుట్టింటికెడితే తెలిసిన వార్త యిదట." అన్నది అలివేలు బాధగా.

"అమ్మా, లోకులు కాకులు, ఇదుగో పులీ అంటే, అదుగో తోక అంటారు. ఉన్నవీ, లేనివి కల్పించి అపనిందలు యితర్ల నెత్తిన రుద్దటం వాళ్ళకి సరదా. అదేవాళ్ళ వృత్తి. పోనిద్దూ. అటువంటి వాటికి నీవు చెవి ఒగ్గరాదు" అన్నాడు రామచంద్రం.

"నిప్పులేందే పొగరాజదు. లోకులమాటలు పూర్తిగా త్రోసివేయలేము. ఇంతో, అంతో నిజం ఉంటుంది. అయితే

గోరంతలు, కొండంతలు చేసి ప్రచారం చెయ్యటం లోకం పని. అందువల్ల లోకంలో మెలిగేటప్పుడు జాగ్రత్తగా మెల గాలి. జీవితం తెల్లటి బట్టలాంటిది. కాని లోకులనే కాకులు కెట్టవెయ్యకుండా జాగ్రత్త పడాలి. లేకపోతే నిష్కల్మష మైన జీవితం నిందల పాలవుతుంది. నిందలపాలై నిస్తేజ మవుతుంది. ఆ తర్వాత విచారించి లాభంలేదు. నీవు తెల్లటి బట్టలు వేసుకున్నప్పుడెంత జాగ్రత్త పడతావో యిదీ అంతే. మురికి కాకుండా అతి జాగరూకతతో మెలగాలి. లేకపోతే ఏ గోతిలోనో పొరపాటున అడుగువెయ్యటం, జీవిత మనే యీ తెల్లవస్త్రం మైల బడటం, బురదకావటం సంభ విస్తుంది. బురద పూసుకోవటం తేలికే. కానీ, మళ్ళీ ఆ వస్త్రాన్ని మలిన రహితం చేయటం, ఆ మలినాన్ని పూర్తిగా క్షాళనం చేసుకోవటం చాలా కష్టం. ఎన్ని రకాల సోపులు వాడినా తెల్లబడని మరక లుంటాయి. అందువల్ల చాలా మెలకువతో ప్రవర్తించాలి.” అన్నది అలివేలు.

రామచంద్రం నివ్వెరపోయి కన్నార్పకుండా చూస్తూ తల్లిమాటలు శ్రద్ధగా వింటున్నాడు. తల్లి ఎప్పుడూ యింత విపులంగా మాట్లాడి ఎరుగదు. ముక్తసరిగా మాట్లాడి, ముభావంగా ఉండటం ఆవిడ కలవాటు. నాలుగు గోడలమధ్య తప్ప బాహ్య ప్రపంచాన్ని కన్నెత్తైనాచూచి ఎరగని అమా యకురాలు, అజానురాలు, అక్షర శూన్యురాలు జీవితా న్నింత అరటిపండు ఒలిచి చేతులోపెట్టినట్లు విప్పి చెపుతుంటే నిజంగా ఆశ్చర్యపోయాడు. ఆమె కెక్కడిదీ జ్ఞానం? వయస్సు

నేర్పిందా ? అనుభవాలు నేర్పాయా ? ఎలా యిన్ని విష యాలు గ్రహించ గలిగింది ?"

"అమ్మా, అయితే జీవితం స్వచ్ఛంగా గడపినాకూడా వచ్చే నిందల మాటో-" అన్నాడు రామచంద్రం తల్లిముఖం లోకి తదేకంగా చూస్తూ.

"అదేనా అదే నేను చెప్పేది. నీవు నిష్కల్మషంగా ప్రవర్తించినా లోకం నిన్ను దుయ్యబడుతుంది. అనుమా నిస్తుంది. అవమానిస్తుంది. లోకంలో కావలసింది కేవలం నిష్కల్మషం కాదు నాయనా. దాని ప్రదర్శన. దానికి దృష్టాంత రాలు అవసరం. ఈతచెట్టు క్రింద కూర్చొని పాలు త్రాగితే కల్లే త్రాగారంటుంది లోకం. లేకపోతే ఈతచెట్టు కింద కూర్చోవల సిన అవసరమేమి టంటుంది. విన్నావా? అందుకే నేను చెప్పేది.

నీ ప్రవర్తనలో లోపం లేకపోసీగాక, యితరులున్నా రనీ, వాళ్ళు నీ ప్రవర్తనని ఏ విధంగా అర్థం చేసుకుంటారోననీ ఆలోచించాలి. మనం సంఘంలో నివసిస్తున్నప్పుడు మనని గురించి మన అభిప్రాయమే చాలదు. లోకుల అభిప్రాయాల్ని గూడా దృష్టిలో ఉంచుకొని మెలగాలి.

"పదుగురాడుమాట పాటియై ధరజెల్లు" అన్నసామెత నీకూ తెలియదా ? నలుగురుదొంగలు ఒకే అభిప్రాయం వెలి బుచ్చి నల్లమేకను కుక్క క్రింద జమకట్టి, ఒక బ్రాహ్మడిని మోసగించారు. అతడ్ని నమ్మించారు. లోకం తీరలా ఉంటుంది. నే నీ పనిని చేయలేదంటే ఒప్పుకోదు. సాక్ష్యాలూ, కారణాలు, అవకాశాలు, వెతుకుతుంది. వాటిసహాయంతో

అబద్ధాన్ని నిజంగా, నిజాన్ని అబద్ధంగా రూపిస్తుంది. లోకం శక్తి అటువంటిది. ఈజీవితం కత్తిమీాద సామువంటిది. ఏమాత్రం అప్రమత్తతగా ఉన్నా చర్రున కోసుకుపోతుంది, దానితో నేలంటా కూలవలసిందే. అందుకని నామాట విను బాబూ!" అన్నది అలివేలు.

తల్లి విషయ పరిజ్ఞానానికి రామచంద్రం నిర్ఘాంత పోయాడు. స్కూళ్ళకీ, కాలేజీలకీ వెళ్ళి తను నేర్చుకోలేని ఎన్నో జీవితసత్యాలను అతిసులువుగా, యితరులకి అర్థమయ్యేటట్లు, మనస్సుకి హత్తుకుపోయేటట్లు విడమరచి చెపుతున్నది. ఇవి జీవితంనేర్పిన పాఠాలు కాబోలు. అందుకే అంత తీక్ష్ణంగా అవగాహనచేసుకున్నది. ఇంతలో చంద్రిక అక్కడికి వచ్చింది.

"అత్తయ్యా ఒడియాలకి ఎంత పప్పు నానబొయ్య మన్నారు?" అన్నది తలుపవతల నిలబడి.

మరిది స్కూలుకి వెళ్ళాడని అనుకున్నది.

"ఎన్నోకొన్ని పోద్దూ" అన్నది అలివేలువిసుగ్గా. కోడ లక్కడికి రావడం ఆమెకి చిరాకూ, కోపమూ కల్గించాయి. నిజంగా లోకుల మాటలు అసత్యాలుకావేమో. లేకపోతే కొడుకుతో మాట్లాడుతుంటే ఈ విడ రావటం దేనికో? ఎప్పుడూ. ఏదో పనిమిషతో మరిది ముందుకు దేనికివస్తుంది?" అలివేలు అనుమాన పడింది.

చంద్రిక యింకా అక్కడనుంచి కదలలేదు. ఆవిడకి లోపలఎవరున్నారో ఏంతెలుసు? అత్తగారినుంచి సరైన ప్రత్యుత్తరం రాకపోయేసరికి "ఎన్ని పొయ్యమంటారో

చెప్పండి. ఏంచేస్తున్నారిక్కడ అంటూ" హాలులోకి అడుగు పెట్టింది. మాదిని చూచి వెనుతిరిగిపోయింది.

అలివేలు, సంభాషణఅంతటితో ఆగిపోవటంతో లేచి నిలబడింది. "నీకు ఆలస్యమవుతున్నట్లుంది నాయనా" అంటూ యింట్లోకి వెళ్ళిపోయింది. రామచంద్రం మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ తల్లిమాటలు మననం చేసుకుంటూ వెళ్ళాడు.

అలివేలు వంటింట్లోకి వచ్చింది. చంద్రిక మినుములు చేటలోపోసి బాగుచేస్తున్నది. ఒక పీట ముందు వేసుకొని బాగు చేసిన వాటిని మళ్ళీ రాయీ, రప్పా లేకుండా శుభ్రం చేస్తున్నది.

"భోజనంచేశావుటే!" అన్నది అలివేలు చలికిలపడి.

"ఉహు. లేదత్తయ్యా. మీరు తినలేదుగా. పదండి వడ్డిస్తా" నన్నది చంద్రిక తలెత్తిచూచి.

"ఆ ! ఏంభోజనమే. నామనసేమీ బాగాలేదు. ఈచిన్నాడి ప్రవర్తన నాకేమీనచ్చటంలేదుసుమా. లోకులు నన్ను ఆడిపోసుకుంటున్నారు" అన్నది అలివేలు.

చంద్రిక మౌనంగా వింటూ గడ్డలు ఏరి పోస్తున్నది. "ఎందులో మరిదిప్రవర్తన బాగాలేదో" అడిగేధైర్యం ఆమెకి లేదు. కారణం అలివేలు స్వభావమే. ఎప్పుడామె మెల్లగా జవాబిస్తుందో, ఎప్పుడు కటువైనజవాబిస్తుందో కనుక్కోవటం కష్టం. నవ్వుతూ మాట్లాడుతూనే అంతలో గంభీరత దాల్చు తుంది. ఆవిడ స్వభావం చాలాచంచలమైంది. ఎప్పుడు ఆమె

మనో సముద్రంలో ఉత్తుంగతరంగాలు లేస్తాయో, లేచి తన చుట్టు ప్రక్కలవారిని ముంచెత్తుతాయో తెలుసుకోలేని విషయం. అది ఆమెకే తెలియదు. ఇంక చంద్రకేం తెలుసు? అందుకే ఏవిషయమైనా స్వయంగా ఆవిడ చెప్పందే చంద్రిక కదిలించదు. మౌనంగావిని వూరుకోవటమే చంద్రిక కలవాటు. ఎప్పుడో ఒకమాట మాట్లాడుతుంది. అంతే. ఇప్పుడూ అదే జరిగింది. చంద్రిక తనపని తాను చేసుకుంటున్నది.

అలివేలే మళ్ళీ ఎత్తుకుంది. "కోడల్ని తీసుకురమ్మని ఎంతగానో చెపుతున్నాను. నెలలుగడచిపోతున్నై. కానీ వాడు నామాట యింతకూడా చెవిని వేసుకోవటంలేదు. లక్ష్మిది దుడుకు స్వభావమే అనుకో. అయినా మనింటికి తెచ్చుకున్న తర్వాత ఎలాగో సర్దుకుపోవాలి. అందరిస్వభావాలూ ఒకటిగా ఉండవుగా. కోపదారివాళ్ళుంటారు, గర్వపోతులుంటారు, వినయులుంటారు, అందరితోటీ సర్దుకుపోతేనే సంసారనావ సజావుగా సాగుతుంది. లేకపోతే అన్నీ ఒడుదుడుకులే. అంతా విచ్ఛిన్నానికి దారితీస్తుంది. ఇతరుల అభిప్రాయాల్ని మన్నించాలి. గౌరవించాలి. వీలైతే ఆచరణలో పెట్టాలి. అందరి ఐకమత్యంతో సంసారం స్వర్గతుల్యమౌతుంది. భేదాభిప్రాయాలతో ఛిన్నాభిన్నమౌతుంది. సంసారం గుట్టుగా గడిపితే లోకులు మెచ్చుతారు. పైగా ఒకరికొకరు అండదండగా నిలుస్తారు. మానవుడు ఒంటరిగా జీవించలేడు. అతడు సంఘజీవి. స్వతంత్రంగా బ్రతకలేడు. ఇతరులపై అంతోయింతో ఆధారపడక తప్పదు. ఈ శరీరంలో జవసత్వాలు ఎల్లకాలమూ

నిలవవు. ఒకరికొకరు చేదోడు, వాదోడుగావుండి సంసారం నడుపుకుంటే జీవితం సుఖంగా గడుస్తుంది. నాలుగుఎద్దులూ, పులివిషయం తెలిసిందేకదా." అన్నది అలివేలు తానూ మినుముల్లో రాళ్ళుఏరుతూ.

"ఊ" అన్నది చంద్రిక తలఊపుతూ.

"ఈవిషయం ఈకాలంవాళ్ళు గమనించటంలేదే. ఎవరికివారు స్వతంత్రంగా ఒంటరిగా ఉండాలనుకుంటున్నారు. పెద్దాచిన్నా తారతమ్యం తెలుసుకొని ప్రవర్తించటం, పెద్దల పట్ల భయభక్తులుకలిగి ప్రవర్తించటం ఈకాలంవాళ్ళు అవమానంగా, తమనితాము లోకువచేసుకున్నట్లుగా భావిస్తున్నారే. అదితప్పంటాను" అన్నది అలివేలు.

"ఊ" అన్నది చంద్రిక శ్రద్ధగావింటూ.

"నలుగురూ కలసి ఉండగానే, పంతాలూ, అనుమానాలూ కల్పించుకొని పండంటి కుటుంబాలు విచ్ఛిన్నమౌతున్నాయి. ఈకాలంవాళ్ళకి కలుపుగోలుతనం, అడకువ, వినయవిధేయతలూ తక్కువ" అన్నది అలివేలు.

"మరి స్వతంత్రంగా బ్రతికితేనే మంచిదికదా అత్తయ్యా. ఎటువంటిపంతాలూలేక తమపనితాము చేసుకుంటారు. అనుమానాలకి తావుండదు. అసూయలకి అవకాశం ఉండదు. తనయిల్లూ, తనభర్తా, తనపిల్లలూ అనుకొని కష్టపడతారుగా" అంది చంద్రిక ధైర్యంచేసి.

"ఇప్పుడు మాత్రం పరాయివారెవరుచెప్పు. నా అత్త, నామామ, నామరది, నాభర్త, నాసంసారం అని నీవనుకోవచ్చు. అలాగే నీ తోడికోడలు లక్ష్మికూడా నా అత్త, నా బావ, నా తోడి కోడలు, నా భర్త అనుకుంటూ పని చేసుకోవచ్చు. దీనిలో కొంత నిస్వార్థ సేవ ఉంది. పైగా ఒకరి నొకరు ఆదుకోవచ్చు. నీకు ఒంట్లో కులాసాగా లేకపోతే నేను చేస్తాను. లేదా లక్ష్మి చేస్తుంది. లక్ష్మికి కానీ, నాకు కానీ ఆరోగ్యం చెడినప్పుడు నీవు చేస్తావు. దానివల్ల సుఖం ఉంది. స్వతంత్రంగా, ఒంటరిగా ఉన్నప్పు డివన్నీ ఎలా కుదురుతాయి? ఒంట్లో ఎలా ఉన్నా, కష్టం వచ్చినా, సుఖం వచ్చినా ఆదుకునేవా రెవరు? పైగా మరో విషయం చంద్రా! అంతా తలో నాలుగు రాళ్లూ తెస్తే సుఖంగా జీవితం వెళ్ళ మారిపోతుంది. అదే ఎవరికి వారంటే ఎన్ని హంగులు కావాలి? వేరే యిల్లు, పని మనిషి యిలా ఎన్నో... అవసరాలు పెరుగుతాయి. పైగా ఒంటరి తనం బాధిస్తుంది. కష్టం గానీ, సుఖంగానీ యితరులతో పాలుపంచుకున్నప్పుడుండే అనుభవం వేరు. ఎంత కష్టమైనా మన నంతగా బాధించదు. సంతోషమైనా ఒకరితో చెప్పుకుని, వాళ్ళతో కలిసి అనుభవిస్తేగాని మనస్సుకి తృప్తిగా ఉండదు. ఏదైనా కష్టం కల్గితే యితర్లతో చెప్పుకుంటే మనస్సు తేలికవుతుంది. ఆ కష్టం అంతగా బాధించదు. సంతోషమైనా

ంతే ఇతర్లతో చెప్పి నప్పుడు వాళ్ళూ సంతోషిస్తే మన
కుక్కువ ఆనందంగా ఉంటుంది." అన్నది అలివేలు.

"ఇంక అన్నానికి లేవండత్తయ్యా. మిట్ట మధ్యాహ్న
మవుతున్నది" అన్నది చంద్రిక మినుములు బుట్టలోకి
త్తుతూ.

"ఊ. పద. వడ్డిస్తూండు. వస్తాను మడి కట్టుకొని"
అన్నది అలివేలు లేస్తూ.



# 8

సాయంత్రం నీ రెండ తోటలోని చెట్లమీద పడ తున్నది. అస్తమిస్తున్న సూర్యుని ముఖం ఎర్రగా కందిపోయి ఉంది. క్రొత్తగా శోభనం పెళ్ళి కూతురు భర్త గదిలోకి అడుగిడబోతూ సిగ్గు పడుతుంటే ముఖం జేవురించి నట్లుంది సూర్య బింబం.

తోట మధ్యలో ఫౌంటెన్ ఉంది. నీళ్ళు ఎత్తుకి వెళ్ళి మళ్ళీ నేలమీద పడిపోతున్నాయి. తోట మరో ప్రక్కన గాంధీ మహాత్ముని విగ్రహం ఉంది. చేతిలో కర్ర, కాళ్ళకి కిర్రు చెప్పులు, బోసినవ్వుతో వెలిగి పోతున్న ముఖం, సంధ్యారుణ కాంతుల్లో వింతగా వెలుగుతున్నది. బొమ్మని చూస్తూనే నమస్కరించ బుద్ధి వేసేటట్లుంది. ఆ ప్రక్కనే నెమళ్ళు మయూరగభారం మొయ్యలేక, మొయ్యలేక వయ్యారంగా నడుస్తున్నాయి. పావురాలు కువ, కువ శబ్దం చేస్తున్నాయి. బాతులు తోటలోని చెరువు నీళ్ళల్లో ఈత కొడుతూ వింత ధ్వనులు చేస్తున్నాయి. గూళ్ళకు చేరుకునే పక్షుల రొద కర్ణపేయంగా ఉంది.

తోటలోని బెంచీ మీద శేషాచారి కూర్చున్నాడు. లక్ష్మి పూలచెట్ల దగ్గర నిలబడి తనకు కావలసిన పూలు

సుకుంటున్నది. అన్నపూర్ణమ్మ భర్త ప్రక్కనే కూర్చొని త్తులు చేసుకుంటున్నది.

"ఓసి నీ అసాధ్యం కూలా. తోటలో కూడా పనే ఏటే, హాయిగా కూర్చుని చల్లగాలి అనుభవిద్దామనిలేదు" అన్నాడు శేషాచారి.

"సరే లెండి. దేవుడి దగ్గర దీపారాధన చెయ్యటానికి ఒత్తులు అయిపోయాయి. అందుకని చేసుకుంటున్నాను లెండి" అన్నది అన్నపూర్ణమ్మ.

తండ్రి మాటలు విని లక్ష్మి వెనుదిరిగిచూచి నవ్వింది. మళ్ళీ తన పనిలో నిమగ్నమైంది.

"అది సరేగానీండి. మన అమ్మాయి సంగతి మీకు పట్టినట్లేలేదు." అన్నది అన్నపూర్ణమ్మ.

"ఏమిటే పట్టేది దయ్యమా? భూతమా? దింపి వెళ్ళినవాడు మర్యాదగా తీసుకెళ్ళవద్దా" అన్నాడు శేషాచారి చుట్ట ముట్టిస్తూ.

"బాగుంది. అతనికెన్ని పనులున్నాయో మీరైనా తీసికెళ్ళి దింపి రాకూడదా?" అన్నది అన్నపూర్ణమ్మ చేతికి విభూతిరాసుకొని దూదితో దారం తిస్తూ.

"ఊ. నాకింకేమీ పనిలేదు. అయినా అమ్మాయి వెడతాననందే నేనెల్లా తీసుకెళ్ళను. ఊహవచ్చిన పిల్ల తన మంచి చెడ్డలు తనకి తెలీవా?" అన్నాడు శేషాచారి.

"తెలిస్తే నాకీ తాపత్రయం దేనికి" అన్నది అన్నపూర్ణమ్మ.

దానికక్కడ ఏం కష్టంగావుందో తెలుసుకోకుండ బలవంతాన దింపితే లాభమేమిటి దాని ఉసురుపోసు కోవటంతప్ప? పోనీ యిక్కడే ఉంటుంది. మనకి చేదా?" అన్నాడు శేషాచారి.

"బాగుంది మీ వరస. ఎవరైనా వింటే నవ్విపోగలరు. ఆడపిల్ల అత్తారింట్లో ఉండాలిగాని పుట్టింట్లో ఉంటే ఎలా. ఎంత గారాబమైనా నలుగురూ నాలుగుమాట లంటారు." అన్నది అన్నపూర్ణమ్మ.

"అనుకోనీ, లోకులకి అది అలవాటే. ఎవరో ఒకరి ఊసు చెప్పుకోందే కొందరికి కాలం గడవదు మరి. ఏం చేస్తారు పాపం" అన్నాడు శేషాచారి.

"వాళ్లమాత్రం ఊరికే ఎందుకనుకుంటారు. తప్పెక్కడుందో, అపవాదులు వాళ్ళకే వస్తాయి. ఉట్టి పుణ్యానికి ఎవరూ నిందించరు. ముచ్చటగా కాపరం చేసుకోవలసిన పిల్ల మోడులా పుట్టింట్లో పడివుండట మేం ఖర్మండీ. దాని ఈడు వాళ్ళంతా నలుగురు బిడ్డల తల్లులయ్యారు. ఇది ఇంకా గారాబాలు పోతున్నది" అన్నది అన్నపూర్ణమ్మ.

"పిల్లల్ని కనటం ఓ గొప్పటే పిచ్చిదానా, అంతకంటే గొప్పపనులు మరింకేమీ లేవా?" అన్నాడు శేషాచారి.

లక్ష్మి పూలుకోసుకొచ్చి తండ్రికి దగ్గర్లోనే ఉన్న మరో బెంచిమీద కూర్చుంది. పూలమాల కడుతూ తల్లీ, తండ్రీ మధ్య సంభాషణ మౌనంగా వింటోంది.

"ఆ! ఉన్నాయి లెద్దురూ. ఆడపిల్లకి సంసారం చేసుకోవటం, పిల్లల్ని పాపల్ని సాకడంకంటే పరమార్థం యింకేం ఉంది. ఎన్ని చదువులు చదివినా ఆడది ఆడదే. మొగవాడు మొగవాడే. ఎవరి బాధ్యతలు వారు నిర్వర్తించాల్సిందేకదా" అన్నది చేసిన వత్తులు ఏరి బుట్టలో పడేస్తూ.

"ఈ రోజుల్లోకూడా అంతే ననుకుంటున్నావటే. ఆడవాళ్ళుకూడా ఉద్యోగాలు చేస్తున్నారు, ఊళ్ళేలుతున్నారు, గవర్నర్లూ, మంత్రులూ ప్రెసిడెంట్లూ అవుతున్నారు. తెలిసిందా. అదంతా మీకాలంలోనూ, మీ నాయనమ్మకాలంలోనూ జరిగే విషయాలు" అన్నాడు శేషాచారి.

"అయితే కొంపతీసి మళ్ళీ చదివిస్తారేమిటే, నలుగురూ నవ్వటానికి" అన్నది అన్నపూర్ణమ్మ బుగ్గన వేలు వేసుకొని.

"ఏం? చదివిస్తేతప్పా? నలుగురికీ ఏమీపనిలేదుటే. అసమానం, నిన్నూ నన్నూ చూచి నవ్వటంతప్ప" అన్నాడు శేషాచారి.

"చాల్లెండి సరసం. అరవై ఏళ్ళోచ్చాయి, చదువుకోక నోట మట్టికొట్టుకుంటానా అన్నాట్ట ఓ ప్రబుద్ధుడు. మీరు చెప్పే సంగతి అలాగే ఉందిసుమా" అన్నది అన్నపూర్ణమ్మ.

"అవునే, ఆమాటానిజమే. ఇప్పుడు అలా చదివేవాళ్ళెంత మందిలేరు. మీ ఆడవాళ్ళల్లోనే ఉన్నారుకూడా" అన్నాడు శేషాచారి.

"అదేం చోద్యమండోయ్. కాటికి కాళ్ళు చాచు కోని చదువుకోవటమేమిటి? కొంపదీసి యమధర్మరాజు దగ్గర కొలువు సంపాయించటానికా ఏమిటి!" అన్నది అన్న పూర్ణమ్మ నవ్వుతూ.

లక్ష్మికూడా నవ్వింది. "అమ్మా ఆకలవుతున్న దే." అన్నది యింక ఆ సంభాషణ ఆపుజేయించే ఉద్దేశ్యంతో.

"సరే, పద ఒక్క-క్షణం కూర్చోనివ్వవు" అంటూ విసుక్కుంటూ లేచింది అన్నపూర్ణమ్మ.

భోజనాల దగ్గర శేషాచారి లక్ష్మిని కదిలించాడు. "అమ్మాయ్, అత్తవారింటి కెడతావా? నన్ను దింపి రమ్మంటావా మీ ఆయనకి ఉత్తరం వ్రాయమన్నావా?" అన్నాడు శేషాచారి.

అంతవరకూ ఎవరైనా దింపివస్తే బాగుండుననుకున్న లక్ష్మికి తీరా వెళ్ళవలసిన సమయమొచ్చిందని తెలియగానే ఎక్కడలేని భయమూ, సంకోచమూ కలిగాయి. మళ్ళీ ఆ నరక కూపంలోకి ఏమని కాలుబెడుతుంది?

"వేరు కాపరం ఉంటేనేకాని వెళ్ళ"నంది లక్ష్మి. అదో వంక. దానికి వాళ్ళు రాజీకివస్తే భర్తని పుట్టింటికే రప్పించుకోనవచ్చని ఆమె ఊహ. తను ఆడింది ఆట, పాడింది పాట. అదీ ఆమె ఉద్దేశ్యం.

"అవునే, అమ్మాయి ఆలోచనా బాగానే ఉంది. వేరింటి కాపురం మాత్రం దేనికి. ఇక్కడే వచ్చి ఉండవచ్చు" అన్నాడు శేషాచారి.

"మీ యిద్దరి ఆలోచనా బాగానే ఉంది కానీండి మరి అతగాడు అతని తలి దండ్రులూ అందు కంగీకరించాలిగా. మనకూ బాగానే ఉంటుంది. బిక్కు బిక్కుమంటూ ఉండ కుండా చిలకా గోరింకల్లా కూతురూ అల్లుడూ కాపురం చేస్తుంటే చూడ ముచ్చటగా ఉంటుంది. దేవుడు దయదలిచి దానికడుపున ఓ నాలుగు కాయలుకాస్తే పిల్లల కొరతా తీరు తుంది. ఇంత పెద్ద యిల్లూ బోసిపోకుండా కళకళలాడుతుంది. పిల్లలు లేని నట్టిల్లు వల్లకాడుతో సమాన మంటారు" అన్నది అన్నపూర్ణమ్మ ఉత్సాహంగా.

"ఇంకేం, రైటో, అల్లుడ్ని యిక్కడే నచ్చి ఉండ మందాం. అమ్మాయిని వదిలిపెట్టి ఉండలేకుండా ఉన్నాం. ఆస్తిపాస్తులు చూసుకొనే వారెవరూలేరు. మేమూ ముసలి వాళ్ళమైనామని రాస్తాను" అన్నాడు శేషాచారి కాలి మీద తాళం వేస్తూ.

"ఊ...రాయండి వేగం" అన్నది అన్నపూర్ణమ్మ అంతులేని ఆనందంతో.

లక్ష్మికికూడా బరువు దింపినట్లయింది. తేలికపడిన మనస్సుతో రేడియో ట్యూనుచేసింది. కూనిరాగాలు తీస్తూ యిల్లంతా కలియతిరిగింది.

అంతాభోజనాలు ముగించి సావిట్లో కూర్చున్నారు రేడియో వింటూ.

---

# 9

అలివేలు పంచలో కూర్చొని పాతబట్టలు కుట్టుకుంటున్నది. చంద్రిక అత్తగారికి అల్లంతదూరంలో కూర్చొని బియ్యం జల్లిస్తున్నది.

పోష్టుమాను వచ్చి ఉత్తరం గిరవాటువేసి వెళ్ళాడు. చంద్ర తలవంచుకొని పనిచేసుకుంటోంది. అలివేలు "చంద్రా, ఆ ఉత్తరం చదివి వినిపించు. లక్ష్మి దగ్గర్నుంచి వచ్చిందేమో" అన్నది.

చంద్రిక తలెత్తి అత్తగారివంకచూచి చిరునవ్వుతో "లక్ష్మిదగ్గర్నుంచి అయిఉండదత్తయ్యా. ఆవిడ యింటికెందుకు వ్రాస్తుంది. స్కూలుఅడ్రసుకి వ్రాస్తుంది" అన్నది.

అలివేలు "అవునుసుమా. మరెవ్వరు వ్రాశారంటావు ?" అన్నది ఆందోళనగా చూస్తూ.

"చూస్తే తెలుస్తుందిగా" అంటూ లేచి ఉత్తరం అందుకుంది చంద్రిక.

"లక్ష్మి నాన్నగారు వ్రాశారత్తయ్యా" అన్నది చంద్రిక.

"అలాగా. ఏమిరాశాడో శాస్త్ర చదువుదూ" అంది. ఆదుర్దాగా.

"ఏమోనత్తయ్యా. ఆయనరాతనాకు తెలియటంలేదు. సాయంత్రం మరిదివస్తాడుగా. ఆతనిచేత చదివించండి. లేదా మామగారికి స్తేసరి" అన్నది చంద్రిక.

"కాస్తచూద్దూ. చిన్నాడికిస్తే, 'ఆ, ఏమీలేదంటూ' తీసిపారేస్తాడు. అసలువిషయం తేలదు. మీ మామగారు రాత్రికి వస్తారో, రారో" అన్నది అంతవరకు ఓపికపట్టలేక.

"సరే . ప్రయత్నిస్తాను...ఊ...బావగారికి... నమస్కారములు...ఇక్కడ...ఇక్కడ...అంతా...క్షేమము. మేము...అమ్మాయిని యింతవరకూ...దిగబెట్టనందుకు... మీరు కోపగించి...ఉంటారనుకుంటాను...మీరుదయ...చేసి కోపగించని ...పక్షంలో...ఒకమనవి...మాకు... ఒక్కగా నొక్క ...సంతానం...లక్ష్మి...అనిమీకు... తెలుసు ... ఆమెని...విడిచి...ఉండటం పెద్దవారమైన...మా యిరువురికీ కష్టంగానే...ఉన్నది. పిల్ల...కళ్ళముందుంటే...బాగుంటుం దని వాళ్ళ ... అమ్మ అభిప్రాయపడుతున్నది...కాబట్టి... అల్లుడ్ని యిక్కడికి...పంపగలరని ... ఆశిస్తున్నాను ... అన్యథా భావించరని...ఆశిస్తున్నాను.... అల్లుడు...కష్టపడవల సిన అగత్యం ఎంతమాత్రం లేదు,..ఇంక...మీకు కొడుకుని... వదలిపెట్టామనే....బెంగఉండదు....పెద్దకొడుకూ.... కోడలూ ఉన్నారు కాబట్టి ...ఏవిషయం...ఆలోచించి..,త్వరలో తెలియ జేయగలరని ..ఆశిస్తూ...మీబావగారు... శేషాచారి" అంటూ కూడ బలుక్కుంటూ ఎల్లాగో ఉత్తరం పూర్తిచేసింది చంద్రిక.

"ఆ ! ఏమిటీ. చిన్నాడ్ని యిల్లరికం రమ్మంటున్నారా? అదేం బాగుంటుంది ? అవున్లే. అదీ ఒకందుకు మంచిదే. వాళ్ళకీ లక్ష్మితప్ప మరెవ్వరూ వారసులు లేరుకదా! ఆస్థి పాస్థుల విషయం యిప్పటినుంచే చూసుకుంటాడు." అంటూ తననితనే సమర్థించుకున్నది అలివేలు.

చంద్రిక ఎలాంటి అభిప్రాయమూ వెలిబుచ్చలేదు. ఏమంటే ఏమౌతుందోనని చంద్రికకు భయం. మరిది వెళ్ళటము బాగుండ లేదంటే, అనుమానాలకి ఆలవాల మవుతుంది. వెడితే బాగుంటుందంటే, ఆస్థి పాస్థులన్నీ తమకే దక్కాలని ఆశగాఉందనీ, మరిదిని వెళ్ళగొట్టాలని ఊహిస్తున్న దనీ అంటారు. అందువల్ల ఎటూ మాట్లాడకుండా మౌనం వహించటం ఉత్తమంగా ఎంచి మామూలుగా తన పనిలో నిమగ్నమైంది.

చంద్రిక నుండి ఎలాంటి అభిప్రాయమూ రాకపోయే సరికి అలివేలు ఉండబట్టలేకపోయింది. తనమాటకి, అవుననో, కాదనో చంద్రిక వెలిబుచ్చితే సంభాషణ కొనసాగించ టానికీ, అందులోని బరువు బాధ్యతలూ, కష్టనష్టాలూ చర్చించటానికి అవకాశం లభిస్తుంది.

అందుకే అలివేలు "ఏమే చంద్రా. ఏమంటావు ? నిజంగా చిన్నాడు ఉద్యోగం చెయ్యాల్సిన ఖర్మమేం వచ్చింది ? ఉన్న ఆస్థి పాస్థులు చూచుకొంటూ కాలుమీద కాలేసుకు కూర్చోవచ్చు. వాడక్కడికి వెడితే యిక్కడి ఆస్థి

పాస్థులు కొద్దీ గొప్పా పెద్దాడికి యిచ్చేయవచ్చు. ఎవర్నీ అన్యాయం చేసినట్లుకాదు" అన్నది.

"ఏమో నత్తయ్యా, మామగారితో ఆలోచించి, మరిది అభిప్రాయంకూడా కనుక్కొని అలా చేస్తే బాగుం టుంది. ఎక్కడైతేనేం వాళ్ళిద్దరూ సుఖంగా ఉండటమేకదా మనకి కావాల్సినది" అన్నది చంద్రిక పాము చావాకుండా, బడితె విరగాకుండా సమాధానం చెప్తూ.

"అవుననుకో, అదీ నిజమే. నీ యిష్టం, నా యిష్టం ప్రకారం ఈ యింట్లో నడిచేదెవ్వరు ? ఆయన యిష్టం ఆ పైన వాడి యిష్టం మధ్య మనదేముంది? వాడు వెళ్ళనంటే మనం చెయ్యగలిగిందేమీ లేదు" అన్నది అలివేలు సూది లోకి దారం ఎక్కిస్తూ.

ఇంతలో రామచంద్రం రానేవచ్చాడు. తలవంచుకొని యింట్లోకి వెడుతున్నాడు. చంద్రికకు అక్కడినుంచి లేచి వెళ్ళాలో ఉండాలో తెలియక సందిగ్ధంలో పడింది. వెడితే ఏమనుకుంటాడో, ఉంటే ఏమంటుందో అత్త అని చంద్రిక భయం. పమిటకొంగు తీసి నిండాకప్పుకొని తలవంచుకొని మామూలుగా పని చేసుకుంటోంది. జెల్లెడపట్టిన బియ్యం చెరిగి ఒకరాసి చేస్తున్నది. నూకలు తీసి మరోప్రక్కన పెట్టింది.

అలివేలు పాతబట్టలుచుట్టి ఒకమూలపెట్టి ఉత్తరం చేతబట్టుకొని కొడుకు గదిలోకి వెళ్ళింది.

రామచంద్రం బడి బట్టలు విప్పి వేరే బట్టలు కట్టుకుంటున్నాడు.

అడుగుల చప్పుడువిని ఉలిక్కిపడ్డాడు. వెనుతిరిగి చూచాడు. తల్లి గుమ్మంలో నిలబడిఉంది. చేతిలో ఉత్తరం.

"ఉత్తరం ఎక్కడినుంచమ్మా" అన్నాడు తల్లిని పలకరిస్తూ.

"మీ మామగారి దగ్గర్నుంచి నాయినా" అంటూ ఉత్తరం బల్లమీద పెట్టింది.

రామచంద్రం బట్టలు వేసుకోవటం పూర్తిచేసి "అమ్మా, టిఫిన్ ఏమైనా ఉందా?" అన్నాడు తల్లి దృష్టి నా ఉత్తరం మీదనుంచి మరల్చాలని.

"ఊ. తెస్తాలే. ఈ లోపల ఆ వుత్తరం చదువుకో. ఏమి రాశారో చెప్పు" అన్నది అలివేలు వంటింటి వైపు వెళ్ళి. ఓ పళ్ళెం నిండా చేగోడీలు మరో చేతిలో గ్లాసులో నీళ్ళతో కొడుకు గదిలోకి అడుగు బెట్టింది.

రామచంద్రం దీర్ఘంగా నిట్టూరుస్తున్నాడు.

"దేనికిరా. అలా దిగాలు పడ్డావు! ఏమని వ్రాసి ఉందేం?" అన్నది అలివేలు తనకేమీ తెలియనట్లు.

"ఏమనా? నన్ను ఉద్యోగం మానుకొని అక్కడికి వచ్చి ఉండమని" అన్నాడు రామచంద్రం తల్లి చేతిలోని పళ్ళెం అందుకుంటూ.

"మరి నీ అభిప్రాయం ఎలా ఉంది? ఏ విషయమూ తేల్చి చెప్తే నాన్నగారితో చెప్తాను" అన్నది అలివేలు.

"నా అభిప్రాయమా? అందులో ఆలోచించే దేముంది? ఇల్లరికం వెళ్ళటం నా కిష్టంలేదు. స్వయంగా కష్ట పడి సంపాయించుకోకుండా గ్రుడ్ల మీద కోడిలా తిని యింట్లో కూర్చొని కుండల్లో గుర్రాలుతోలమంటావా? నా కిటువంటివి నచ్చవు. ఓ పావలా కావలసినా యితరుల ముందు చెయ్యి చాపటం నా వల్ల కాని పని. భార్య సొమ్ముతో పొట్టనింపు కునేంత అభాగ్యుణ్ణి కాదమ్మా. ఏదో మీ ధర్మాన నాలు గక్షరం ముక్కలు నేర్చుకున్నాను. దానితో నాలుగు రాళ్లు సంపాయించ గల్గుతున్నాను. పైగా తల్లి దండ్రుల్ని వదిలి పరుల పంచల్లో పడిగాపులు గాచేదా? కని, పెంచి, పోషించీ, అష్టకష్టాలూపడి చదివించి పెద్ద వాణ్ని చేసి ప్రయోజకుణ్ని చేసిన మిమ్మల్ని ఈ ముసలి తనంలో ఒంటరిగా వదిలి వెళ్ళేదా? అన్నయ్య మూగవాడు. మిమ్మల్ని చూసేభారం వాడి ఒక్కడి నెత్తిమీదా వేసి బాధ్యతల్ని మరిచి సుఖించేదా? ఇదేనా నీవు చెప్పే సలహా" అన్నాడు ఉద్రేకంతో.

అలివేలు నవ్వి "పిచ్చివాడా నీవు పచ్చగా ఉండటమే మాకు కావలసింది. నీవు నీ భార్యతో సుఖంగా కాపురం చేసుకుంటూ ఉంటే చూసి సంతోషిస్తాం. పైగా అత్తవారి ఆస్థిపాస్థులకు మీరే అధికారులు. అంత ఆస్థికీ అధికారివై కూడా యితర్ల దగ్గర పని చెయ్యటం దేనికిగా" అన్నది.

"అదేనమ్మా నీకు అర్థం కాని విషయం. నీవే చెప్పు. ఇన్నేళ్లు వచ్చి నాన్నని 'అణా యివ్వనాన్నా, రూపాయి యివ్వనాన్నా సినిమాకి వెడతాను, బేడ యివ్వు నా పెళ్లా

నికి పూలు తెస్తాను' అని అడిగితే ఎలా ఉంటుందమ్మా. మీకూ, నాకూ సిగ్గుగా ఉంటుంది. అటువంటి అప్రయోజకుడైన భర్తని కట్టుకున్నందుకు భార్య దుఃఖిస్తుంది. అలాగే యిది కూడా. మామగార్నో, అత్తగార్నో, పెళ్ళాన్నో చీటికీ, మాటికీ డబ్బడగటం బాగుంటుందా? అది భార్యకి అలుసు కాదా. నా అస్థిలో, నా డబ్బుతో బ్రతుకుతున్నాడనుకొని నిర్లక్ష్యంగా చూస్తుంది. ఇవన్నీ నీకు తెలియవా అమ్మా" అంటూ టిఫిన్ పూర్తిచేసి లేచాడు. మంచి నీళ్ళ గ్లాసు ఎత్తుకొని గడగడ త్రాగేశాడు.

రామచంద్రం బయటికి వెడుతుంటే అలివేలు నిర్ఘాంతపోయి చూస్తున్నది. ఆమె ఆశలన్నీ అడియాసలైనాయి. ఈ సమస్య తీరే ఉపాయం కనిపించలేదు. వీడా అత్తవారింటికి వెళ్ళడు. ఆవిడా అత్తవారింటికి రానని వ్రతం పట్టింది. వీరిద్దర్నీ కలపగల శక్తి ఆ భగవంతుడికి వినా మరెవ్వరికీ ఉన్నట్లు కనిపించటం లేదు. అనవసర పంతాలతో పచ్చటి కాపురానికి చిచ్చు పెట్టుకొంటున్నారు. తమ యింటికి తామే నిప్పంటించుకునే మూర్ఖులుగా తయారైనారు. ఇద్దరూ కొద్దో, గొప్పో చదువుకున్నవారేను. అలివేలు గోడ కానుకొని అలాగే ఉండిపోయింది.

రామచంద్రం యింట్లోనుంచి బయటపడి అలా బయలుదేరాడు. ఎటుపోవాలో పాలుపోలేదు. పార్కువైపు వెడదామని తలవంచుకొని ఆలోచిస్తూ పోతున్నాడు. వెనక ఎవరో పరుగెత్తుకొచ్చినట్లయి వెనుతిరిగి చూచాడు. ఎవరో

బిళ్ళ బంట్రోతు తన వెనకనే రొప్పుతూ, రోజుతూ పరుగెత్తు కొచ్చాడు.

రామచంద్రం "ఏమిటీ, ఎవరికోసం" అంటూ నిర్ఘాంత పోయి చూచాడు.

"తమకోసమేనండి బాబుగారు. అయ్యగారు కార్లో యింటికి వెడుతుండారు. తోవలో తారుస పడ్డారు. పంతులు గార్ని పిలుచుకురా పనుంది అన్నారండి. ఆమైన ఒక్క పరుగు లంకించుకొని ఈడవచ్చి పడ్డానండీ బాబూ" అంటూ దణ్ణం పెట్టాడు.

"మీ అయ్యగారెవరో నాకు తెలీదే" అన్నాడు రామచంద్రం ఆశ్చర్యంతో అతనివంక తేరిపార చూస్తూ.

"మీకు తెలీదేంటి బాబూ. మా అయ్యగారు.... జిల్లా మున్సిబు గారండీ... ఆడ ...ఆ రింటికాడి బంట్రోతు నండయ్యా. అమ్మాయిగోరు మీ యిసుకూలులోనే గదండీ చదువుతూంట. ఆ మాత్తరం తెలీదేంటి బాబూ, యిన్నేళ్ల నుంచీ ఈడ ఉంటూ" అంటూ రామచంద్రం తెలివితక్కువ తనాన్ని వేలెత్తి చూపిస్తూ గలగల నవ్వాడు. గలగల సెల యేరు పారుతున్నట్లనిపించి ఉలిక్కిపడ్డాడు రామచంద్రం.

"ఆయనకి నాతో ఏం పని చెప్మా" అంటూ ఆలో చన నభినయించాడు రామచంద్రం తనలో తా ననుకుంటూ.

"ఓహో, చెప్పావుగా, వారమ్మాయి మా స్కూల్లో చదువు తున్నదని. బహుశా అమ్మాయి చదువు విషయం

కనుక్కోవటానికి కాబోలు... హెడ్మాష్టరుగార్ని కనుక్కోక సన్ను అడగటం దేనికబ్బా" అంటూ ఆలోచించ నారంభించాడు రామచంద్రం.

"నడిదారిలో నిలుసుకొని ఏంది ఆలోసిత్తుండారు. అయ్యగారి కాడికి పదండసె. ఆయనే సెప్తాడు గందా. ఆ పాటిదానికి యిశారించాలా అంట" అంటూ లాపాయింటు తీశాడు. ఎంతైనా మున్సబుగారి బంట్రోతుకదా. ఆమాత్రం 'లా' పాయింట్లు వంటబట్టకుండా ఉంటాయా? అనుకుని నవ్వుకున్నాడు రామచంద్రం. ఆ బంట్రోతు వెనకనే అడుగులో అడుగేస్తూ నేరంచేసిన అపరాధిలా బిక్కు బిక్కుమంటూ కారుని సమీపించారు. కార్లో వెనక సీట్లో ఓ పదహారేళ్ళ పిల్ల, ఆ పిల్ల ప్రక్కనే పదమూడేళ్ళ పిల్లవాడొకడు కూర్చొని ఉన్నారు. ముందు సీట్లో డ్రైవరు, జిల్లా మున్సబుగారు కూర్చున్నారు. రామచంద్రాన్ని చూడగానే ఆయన ముఖం వికసించింది. దరహాస చంద్రికలు పెదవులపై చిందులాడుతున్నాయి కళ్ళతో ఆహ్వానిస్తూ "రండి మేష్టారూ మీతో పనుంది. వెనక సీట్లో కూర్చోండి. ఇంటికి వెళ్ళాక తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" అన్నాడు మున్సబుగారు.

రామచంద్రం సిగ్గుపడ్డాడు. మొహమాట పడ్డాడు. "దేనికండీ. మీ యిల్లెక్కడో అడ్రసు చెప్పండి, వస్తాను. కొద్దిగా పనుంది. అదిచూసుకొని వస్తాను" అన్నాడు తప్పించుకోవాలని.

"అలాగా, బజార్లో ఏమైనా పనుందా చెప్పండి. అలా వెళ్ళి వెళ్దాం" అన్నాడు మున్సబు.

ఇంక తప్పించుకొనే దారిలేక వెనకడోర్ బంట్రోతు తెరిచి పట్టుకోగా లోపలికిదూరాడు. మున్సబుగా రమ్మాయి అవతలికి జరిగి తమ్ముడ్ని కూడా జరగమని చెప్పి మేష్టారికి చోటు చేసింది. రామచంద్రం సిగ్గుపడుతూ ముడుచుకొని కూర్చున్నాడు. మున్సబుగా రమ్మాయి నీళ సిగ్గుతో ముఖం కందబారింది. కళ్ళు దించుకు పోయాయి. బంట్రోతు వచ్చి రామచంద్రం కాళ్ళ దగ్గర కూర్చున్నాడు. కారు తలుపు మూసేశాడు. కాసు రయ్యిన పరుగెత్తుతోంది. రామ చంద్రం యిరకాటంలో బాధ పడుతున్నాడు. కాళ్ళమీాద కూర్చున్నాడు బంట్రోతు. అటూ యిటూ మెసల టానికి వీలులేకుండా ఉంది. ఊపిరి బిగబట్టుకొని ప్రాణా లరచేతిలో పెట్టుకొని ఎప్పుడు యిల్లు వస్తుందిరా బాబూ అంటూ మీాన మేషాలు లెక్కపెడ్తున్నాడు రామచంద్రం. అతనికి ముళ్ళ మీాద కూర్చున్నట్లుంది. హాయిగా, కులాసాగా నడిచివెళ్లే వాడు బంగారు పంజరంలో బంధించిన చిలకలా యమ యాతన పడిపోయాడు. "ఈ రోజు ఎవరి ముఖంచూసి నిద్ర లేచానా" అంటూ తనలో తనే విసుక్కున్నాడు. అసలే మనసులోని గాయాన్ని తల్లి రేపింది. ఆ బాధకి తట్టుకోలేక అలా చల్లగాలిలో తిరుగుదాం కదా అనుకొని బయలు దేరాడు. ఆగాయం మీాద కారంచల్లినట్లుగా ఉంది మున్సబు గారి ఆహ్వానం. తలవంచుకొని అలాగే కూర్చున్నాడు.

కన్నుమూసి తెరిచేసరికి కారు మున్సబు గారింటిముందు ఆగింది కాళ్ళమీద పెద్ద బండరాయి పెట్టినట్లుగా కూర్చున్న బంట్రోతు లేచి నిలబడి డోర్ తెరిచి బయట పడటంతో రామచంద్రం కొండంత బరువు దింపినట్లుగా ఫీలయి ఊపిరి ధారాళంగా పీల్చుకున్నాడు. కాళ్ళు సరిచేసు కొని మెలగా లేచి నిలబడి ఒక్క ఉదుటున బయటపడ్డాడు. ఆ వెనకనే పిల్లలిద్దరూ చెంగునదూకి యింట్లోకి పరుగెత్తి నంత పనిచేశారు. మున్సబుగారు రండి మేష్టారూ" అంటూ లోపలికి ఆహ్వానించారు.

ఇంటి వాతావరణం చూచే సరికి రామచంద్రం మనస్సు తేలిక పడింది. ఆనందంతో గంతులు వేసింది. పెద్ద గేటు. గేటు కిరుప్రక్కల క్రోటన్సు మొక్కలు. మెట్ట తామరచెట్లు బాట కిరువైపులా బారులు తీరి ఉన్నాయి. పచ్చ పూలు, ఎర్రపూలు, తెల్లపూలు...ఓ ఒకటేమిటి - రక రకాల మెట్ట తామర చెట్లున్నాయి. అన్నీ రంగుల పూలు. వింత సోయగాన్ని సమకూరుస్తున్నాయి. మెట్ట తామర్ల ప్రక్కనే మందారాల తైనుంది. ఎర్రని ముద్ద మందార పూలు పచ్చని ఆకు సందుల్లోనుంచి తొంగి చూస్తున్నాయి. ఆ ప్రక్కనే సరుగుడు చెట్లు కత్తిరించబడి కోన్ ఆకారంలో ఉన్నాయి. గేటు దగ్గర అర్థ చంద్రా కృతిలో తడికపైన మాలతీ తీగలూ, సన్నజాజి లతలూ అల్లిబిల్లిగా అల్లుకొని బాటపై నడిచే వారిపై పూలవర్షం కురిపిస్తున్నాయి. సరు గుడు చెట్ల సందుల్లోనుంచి మల్లె, పున్నాగ, పారిజాతం,

గాగమల్లి, చంద్రికాంతలు, జినియా, సంపెంగ, పొగడ
నైట్‌క్వీన్, బంతి, చేమంతి, లిల్లీ మొదలైన అన్నిరకాల
పూల చెట్లు తొంగి చూస్తున్నాయి. ఆకులమాటున దాగిన
పూ కన్నెలు వచ్చే పొయ్యేవారిని ఓరకంట కనిపెడుతూ, తల
ఊపుతూ, కిలకిల నవ్వుతూ, గలగలలాడుతూ ఆహ్వానిస్తు
న్నాయి. మరోవైపున బత్తాయి, కమలా, సీతా ఫలం,
మామిడి, దానిమ్మ, జామ, అరటి మొదలైన ఫలవృక్ష
జాతులున్నాయి. ఆ ప్రక్కనే ద్రాక్ష తీగలు వరసగా పందిరి
పైన ప్రాకి ఉన్నాయి. గుత్తులు గుత్తులుగా ద్రాక్ష పండ్లు
వ్రేలాడుతూ చూపరులకు నోరూరిస్తున్నాయి. చెట్ల వంక
చూస్తూ తన్మయత్వంతో మైమరచి అలాగే నిలుచుండి
పోయాడు రామచంద్రం.

మున్నబుగారు బూట్లు టకటక లాడించుకుంటూ వరం
డాలోకి వెళ్ళి "మాష్టారూ, రండి. కూర్చోండి" అంటూ
వెను తిరిగి చూచాడు. రామచంద్రం గేటు దగ్గరే నిలబడి
పరధ్యానంగా చెట్ల వైపు తదేకంగా చూస్తూ కనిపించాడు.
అతడి పరధ్యానానికి తనలోనే తను నవ్వుకున్నాడు. ఇంతలో
లోపలికి వెళ్ళిన మధు బట్టలు మార్చుకొని బయటికి
వచ్చాడు.

"బాబూ, మాష్టారక్కడే నిలబడి పోయారు. పిల్చు
కురా" అంటూ కొడుకుని ఆదేశించి యింట్లోకి నడిచేరు.

కోర్టు దుస్తులు మార్చుకొని ధోవతీ, లాల్చీ ధరించి వసారాలోకి వస్తూ "అమ్మాయ్, కాఫీ, టిఫిన్ పట్టుకురా తల్లీ" అంటూ ఆర్డర్ జారీచేశారు.

బడి యూనిఫారమ్ విప్పి పట్టు పరికిణీ, నైలాన్ ఓణీ, వెల్వెట్ జాకెట్టు వేసుకొని తల దువ్వి, పౌడరద్ది, కాటుక రేఖలు తీర్చి దిద్ది, తిలకంపెట్టుకొని కాళ్ళకి గజ్జెల పట్టీలు ఘల్లుఘల్లున శబ్దం చెయ్యగా వయ్యారి హంస నడకల్తో వంటింట్లోకి వెళ్ళి ఒక ట్రేలో నాలుగు కాఫీ కావ్పులు, టిఫిన్ ప్లేట్లు పెట్టుకొని తడబడుతూ, తారుతూ వరండాలోకి వచ్చి టేబిల్ పైన ఉంచింది.

అప్పటికి మధు చెయ్యి పట్టుకొని రామచంద్రం వచ్చి ఒక కుర్చీలో ఆసీను డయ్యాడు. మున్సబుగారు రామచంద్రంతో లోకాభిరామాయణం మాట్లాడుతూ, ఆనాటి రాజకీయాలు, చదువులూ, సంఘ్యలూ, ఒక టేమిటి... అన్ని విషయాలమీదా చర్చలు జరుపుతున్నారు. రామచంద్రం నోరప్పగించి వింటూ అంగీకారం సూచించవలసిన సమయంలో తల ఊపుతూ కూర్చున్నాడు. మున్సబుగారే ఏకధాటిగా మాట్లాడేస్తున్నాడు. ఇంతవరకు ఆప్తులు దొరకక అలమటించి పోయిన వాడులా గడగడ వాగేస్తున్నాడు. రామచంద్రం ముభావంగా వింటూ తనచేతి వ్రేళ్ళవంకా, గోళ్ళవంకా చూచుకుంటూ అనీజీగా ఫీలవుతున్నాడు. అది గమనించకుండా ఆప్తమిత్రుడితో ప్రసంగించినట్లు మాట్లాడేస్తున్నారు మున్సబుగారు. ఆ ధారా ప్రవాహానికి ఆనకట్టు ఎవరైనావేసే

బాగుండునని రామచంద్రం మనస్సులో మ్రొక్కుతున్నాడు. అతని పాలిటి దేవతలా నీళ "నాన్నారూ, కాఫీ ఉప్మా చల్లారి పోతున్నాయి. ముందు తీసుకోండి. ఆపైన మాట్లాడు కోవచ్చు" నంటూ అడ్డు కట్ట వేసింది.

సడన్ బ్రేక్ పడటంతో కారు ఉక్కిరి బిక్కిరై ఆగి పోగా అందులోవి ప్రయాణీకులు ముందుకీ వెనక్కీ తూలి ఒకరిమీద ఒకరు పడి ఉలిక్కి పడ్డట్లుగా అయింది మున్సబు గారి పని. ఉలిక్కిపడి "అలాగే తల్లీ, అలాగే" నంటూ తనో కాఫీ గ్లాసూ, టిఫిన్ ప్లేటూ ముందుకు లాక్కున్నాడు. "తీసుకోవోయ్." అంటూ రామచంద్రంతో అన్నాడు.

రామచంద్రం సిగ్గుతో కుంచించుకు పోయాడు. అలాగే కూర్చున్నాడు. తనంతట తానలా తీసుకోవటమా భగవంతుడా అనుకొని గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నాడు. అతని అవస్థ, మొగమాటం గ్రహించిన నీళ ఒక గ్లాసూ, ప్లేటూ అతని ముందుంచి "తీసుకోండి మాష్టారూ" అన్నది.

మధు తనో గ్లాసూ, ప్లేటూ పుచ్చుకొని అయిదు నిముషాల్లో ఉఫ్న ఊదేశాడు. నీళ తనవంతు గ్లాసూ, ప్లేటూ పుచ్చుకొని తలవంచుకొని మరోవైపుకి తిరిగికూర్చుని తినేసింది.

మున్సబుగారు తిండిలో ఎప్పుడూ వెనక పడుతుంటారు. ఎవరైనా మాట్లాడేవాళ్ళు కనిపిస్తే పెద్ద చిక్కే.. మాట్లాడుతూ తినటం ఆయనకి చేతకాదు. అలాగంటల తరబడి కూర్చుంటారు. ప్లేటులోని పదార్థం పూర్తికాదు. గ్లాసు

లోని కాఫీ చప్పగా చల్లారి పోతుంది. ఈ లోపల పది సార్లయినా కాఫి వెచ్చచేసి తేవలసి వస్తుంది. వంటవాడు విసుక్కుంటాడు. మున్సబుగారి భార్య స్థూలకాయురాలు, ఎప్పుడూ ఆయాసం, రొప్పు, దడాను. మేడమీదికి వెళ్ళ లేదు. గట్టిగా నాలుగడుగులు వెయ్యలేదు. మనిషి మాత్రం బహు నెమ్మది. మాటలు ముక్తసరిగా ఒకటో, రెండో మాట్లాడుతుంది. ఎప్పుడూ ఈజీ ఛైరులోనే మకాం. ఆవిడ యివతల పుల్ల అవతలపెట్టి ఎరుగదు. అన్నీ నౌకర్లు చెయ్యా వల్సిందే, పైన అజపూాయిషీ భర్తో, కూతురో చూసుకో వాలి. వంటింట్లోకీ, వసారాలోకీ తిరగలేక నీళకి విసుగెత్తు తుంది. ఇంక వచ్చినవారిని తిట్టుకుంటుంది.

ఈరోజుకూడా తండ్రి తన మామూలు ధోరణిలో మాట్లాడేస్తున్నాడు. కానీ రామచంద్రం ఏమీ వినటంలేదు. అది గమనించిన నీళ "ఇంక చాల్లెండి నాన్నారూ. మీరు టిఫిన్ పూర్తిచేసి మేస్టారితో మాట్లాడ వలసిందేదో మాట్లాడితే ఆయన వెళ్ళిపోతారు. ప్రొద్దు పోతున్నది కదా. అప్పుడే ఎనిమిది గంటలైంది తెలుసా?" అన్నది గోడ గడి యారంమీద దృష్టినిల్పి.

"అవునవును, పాపం మాష్టారీ చీకట్లో ఎలా వెడ తారు? కారిచ్చి పంపుదాం. అన్నట్లు మాష్టారూ, మీతో ఓసంగతి చెప్పాలి. అమ్మాయి స్కూలు ఫైనల్ క్లాసులో ఉంది కదా. మంచిమార్కులు వచ్చేట్లు ప్రయివేటు చెప్పిదాం అనుకుంటున్నాను. పీ యు సి చదివి మెడిసిన్

చదువుతా నంటున్నది. పిల్లవాడు ఫోర్తుఫారంలో ఉన్నాడు. వాడ్ని పైకి లాగాలి. వాడు యింగ్లీషు, మేథ మేటిక్సులో వెకీపూర్ అనుకోండి. మరి మీ చేతి చలవవల్ల వాడు మంచి మార్కులు తెచ్చుకో గల్గితే చాలా సంతోషం. ఒక్కగా నొక్క పిల్లాడు. చిన్నప్పు డెప్పుడూ జబ్బులే. అందువల్ల వాళ్ళమ్మ గారాబం చేసి వాడ్ని పాడుచేసింది. చదువుమీద రవ్వంతైనా శ్రద్ధలేదు. ఎలా చదివి పెద్దవాడవుతాడో! మా ఆశలన్నీ వాడిమీదనే ఉన్నాయి. అమ్మాయి పెద్దచదువులు చదవాలని ఉబలాట పడుతున్నది. నాకూ సరదాగానే ఉంది. వాళ్ళమ్మ కివేమీ గిట్టవు. లక్షణంగా పెళ్ళిచేసి నోములూ, వ్రతాలూ చేయించి అత్తవారింటికి పంపితే అచ్చట్లూ, ముచ్చట్లూ చూడ వచ్చునని ఆవిడ సరదా. ఇలావుంది మా ఇంటి పరిస్థితి. ఆడపిల్లలు కూడా చదవాలంటాను నేను. ఏమంటారు? ఏ కాలానికి తగ్గట్లు ఆవిధంగా నడవాలి. బూజుపట్టిన అలవాట్లనే పట్టుకు ప్రాకులాడితే ఎలాగే అంటే నవ్వుతుంది" అంటూ తన సొద వెళ్ళబోసుకున్నాడు.

రామచంద్రం తటపటాయించాడు. "నాకు వీలుకా దండీ క్షమించండి" అన్నాడు నీళ్ళు నములుతూ, నేల చూపులు చూస్తూ.

నీళ ముఖంమీద మబ్బులు క్రమ్మాయి. కళ్ళు జాలిగా రామచంద్రం వంక చూస్తున్నాయి. కానీ అత డెవరి వంకా చూడటంలేదు. "మీ కా అనుమానం దేనికి

వచ్చింది? మీరెలాగయినా చెప్పాలి. మీరు బాగా చెప్తా రని మా మధూ, నీళా అంటున్నారు. వాళ్ళకి నచ్చిన మాస్టార్ని పెడితే నాకు బరువు తప్పుతుంది. లేకపోతే అస్థ మానం వేధిస్తారు! "అదేమిటి నాన్నారు, ఇదేమిటి నాన్నారూ, ఈ లెక్క చెప్పండి నాన్నారూ" అంటూ కోర్టునుంచి వచ్చాక కాసేపు కులాసాగా కాలం గడపటానికి వీలు లేకుండా వీళ్ళు తగులుకుంటూ మాస్టారూ! పేపరు కూడా ముట్టనివ్వరు" అంటూ తన బాధని వెళ్ళగ్రక్కాడు.

రామచంద్రం అనుకోకుండా నవ్వేశాడు. రామ చంద్రం నవ్వులో మధూ నీళా వంతకలిపారు.

మున్సబుగారుకూడా నవ్వేరు.

"ఊఁ, అనండి మాస్టారూ. మీరేచెప్పాలి మాకు" అన్నాడు మధు మాస్టార్ని యిరకాటంలో పెడ్తూ.

"ఊఁ" అన్నాడు రామచంద్రం.

"మాస్టారికి శిష్యుడుగా ఉండే బదులు మాస్టారికే గురు వైనాడే వీడు" అంటూ నవ్వారు మున్సబుగారు.

నీళ ముఖంమీద క్రమ్మిన మబ్బుతెరలు విచ్చుకు న్నాయి. పౌర్ణమినాటి చంద్రుడిలాగ నీళ ముఖబింబం వింత కాంతుల్ని విరజిమ్మింది. మల్లెమొగ్గలు విచ్చినట్లయింది. సన్నని దరహాస రేఖ ఒక్కక్షణం మెరిసి మాయమైంది.

"ఇంక శలవు తీసుకుంటానండీ" అంటూ రామచంద్రం లేచాడు.

"అలాగే. మా డ్రయివర్ మిమ్మల్ని యింటిదగ్గర దింపి వస్తాడు. అబ్బాయ్ మధూ, శేషుని పిలు. మాష్టార్ని దింపి వస్తాడు" అంటూ ఆయనా లేచాడు. శేషు "కారు రెడీసార్ రండి" అంటూ వెళ్ళిపోయాడు.

రామచంద్రం మరొక్కసారి నమస్కరించి "వస్తానండీ" అంటూ మెట్లు దిగబోయాడు.

"ఎప్పటినుంచీ" అన్నాడు మున్సబు.

"వచ్చే ఫస్టు తారీఖునుంచి" అన్నాడు రామచంద్రం.

"ఉహూ, రేపటినుంచి రండి. పిల్లలకి పరీక్షలు దగ్గర పడుతున్నాయి. ఇప్పటినుంచీ చదవకపోతే కష్టం" అన్నాడు మున్సబు.

"సరే" ననక తప్పలేదు. బలవంత బ్రహ్మాణార్థంగా ఫీలయ్యాడు రామచంద్రం.

మెట్లుదిగి చీకట్లో కలిసిపోయాడు. కారుహారన్ వినిపించే దాకా నీళ రామచంద్రం వెళ్ళిన వైపే తదేకంగా చూస్తూ నిల్చుంది.

"పదమ్మా. ప్రొద్దుపోయింది. భోజనంచేద్దాం" అని తండ్రి బుజంమీద తట్టేసరికి ఉలిక్కిపడింది. వెంటనే సిగ్గు ముంచుకొచ్చింది. ఎర్రబారిన ముఖంతో యింట్లోకి వెళ్ళిపోయింది.

"పిచ్చి పిల్ల" అంటూ తనలోతానే నవ్వుకున్నారు మున్సబుగారు.

---

# 10

లక్ష్మికి మొదట్లో ఉన్న సంతోషంలేదు. ఏదో తప్పు చేసిన దానిలా బాధపడుతున్నది. పైకి చెప్పుకుందామన్నా ఆత్మీయు లెవరూలేరు. అమ్మా, నాన్నా స్నేహితురాళ్ళు... అంతా ఉన్నారు. కాని అందరికీ తనమీద కోపమే. తానేదో నేరంజేసిన దానిలా చూస్తారు. మనసువిప్పి మంచీ, చెడూ మాట్లాడు కోవటాని కెవరూ కనిపించలేదు. సుధ తనతో మాట్లాడింది కానీ తప్పంతా తనదేనన్నట్లు మాట్లాడింది. స్నేహితురాలిగా జాలిజూపటంగానీ, సానుభూతి కనపర్చటం వంటి పనులేవీ చెయ్యలేదు. కేవలం తప్పంతా తన నెత్తినే రుద్ది వెళ్ళింది. ఆరోజునుంచే లక్ష్మికి మనస్సు బరువుగా ఉంది. ఉక్క పోసినప్పటిలాగా ఏమితోచక, ఏపనిమీదా శ్రద్ధలేక, ఉత్సాహం నీళ్ళు కారిపోతున్నది. ఎటువెళ్ళాలో తెలీటంలేదు. కాస్త ఊపిరి పీల్చుకుందామనుకున్నా వీలు లేదు. మనస్థిమితం లేదు. రెంటికీ చెడ్డ రేవడిలాగైంది తనపని. అటు అత్తారింటికి వెళ్ళనూలేదు... వెళ్ళకపోవటానికి కారణ మేమీలేదు కేవలం వృథాభిమానం తప్ప. అర్థరహితమైన గర్వం, అహంకారం తప్ప. కానీ... కానీ...ఎంత ఆలో చించినా వెళ్ళటానికి మనసొప్పటంలేదు. తాను అందర్నీ

ధిక్కరించి రావటం పెద్ద తప్పుగా కనిపిస్తున్నది. కానీ ఆ తప్పుని సరిదిద్దుకోవటానికి, క్షమించమని అడగటానికి, తనంతట తనే వెళ్ళటానికి సిగ్గూ, అభిమానం, లజ్జా, అవమాన భయం అడ్డుగోడలుగా నిలిచాయి. వాటిని దాటి వెళ్ళగలిగితే అంతా సుఖమయమే. తప్పునాదేనని ప్రాథేయపడితే రామచంద్రం కాదనేటంత నీచుడుకాదు. పైగా ఆదరిస్తాడు. ఆరాధిస్తాడు. ఆనందిస్తాడు. అభిమానిస్తాడు. కానీ... కానీ...తప్పు తన దగ్గరే ఉంది...తను అసమర్థురాలు..ఉత్తుత్తి భయాలతో కాలాన్ని బలవంతంగా వెనక్కు నెడుతున్నది. రోజొక యుగంగా గడుస్తున్నది. అన్నీ .... లేనిపోనివి .... ఊహించుకొని, తనుబాధపడి ... ఇతరులని బాధపెట్టింది ... ఒకవేళ ... ఆయన తనకి విడాకులిచ్చి ... మళ్ళీపెళ్ళి చేసుకుంటే ... హాయ్ ... భగవాన్ .... తన చేతుల్తో తనే తనగొంతు కత్తిరించుకుంది...నోరు నొక్కు కుంది. ఇప్పుడెలా? అయినా అది జరిగేపనేనా? తనంతట తను వస్తే మాత్రం? ఆమాట తను వప్పుకుంటేగా...అయినా విడాకులు...యివ్వటం...యివ్వకపోవటం...తనచేతిలోని మాట ... అంతా తనయిష్టం... అయినా ఎంత అప్రతిష్ట. తనవల్ల, తనని కన్నందుకు తల్లి దండ్రులకెంత భంగపాటు? నలుగుర్లో నవ్వుపాలు చేస్తుందే... ఈ రాద్ధాంతమంతా దేనికి... తను వెళ్ళిపోతే... ఎవ్వరూ ఏమీ అనరు... అత్తగారికి తనంటే ఎనలేనిమక్కువ, ఆదరాభిమానా లున్నాయి. మామగారు సరే సరి. తనని పల్లెత్తి ఒక్కమాట అనరు. ఇక తోడు

కోడలో... ఆవిడకి పాపం తనంటే స్వంత చెల్లిలిమీద కంటె ఎక్కువ ఆప్యాయత. వీటన్నిటినీ కాలదన్ని తనే వచ్చేసింది. సీతమ్మ వారిలాంటి తోడికోడలు-నిజంగా తన అదృష్టంకాక పోతే అంత అందగత్తె, అంత సహనశీలురాలు తన తోడి కోడలుగా ఎలా వస్తుంది? కానీ...ఏమిటో ..మళ్ళీ ఆవాతా వరణంలోకి వెళ్ళేసరికి అన్నీ అనుమానాలే! నిజంగా భర్తా, తోడికోడలూ నిరపరాధులా? నిష్కల్మషులా? నిష్క ళంకులా? ఇది రుజువయ్యేదెలా? తనమనస్సు స్థిమితంగా ఉండదు. ఒకసారి నిష్కళంకులుగా కనుపించినవారే మరో సారి అపరాధులుగా అగుపిస్తారు...

"పోష్టు సార్" అంటూ ఉత్తరం గిరవాటేసి పోష్టు మాన్ వెళ్ళిపోయాడు. లక్ష్మి తన ఆలోచనల్లోనుంచి తేరు కొని చూసింది. కవరు ... ఎక్కడినుంచోమరి? తన భర్త దగ్గరనుంచేమో ... కొంపదీసి .... ఏమని వ్రాశారో .... తనకి వ్రాయలేదుచూడు, నాన్నారి పేర వ్రాసేరెందుచేత చెప్మా .... తన మీద కోపంవచ్చింది. నిస్సందేహంగా అంతే అయి ఉంటుంది. అందువల్లే రాయలేదు. తీసి చూస్తే ... ఊఁ .. నాన్న ఏమనుకుంటారో ... ఏమను కుంటారు ... ఇది ... ఆయన పర్సనల్ లెటరు కాదే...చూస్తే ఏమీ అనుకోరు. తన భర్త వ్రాసిన ఉత్తరం చదివేపాటి అధికారం తనకులేదా?

లక్ష్మి కవరుచింపింది. ఎంతో పెద్ద ఉత్తరం ఉంటుం దని ఆశించింది. కానీ అదేమీలేదు. బహుక్లుప్తంగా రెండు

ముక్కల్లో సారాంశమంతా యిమిడ్చిరాశాడు. "శ్రీయుత... మామగార్కి ... తమ అల్లుడు ... నమస్కరించి వ్రాయు విన్నపములు ... నాకు ... ఉద్యోగం ... వదలి రావటానికి వీలుపడదు. తల్లి దండ్రుల పోషణా, సేవా, శుశ్రూషల భాధ్యతలనుంచి వైదొలగడం గర్హనీయం. దయచేసి క్షమించగలరని తలుస్తూ ... మీ అల్లుడు" లక్ష్మికి ఉక్రోషం వచ్చింది. ఏం? తనకోసం అణాకానీ ఉద్యోగం వదల లేడేం? హాయిగా మహారాజులా తిని తిరగటానికి యిష్టం లేదేం? అంటే తన మీద ... అతనికిగల అనురాగానికి తార్కాణ మీ తిరస్కారం. ఆయనకి తనమీద ఎంత యిష్టత ఉందో తెల్పుతుందీ ఉద్దేశ్యం. నిజంగా యిందులో ఏమీ రహస్యంలేదా? ఆయన కక్కడి నుంచీ కదలటానికి వీలులేని సంకెళ్ళు ఎవరు వేశారు? నిజంగా తల్లి దండ్రుల పోషణ బాధ్యతేనా కారణం? లేక ... తెరమరుగున వారో కారణం, యితరులకి తెలియకూడనిది ... ఉండి ఉండవచ్చా? అందుకు సందియపడనేల? ఏమీ కారణంలేంది సిరిరా మోకాలొడ్డే మూర్ఖుడు కాదే తన భర్త! నిష్కారణంగా ఎవరూ యింతటి ఆస్తినీ, ఐశ్వర్యాన్నీ భోగ, విలాసాలనూ కాలదన్నరే! ఎంతటి మహత్తర కారణం, బలీయమైన హేతువులేందే రామచంద్రం యిలా తిరస్కరించాడు? మామగార్ని అవమానించాడు. ఇటువంటివాడి దగ్గిరికా తానింతవరకూ వెళ్ళాలని ఉబలాటపడుతున్నది, వెళ్ళలేక పోతినేఅని ఆరాటపడుతున్నది! కనీసం సభ్యతకొరకైనా,

మర్యాదకోరకైనా రావచ్చునే! వచ్చి నాలుగురోజులుండి, తనని తీసుకు వెళ్ళవచ్చునే! తను కాదంటేగా, రానంటేగా!

ఇటువంటి స్వార్థపరుడ్ని, నీచుడ్ని తనింతవరకూ ఆరాధించి, అభిమానిస్తున్నది! ఛీ... ఛీ... ఎంత నికృష్ట బ్రతుకు తనది? ఇంకా నయం... వెళ్ళలేదు... వెడితే హేళనగా పకపక నవ్వుడుండేవాడు. తనని ఎత్తి పొడిచేవాడు. చులకనచేసి చూచేవాడు. ఇంకా భగవంతుడు తనయం దున్నాడు. తను సిగ్గుతో చచ్చిపోకుండా, అవమానంతో భూమిలోకి క్రుంగిపోకుండా కాపాడాడు. ఏమైనా సరే, లోకులెలా భావించినాసరే, తల్లి దండ్రులెంత అనాదరణ చూపినాసరే, తానక్కడి కిక జన్మలో వెళ్ళకూడదు. మళ్ళీ చదువూ, సంగీతం నేర్చుకుంటేసరి. తనకి డబ్బుకి లోటేమిటి? ట్యూషన్ చెప్పించుకోవాలంటే పదిమంది టీచర్లని ట్యూటర్లుగా నియమించుకో గలదు.

"అమ్మాయి...ఏమిటమ్మా ఉత్తరం? ఎక్కడినుంచీ" అన్నదానికి సమాధానంలేదు. లక్ష్మి దృష్టి అక్కడలేదు. మనస్సు అక్కడలేదు. లక్ష్మి తండ్రిమాటల్ని వినలేదు.

తన ప్రశ్నకు సమాధానం రాకపొయ్యేసరికి శేషాచారి కూతురి దగ్గరికివచ్చి చేతిలోని ఉత్తరం తీసుకున్నాడు. ఆసాంతం చదివేడు. నిరుత్సాహ పడ్డాడు.

"ఏమేవ్ పూర్ణం, ఓ మాటిలా రా" అంటూ కేకేశాడు.

"దేనికండీ" అంటూ వచ్చింది అన్నపూర్ణమ్మ

"దేనికేమిటే, అల్లుడి దగ్గర్నుంచి ఉత్తరంవచ్చింది" అన్నాడు.

"అలాగా, ఏమని రాశాడేమిటి? ఎప్పుడు వస్తున్నాడట? మిమ్మల్ని స్టేషనుకు రమ్మన్నాడా?" అంటూ ప్రశ్న పరంపరని శేషాచారి మీద గుప్పింది.

"బాగుందిలే నీ వరస, అసలు అతగాడు రానని తేల్చాడు. అంతేకాదు. అమ్మాయిని పంపమని మాట మాత్రమైనా వ్రాయలేదు!" అన్నాడు శేషాచారి.

"అవునండీ. నేను చెప్పటంలేదూ. ఇన్నాళ్ళనుంచీ మొత్తుకుంటూంటే నా మాట చెవిని వేసుకున్నారా? అమ్మాయిని దింపి రమ్మని చెప్పాను. మీరిద్దరూ నామోషిగా అనుకుంటుంటే నేనేం చెయ్యను? చిన్నపిల్లా, చితకపిల్లా! రెండు దెబ్బలు వేసి పంపడానికి చదువుకున్న వారాయె" అన్నది నిష్ఠూరంగా.

"అదిగో. మీ ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే అది. సందు దొరికితే చాలు. సాధింపు మొదలెడతారు. ముందూ వెనకా ఆలోచించరు. సమయా సమయాలు గుర్తించరు. అనరానిమాటా, అనవచ్చేమాటా తెలుసుకోకుండా వాగిస్తారు. అమ్మాయి కాపరం ఎలా చక్కదిద్దాలా అని ఆలోచిస్తుంటే దానికి తగిన ఉపాయం చెప్పడానికి బదులు సాధిస్తావు" అన్నాడు శేషాచారి.

"దీనికి పెద్ద ఆలోచనలు దేనికండీ, మంచి రోజు చూచి దింపిరావటానికి! ఆడపిల్ల అక్కడి పిల్లే కాని మనపిల్ల అవుతుందా! వాళ్ళు దింపమంటే దింపిరావాలి, తీసికెళ్ళ మంటే తీసుకురావాలి. వాళ్ళలాగ మనమూ పంతాలకిపోతే పాడయ్యేది మనమ్మాయి కాపరమే" అన్నది అన్నపూర్ణమ్మ.

"అవునే, అమ్మాయి అభిప్రాయమెలా ఉందో కనుక్కో" అన్నాడు శేషాచారి.

"నేను కనుక్కోవడమేమిటి? ముంజేతి కంకణానికి అద్దం దేనికి? మీరే కనుక్కోండి" అన్నది అన్నపూర్ణమ్మ.

"అమ్మాయ్." అంటూ పిలిచాడు శేషాచారి.

ఎక్కడో ఆలోచిస్తున్న లక్ష్మి ఉలిక్కిపడి వెనుతిరిగి చూచింది.

"ఏమిటి నాన్నా" అన్నది.

"మీ ఆయన వ్రాసిన జాబు చదివేవుగా. పోనీ నీవే వెడితే ఎలాగుంటుంది?" అన్నాడు శేషాచారి అంతకంటె ఖచ్చితంగా వెళ్ళమని చెప్పటం బాగుండదనీ, కూతురు నొచ్చుకుంటుందనీ.

"ఏమో నాన్నా! ఆయన కిక్కడికి రావటానికి అంత యిష్టంలేనప్పుడు నేను మాత్రం ఎందుకెళ్ళాలి" అన్నది లక్ష్మి.

"అదేంమాటే. ఆడపిల్ల అత్తవారింటి కెళ్ళటం మన ఆచారం. మొగపిల్లవాడు అత్తారింటికిరావటం చాలా అరుదు" అన్నది అన్నపూర్ణమ్మ.

"మొగవాళ్ళ కో పద్ధతీ, ఆడవాళ్ళ కో పద్ధతీ ఎకమ్మా" అన్నది లక్ష్మి.

"బాగుందేయ్ నీ వాదన! చదవవేస్తే ఉన్న మతి యిందని, మరీ యిలా తయారవుతున్నావేం రణపెంకె గ! అసలు ఆడా, మగా అన్న తేడా ఎప్పుడైతే వచ్చిందో గతా తేడాలన్నీ అప్పుడే వచ్చాయనుకో. ఎన్ని చదువులు దివినా, ఎంత పెద్ద ఉద్యోగాలు చేసినా ఆడదాన్ని ఒంట గా ఒక్కరోజు ఉండమను తెలుస్తుంది. అర్ధరాత్రివేళ క్కత్తెనూ రమ్మను, చూద్దాం, ఏదైనా ఊరు ళ్ళి రమ్మను" అన్నది అన్నపూర్ణమ్మ చదువుకున్న గారి లోటుపాట్లు వివరిస్తూ.

"అదేమిటమ్మా. ఈ రోజుల్లో ఆడవాళ్లు ఒంటరిగా వెళ్ళలేక పోవటమేమిటి? విదేశాలకి కూడా వెడుతుంటే" అన్నది లక్ష్మి నవ్వుతూ.

"ఆ వెళ్ళార్లే. ఎంత గొప్పవారైనా, హోదా కల వారైనా వాళ్ళ వాళ్ళ హద్దుల్లో ఉండాలి తల్లీ! అప్పుడే లోకం చేత మెప్పు పొందుతారు. ఇంట్లోనూ పూజింప బడుతారు" అన్నాడు శేషాచారి.

"హద్దుల్లో ఉండక నేనిప్పుడేం తప్పుపని చేశాను నాన్నా" అన్నది లక్ష్మి కోపంతో ఉడికిపోతూ.

"నీవు యిప్పుడు తప్పుపని చేస్తున్నావని కాదమ్మా! కానీ లోకం ఏమనుకుంటుంది? మొగుడ్ని వదలి వచ్చేశా నంటుంది. నీతీ జాతీ లేదంటుంది. అహంకారి అంటుంది.

ఇవన్నీ నీకు అనుభవం మీదగానీ తెలియదు లేమ్మా
అన్నాడు శేషాచారి

"మీరెన్నైనా చెప్పండి నాన్నారూ. నేనుమాత్ర
వాళ్ళ గడప త్రొక్కను." అన్నది లక్ష్మి తన దృఢ సంకల్ప
వ్యక్తపరుస్తూ.

"అయితే యిక్కడుండి ఏమిటి చేస్తావు?" అన్నా
శేషాచారి తెల్లబోతూ.

"చదువుకుంటాను, సంగీతం నేర్చుకుంటాను, ఏదైన
చేస్తాను నా కిష్టమైనట్లు" అన్నది లక్ష్మి

"ఆ! అంతదాకా వచ్చావుపా!" అన్నది అన్న
పూర్ణమ్మ ఆశ్చర్యముతో బుగ్గన వేలుంచుకొని.

"చూశారా! మీ కూతుర్ని గారాబంచేసి ఎలా పాడు
చేశారో" అన్నది అన్నపూర్ణమ్మ తనేమీ బాధ్యురాల
కానట్లు.

"తప్పమ్మా, అలా అనకూడదు. ఎన్ని చదివినా,
ఎంతగొప్ప హోదా సంపాదించినా, ఎటువంటి పదవులు
అలంకరించినా వెనక ఆ మచ్చ వస్తూనే ఉంటుంది. పైగా
భర్తా, పిల్లలూ, సంసారం అనేవి లేకుండా జీవితం పరిపూర్తి
కాదు తల్లీ! మన హైందవ స్త్రీలకి అది ఎంతో ముఖ్యం.
అంతేకాదు; ఆడది, అందులో భర్తను విడిచిన స్త్రీని ఎవరూ
గౌరవించరు. వాళ్ళనుచూస్తే లోకులకు తేలిక భావం
ఏర్పడుతుంది. నీ జీవితం ఎంత స్వచ్ఛంగా గడిపినా, నీ
వెలాంటి పొరపాట్లు చేయకున్నా, లోకులు నీ శీలాన్ని

స్తారు. నిన్ను అవమానించటానికి, అవహేళన చెయ్యా
నికి సందేహించరు. యోచించమ్మా. తొందరలేదు. ఏదో
ంగా నీ భర్తకు సర్దిచెప్పే బాధ్యత మాది.” అన్నాడు
షాచారి.

“నాన్నా, నేనోమాట చెప్తాను వింటారా? నేనే
న్చేశాను కాబట్టి మీరిలా అంటున్నారు. ఒకవేళ ఆయనే
ళ్ళగొడితే అప్పుడేం చేసేవారు? ఎలా భావించేవారు?
లా సర్దగలరు? అన్నది లక్ష్మి.

“పిచ్చి తల్లీ. ఊహాలు దేనికమ్మా. జరిగిన దానికి
లా సరిదిద్దాలో ఆలోచించాలిగానీ జరగనిదాన్ని ఊహించు
ని పరిష్కార మార్గాలు వెతకటం దేనికి? రోగాన్నిబట్టి
కిత్సా మార్గం ఉంటుంది తల్లీ. అన్ని రోగాలికీ ఒకేమందు
ాడితే రోగి మరణిస్తాడు. అతడు వదిలి పెట్టినా, నీవు వదిలి
ెట్టినా తప్పెవరిదో ఆలోచించి నింద మోపేటంత ఓర్పూ,
హనం లోకానికి లేవు తల్లీ. అరిటాకుమీద ముల్లు పడ్డా,
అరిటాకుకే మోసం, ముల్లువెళ్ళి అరిటాకుమీద పడ్డా అరి
ాకుకే మోసం. ఈ మాత్రం గ్రహించనిదానివి లోకంలో
ంటరిగా ఎలా సంచరిస్తావు తల్లీ. మేము శాశ్వతం కాదు.
మా అనంతరం నీ మంచిచెడ్డలు చూచేవారెవరున్నారమ్మా.
ఆలోచించు బాగా” అన్నాడు శేషాచారి.

“ఏమోనాన్నా, మీరెన్ని చెప్పినా నా మనస్సు ఒప్పు
కోవటంలేదు. ప్రస్తుతం చదువుమీద నా మనస్సుని లగ్నం
చేద్దా మనుకుంటున్నాను. ఆ పైన చూద్దాం” అన్నది లక్ష్మి.

"బాగుందేవ్ తల్లీ! మీనమేషాలు లెక్క పెట్టుకుంటూ కూర్చుంటే రైలు పోయిందట. నీయిష్టం వచ్చినప్పుడు వెళ్ళేదాకా అతగాడు నీకోరకు కాచుకు కూర్చుంటాడేం. అతనికేం మగవాడు. మరోపెళ్ళి చేసుకున్నా చేసుకోవచ్చు" అన్నది అన్నపూర్ణమ్మ.

"నీ వన్నంత తేలిక కాదమ్మా. చట్టం ఒప్పుకోదు. రెండోపెళ్ళి చట్టరీత్యా నేరం" అన్నది లక్ష్మి.

"చట్టం దృష్టిలో పెట్టుకొనే అంతా సంచరిస్తున్నారా? అయితే యిన్ని అన్యాయాలూ, అక్రమాలు లోకంలో ఎలా జరుగుతున్నాయీ? అంత చట్టబద్ధంగా యితరులు నడవాలని కోరేదానివి నీవు మాత్రం ఎందుకు నడవకూడదే" అన్నది అన్నపూర్ణమ్మ.

"అమ్మా, నేనిప్పుడు చట్టవిరుద్ధంగా చేసిన పనేమిటో చెప్పరాదూ" అన్నది లక్ష్మి.

"ఏం? అంత నంగనాచివా, తెలియ జెప్పేటందుకు? భర్తతో కాపురం చెయ్యకపోవటం నేరంకాదా? తల్లి దండ్రుల్ని అల్లరిపాలు చెయ్యటం నేరం కాదా! అన్నీ మనం అనుకోవటంలో ఉంది. తప్పనుకుంటే తప్పు, కాదనుకుంటే కాదు. ముఖ్యమైంది, మన మనస్సూ, అంతరాత్మను. అంతరాత్మ ఆజ్ఞానుసారం ప్రవర్తిస్తే మన శ్శాంతి లభిస్తుంది" అన్నది అన్నపూర్ణమ్మ.

"అవునమ్మా, ఇప్పుడొచ్చిన చిక్కు అదే. నా అంతరాత్మ అక్కడికి వెళ్ళటానికి యిష్టపడటంలేదు. మీరంతా

మరి వెళ్ళిపొమ్మని పోరాడుతున్నారుగా" అన్నది లక్ష్మి తల్లిమాట తల్లికే ఒప్పగిస్తూ.

"సరేనే తల్లీ! నీతో వాదించి ఎవరూ నెగ్గలేరు. నీ యిష్టం. మీ నాన్నగారి యిష్టం" అంటూ లేచి వెళ్ళిపోయింది.

శేషాచారి "ఏమమ్మా" అన్నాడు సాలోచనగా చూస్తూ.

"అంతేనాన్నా. నా సంకల్పానికి తిరుగులేదు" అన్నది లక్ష్మి.



132

## 11

అలివేలు పెరట్లోని గోంగూర కోసుకొచ్చి వరం డాలో కూర్చుంది చాటముందు వేసుకొని. కాడలుతుంచి అవతలపారేస్తూ, చీమల్ని దులుపుతున్నది.

చంద్ర చిక్కుడుపాదు దులిపి వచ్చింది. చిక్కుడు కాయలన్నీ రాసిగా ముందుపోసుకొని ఒక్కొక్కటే తుంచి ఈనెలు అవతల పారేస్తూ తుంచినముక్కలు ఓ గిన్నెలో వడేస్తున్నది.

ప్రక్కింటి శాంతమ్మ పెత్తనాలకి వచ్చింది. "ఏమే అలివేలక్కా, ఏం చేస్తున్నా" వంటూ

"రావే. రా. కూర్చో. ఆ! ఏముందీ. ఈపూట పచ్చడి చేద్దాం అంటే ఏమీ కనుపించలేదు. పెరట్లో నాలుగు గోగుకాడలుంటే ఆకులు తెంపుకొచ్చాను. కాడలు ఏరుతున్నాను" అన్నది అలివేలు.

చంద్రం లోపలికి వెళ్ళి చాపతెచ్చి వేసింది "కూర్చోండత్తయ్యా" అన్నది.

శాంతమ్మ కూర్చుంటే "ఒసే అలివేలూ, నీరెండో కోడలేదీ? పుట్టింటికిగాని వెళ్ళిందా ఏం? నేను భద్రాద్రి

పోకముందు యిక్కడే ఉందిగా. ఎన్నో నెలేమిటీ" అన్నది అలివేలుతో.

అలివేలుకు చచ్చేసిగ్గువేసింది. ఏమని సమాధానం చెప్పుతుంది?

"ఆ! ఇంకా యింతవరకు అటువంటిదేమీ లేదే శాంతా. ఆభగవంతుడి దయవల్ల వాళ్ళిద్దరి కడుపునా రెండు కాయలు కాస్తే చూద్దామని ఉంది. మరి ఆ పమేశ్వరుడి దయ యిల్లా ఉంది. ఊరికేనే వెళ్ళింది. వాళ్ళ అమ్మా, నాన్ననీ చూచి చాలారోజులైందిగా" అన్నది అలివేలు.

"అదిగాదుగానీ అలివేలూ. నేనోవిషయం అడుగుతాను. కోపగించుకోకే. ఆరుక్మిణమ్మా, విశాలక్ష్మి అనుకుంటుంటే విన్నా. అబ్బాయీ, అమ్మాయీ దెబ్బలాడుకున్నారనీ, అమ్మాయి అలిగి పుట్టింటి కెళ్ళిందనీను. అంతే కాదే, నీవు ఒట్టిభోళామనిషివి. ఈమధ్య చంద్రం ఆ మున్సబుగారి ఆమ్మాయి వలలో పడ్డాడని అనుకుంటున్నారు సుమా. ముందే మేలుకుంటే మంచిది. మళ్ళీ ఏదన్నా జరిగాక చేసే దేముంది? కోడల్ని త్వరగా పిలిపించు. కోడలుపిల్ల యింట్లో లేకపోవటాన పిల్లాడు చెడిపోవచ్చు. ఏదో నీవు తల్లీతోడు వంటి దానివని చెప్తున్నాను సుమా. లేకపోతే నాదేం పోయింది, మీ ఆయన్ని ఓ మారెళ్ళి కోడల్ని తీసుకు రమ్మను! అన్నది శాంతమ్మ.

"అదికాదే తల్లీ. వాళ్ళేపిడ్డి రమ్మని రాశారు. ఆపిల్ల వీళ్ళకి ఒక్కర్తేగా. అందుకని కూతుర్ని అల్లుడ్ని

దగ్గరుంచుకోవాలని ఉందని చంద్రం మామగారు వ్రాశారు-కాని వీడు వెళ్ళ నంటున్నాడు. ఆపిల్లేమో యిక్కడికి రానని పట్టు పట్టిందట. ఆవూరి వాళ్ళు చెప్పారులే" అన్నది అలివేలు నిట్టూరుస్తూ.

"ఆ! అంతవరకూ వచ్చిందీ. పిచ్చి చచ్చింది, ఆపిల్ల కేం తెలుసు? రేపు మొగుడు మరోదాని వల్లో చిక్కుకున్న తర్వాత దక్కుతాడా? అప్పుడేం అనుకుంటే ఏంలాభం?" అన్నది శాంతమ్మ.

"ఏం చేయమంటా శాంతమ్మ తల్లీ. అంతా నాఖర్మ. వీడా నామాట వినటంలేదు. అదీ రానని భీష్మించుకుంది. మధ్య లోకులచేత మాటలువడవేక నేను చస్తున్నాను. ఏం చెప్పనే తల్లీ. కడుపుచించుకుంటే కాళ్ళమీద పడ్డట్లుంది. ఎంచుకుంటే మంచ మంతా కంతలేనే అమ్మా. ఇవన్నీ చూడమని నాముఖాన దేవుడు యిట్లా రాశాడు. తీసుకు పోనన్నా తీసుకు పోయాడు కాదు" అంటూ కళ్ళు తుడుచు కొని ముక్కు చీదింది.

"ఆ! ఆ! ఆరోజు వచ్చేదాకా ఉండాల్సిందే. అంతా ఆ పరమాత్ముడి కెరుక. అంతవరకూ తప్పుతుందా. కష్టమో, సుఖమో, భరించాల్సిందే" అన్నది శాంతమ్మ ఓదారుస్తూ.

"మరే. చేసేదేముంది? ఎవరూ వినక వచ్చారు. ముందుకు పోతే నుయ్యి, వెనక్కిపోతే గొయ్యి లాగా ఉంది నాపని. ఆ పెద్దాడు చూద్దామా మూగవాడు. ఇంత వరకైతే వాళ్ళనాన్నతో పోతున్నాడు. వాళ్ళనాన్నే సర్దు

కొస్తున్నారు. రేపు ఒంటరిగా వాడెలా బ్రతుకుతాడో నని బాధపడుతుంటే యిది రెండోది. నావని మద్దెల సామెతగా ఉంది. ఏం చెయ్యనూ" అంది అలివేలు ఏ౦న ఆకు ఒక ప్రక్కన పెడుతూ.

"ఊ. అంతేమరి. నయానో, భయానో నచ్చ చెప్పి కోడల్ని పిలిపించు" అన్నది శాంతమ్మ.

"అంత అదృష్టం ఉంటే ఈ రాతెందుకూ?" అన్నది అలివేలు.

"చంద్ర యింకా పిల్లాడ్ని ఎత్తలేదే. ఏమే కోడలా? మనవడ్ని ఎప్పుడందిస్తావు?" అన్నది శాంతమ్మ.

చంద్ర సిగ్గుతో తల వాల్చేసింది.

"ఆ! దాని కడుపునన్నా నాలుగు కాయలు కాస్తా యేమో అంటే యింతవరకూ అలాంటి దేమీ లేదు" అన్నది అలివేలు నిరాశగా.

చంద్ర మనసు చివుక్కు మంది. తను నిస్సంతాన వతి కావడానికి తను కారకురాలా? భగవంతు డివ్వందే తనేం చేస్తుంది?

"సరేలేవే అలివే లక్కయ్యా, నేను వెళ్ళాలి. సాయంత్రం వంట ఎదురు చూస్తుంటుంది. కోడలుపిల్ల అటు పుల్ల యిటు పెట్టదమ్మా. ఎవరితో చెప్పుకొని ఏమిటి లాభం? రత్నం వంటి కోడల్ని సంపాయించావు. కూర్చొ బెట్టి చేస్తుంది" అన్నది శాంతమ్మ.

"ఆ! అందరూ అలాగే అనుకొంటారు. దాని ముఖం. ఒక్క స్త్రీ ఏం చేస్తుంది. ఏదో నేనూ చేస్తుంటే నాకూడా ఉంటుంది. అంతే" అన్నది అలివేలు.

"ఓ అడ్డెడు బియ్యం యివ్వకా. రేపు మరబట్టించి యిస్తాను" అన్నది శాంతమ్మ.

"అంత కంటేనా? పట్టుకుపో" అన్నది అలివేలు.

"ఒసే చంద్రా. ఓ రెండుమానికలు బియ్యం చేటలో పోసివ్వు అత్తయ్యగారికి" అంటూ పురమాయించింది.

చంద్ర లోపలి కెళ్ళింది.

"ఒసే అలివేలూ. నీతో అనకూడదుకానీ, పాపం, పుణ్యం భగవంతుడి కెరుక. పెద్దకోడలికీ, మీ చిన్నాడికీ - సంబంధం ఉందని ఆ విశాలక్ష్మి వాళ్ళూ అనుకుంటే విన్నా. ఎందుకైనా మంచిది. ఓ కంట కనిపెట్టి ఉండు. బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులని, మీ చిన్నాడు భార్యని అందుకే తెచ్చుకోవటం లేదని అంతా అనుకుంటున్నారు సుమా. ఏదో తల్లీ, తోడులాంటి దానవని ముందుగా జాగ్రత్త పడతావనీ చెప్తున్నానే. అంతే కానీ నాకెలాంటి ఉద్దేశ్యం లేదు. సెగలేందే పొగ రాజదంటారు" అన్నది మెల్లిగా.

కొలత పాత్రకోసం లోపల వెతుకుతున్న చంద్రిక హఠాత్తుగా వరండాలోకి రావడంతో వీరిద్దరి సంభాషణా ఆగిపోయింది.

ఒక చాటలో బియ్యంపోసి తెచ్చింది చంద్రిక.

చాట చేత పుచ్చుకొని "ఏమే అక్కాయ్. దొడ్లో చిక్కుడు పాదు బాగా కాసినట్లుంది. కాసిన్ని కాయలివ్వు. ఈ పూటకి బొత్తిగా కూరకి ఏమీలేదు" అన్నది శాంతమ్మ చిక్కుడుకాయల రాసివంక ఆశగా చూస్తూ.

"చంద్రా! కాసిని చిక్కుడు కాయలు చిన్న బుట్టలో పోసి యివ్వు అత్తయ్య గారికి" అన్నది అలివేలు ముఖం చిట్లించి.

చంద్రిక చిన్న బుట్టతెచ్చి దాని నిండుకు చిక్కుడు కాయలు పోసి చేతికిచ్చింది.

శాంతమ్మ చేటా, బుట్టా చేతబట్టి "వస్తానే అలివేలక్కా, వస్తానే అమ్మడూ" అంటూ పరమానందంతో వెళ్ళిపోయింది.

శాంతమ్మ రాకతో అలివేలు మనశ్శాంతికి భంగం కలిగింది. మనస్సంతా అల్లకల్లోలమైంది. చిరాకు కల్గింది. చంద్రిక మీద, రామచంద్రం మీద, లక్ష్మి మీద, చివరికి తన మీద తనకే విసుగూ, కోపం కలిగాయి. గుట్టుగా వెళ్ళిపోతున్న సంసారం బట్ట బయలైంది. లోకులు కాకులు. వున్నవీ, లేనివీ కల్పించి ఊసుపోకకు చెప్పుకుంటారు. అదుగో పులీ అంటే యిదుగో తోక అనే మనస్తత్వం వారిది.

శాంతమ్మ మాత్రం తక్కువదా. ఆ మాటా ఈ మాటా చెప్పి బియ్యం, కూరకి చిక్కుడుకాయలు పట్టుకు

పోయింది. అవి తీర్చేదీలేదు. పైగా వెళ్ళేది వెళ్ళక అలివేలు మనస్థిమితాన్ని పాడుచేసి వెళ్ళింది.

చంద్రిక యథాప్రకారం చిక్కుడుకాయల్ని ఒలుస్తున్నది తలవంచుకొని.

"ఈ పూట ఏమిటి చెయ్యమంటావత్తయ్యా? ఫలహారం ఏం చేయాలీ" అన్నది చంద్రిక.

"ఉల్లిపాయ వేసి పకోడీలు వండు" అన్నది అలివేలు గోంగూర కాడలు ఏరినవన్నీ ఒకచోట చేరుస్తూ.

"మరిది తినడుకదా ఉల్లిపాయలు..." అన్నది చంద్రిక ఒకసారి తలెత్తి అత్తగారి వంక చూచి.

"తినకపోతే ఏడవనీ. మనిషి మనిషికీ ప్రత్యేకపు వంట ఎక్కడ చేస్తావు? అయినా వాడి సంగతి నీకెందుకు? చెప్పింది చెయ్యక! పెద్దవాడు తింటాడుగా" అంటూ విసుక్కుంది అలివేలు.

అలివేలు మనస్సులో అనుమాన మేఘాలు క్రమ్ముకున్నాయి. ముఖం చిట్లించింది. నిజంగా చంద్రిక నిర్దోషి అయితే శాంతమ్మ అలా ఎందుకు చెప్తుందీ? పైగా ఆవిశా లక్ష్మి వాళ్ళకేం అవుసరం? ఇందులో నిజం ఉండి తీరుతుంది. లేకపోతే చంద్రిక తను చెప్పినట్లు చెయ్యక మరది తినడుగా అంటూ ఎందుకు చెపుతుంది? మరిది తినటం ముఖ్యమా, తన భర్త తినటం ముఖ్యమా? ఇందులో ఏదో ఉంది. లేకపోతే ఎప్పుడూ ఎదురు చెప్పని రామచంద్ర ఎందుకు

తనమాట వినటంలేదు. గోడల్ని తీసుకురమ్మంటే అలా నిమ్మకి నీ రెత్తినట్లూరు కుంటున్నాడేం ?

అలివేలు మనస్సులో అనంత కోటి అనుమానాలు సందేహాలు. వాటికి సమాధానా లెవరివ్వగలరు? లోకుల నోట్లో పడిన ఈ సంసారాన్ని మళ్ళీ యథాస్థితికి తీసుకు వచ్చేదెలా ? అలివేలు అలాగే గోడకి చేరగిలబడింది. చంద్రిక చిక్కుడుకాయల ముక్కలు చెయ్యటం పూర్తిచేసి గోంగూర ఓ గిన్నెలో వేసి వంటింట్లోకి తీసుకు పోయింది.

అత్త అలా విసుక్కున్నదెందుకు ? తను చేసిన నేరం ఏమిటీ? మరిది తిననిమాట నిజమే. ఆమాటే తనన్నది ఇంట్లో నలుగురూ తినే పదార్థం చేస్తే బాగుంటుంది కానీ కొందరు తినేవస్తువు మాత్రమేచేస్తే ఏమనుకుంటూరు? వాళ్ళు ఎప్పుడైనా పొరపాటున చెయ్యబోతే అత్తగారు వారించేది. 'చినబ్బాయి తినడమ్మాయీ. విసిరేస్తాడు. ఆ మాత్రం జ్ఞాపకం ఉంచుకోనక్కర్లేదా' అంటూ చివాట్లు వేసేది. అలాంటిది తెలిసి, తెలిసి ఎందుకు చెయ్యమన్నదీ? ఏమో! ఎవరికెరుక ? తన మనస్సు కనుక్కుందా మనేమో. అయినా తనెందుకలా తొందరపడింది. మరిది తింటేనేం, తినకుంటే మాత్రం తనకి పోయిందేమిటి? చంద్రిక మనస్సు బాధతో మూల్గింది. ఏ పనీ చెయ్యబుద్ధికా లేదు. పైగా శాంతమ్మ తన అత్తగారితో ఏవో గుసగుసలు మాట్లాడింది. తనని గురించే నేమో. ఛీ, ఏమి టీ ఆలోచనలు ? తనని గురించి మాట్లా డేందుకు ఏముంది ? బహాశా లక్ష్మిని గురించేమో ? అను

కుంటూ చంద్రిక వంట పూర్తిచేసింది. టిఫిన్ తయారుచేసి ఉంచింది.

ఇంతలో సాయంత్రం ఆరుగంటలు కావస్తున్నది. రామచంద్రం స్కూలునుంచి వచ్చాడు.

"అబ్బాయ్ ..." అన్నది అలివేలు కొడుకు వెనకనే వెళ్ళి.

"దేనికమ్మా." అన్నాడు తల్లి కళ్ళల్లోకి చూస్తూ.

"కోడలు పంతోటం చేశావురా. ఇరుగుపొరుగు వాళ్ళంతా నన్ను ఆడిపోసు కుంటున్నారు ..." అన్నది అలివేలు చేతిలోని ప్లేటు బల్లమీద పెడుతూ.

"దానికి అనుకునే దేముందమ్మా. ఆవిడ రాకపోతే అది నా తప్పా ?" అన్నాడు రామచంద్రం ప్లేటులో పకోడీ నోట్లో వేసుకొంటూ.

"ఛీ ... ఉల్లిపాయల పకోడీలు నాకెందుకు పెట్టావమ్మా. నీకు తెలియకపోయినా వదినకెట్లా తెలీదు ? నేను తిననని ఆవిడకు తెలుసుగా" అన్నాడు నోట్లోని పకోడీ నేల మీద ఉమ్మేస్తూ. ప్లేటు అవతలికి తోసేశాడు.

అప్పటికి కాని అలివేలు తనతప్పు గ్రహించలేదు. తను కోపంకొద్దీ 'ఏదో ఒకటి అన్నట్లు పకోడీలు చెయ్యమంది. కోడలు గుర్తుచేసినాకూడా లెక్కచెయ్యలేదు. కోడలిమీది అనుమానంకొద్దీ ఆవే చెయ్యమని పంతం పట్టింది. కానీ కొడుకు తోసేశాడు. అయితే 'వదినకైనా తెలీదా' అన్న

మాట ములుకులాగా అలివేలు గుండెల్లో గుచ్చుకుంది. కొడుకు తిండి విషయం తనకంటే నిన్నగాక మొన్నవచ్చిన కోడలికి తెలుసునని కొడుకు దెప్పిపొడిచేసరికి ఆవిడ మాతృ హృదయం గాయపడింది. అంతేకాదు. ఆవిడ అనుమానం దృఢపడ సాగింది.

"అయితే యిలాగే గడుపుతావా. లోకులుకూసే కారుకూతలు వినలేక చచ్చిపోతున్నాను. మీకు సిగ్గులేకపోతే నాకైనా ఉండద్దా? లోకుల మాటలు మీకెలా వినిపించటం లేదో మరి ..." అన్నది ఆవేశం పట్టలేక.

"ఏమంటున్నారమ్మా ... లోకం గుడ్డిదని అందరికీ తెలుసు. దానికి చెవులేకాని కళ్ళులేవు. మనసు లేదు లేని పోనివి అంటగట్టటానికి వెనుకాడదు" అన్నాడు రామచంద్రం.

"ఏమీలేంది ఎందుకంటారు లోకులు మాత్రం. లోకంనోరు మూయ్యటానికి మూకుడులేదు నాయనా, పెదవి దాటితే పృధివిదాటుతుంది మాట. కాలుజారితే తీసుకో వచ్చుగాని నోరు జారితే తీసుకోలేము. అసలు లక్ష్మి ఎందు కెళ్ళినట్లు" అన్నది కొడుకును నిలదీసి అడుగుతూ.

"ఎలా చెప్పమంటావమ్మా, ఈ నోటితో అలాంటి పాపపుమాటలు ఎలా ఉచ్చరించేది...వదినకూ ... నాకూ ..." అంటూ ఆగిపోయాడు. తల పూర్తిగా వాల్చేశాడు.

"ఆ! అన్నదీ .. అందుకే లోకులు అంటున్నారు. నేను చెప్తేవిన్నావా? ఇప్పుడైనా మునిగిపోయింది లేదు. వెళ్ళితీసుకురా. రానంటే వేరుకాపరం ఉందామని చెప్పు.

ఎలా ఒప్పుకొంటే అలా చెయ్యి. మీ మూర్ఖత్వంవల్ల రెండు కాపురాలు ఎందుకు పాడుచేస్తారు. ఇటు అన్నయ్య కాపరం... అటు మీ కాపరం" అన్నది అలివేలు రుద్ధకంఠంతో.

"అలాంటి పాపపు టాలోచనలు చేసే ఆవిడతో ఎలా కాపురం చెయ్యమంటావమ్మా. తల్లితో సమానమైన దానితో...సంబంధం అంటగడితే...ఎలా కాపరం చెయ్యమంటావో చెప్పు. ఆవిడకి అనుమానం పోనిదే మా జీవితం సుఖంగా గడవదు. మనస్సులో ఒకటి పెట్టుకొని పైకి మరో రకంగా జీవించటం అసంభవమని నీకు తెలీదా అమ్మా" అన్నాడు రామ చంద్రం.

"అయితే మరో పెళ్ళి ఏర్పాటు చేస్తాం. అందుకైనా ఒప్పుకో" అన్నది అలివేలు.

"ఇది బొమ్మలాటా అమ్మా ? పైగా ఈ మచ్చ మాసిపోవటానికి బదులు మరింత పెద్దదవుతుంది. ఆ రాబోయే ఆవిడ జీవితం, నా జీవితం మరింత నరకప్రాయ మవుతాయి. దేనికమ్మా ఈ ఆలోచనలు! భగవదేచ్ఛ ఎలా ఉందో అలా జరగనీ. ఆవిడకి నా మీద అనుమానం పోయిననాడే వస్తుంది. అంతవరకు ఇంతే" అంటూ బయటికి వెళ్ళిపోయాడు రామచంద్రం.

"హరి భగవాన్" అని నెత్తి పట్టుకొని అలివేలు బయటికి వచ్చింది. నిశ్చేష్టయై గోడకి బల్లిలా అంటుకుపోయి ఉన్న చంద్రిక కనుపించింది గది అవతల. అలివేలు ముఖం పాలిపోయింది. చంద్ర వినలేదు కదా !వింటే...అమ్మయ్యో

కాని ఫలితా లెలా ఉంటాయో...అలివేలు నిలబడలేక పోయింది. తూలిపోతున్న అలివేలును చంద్రిక హఠాత్తుగా పట్టుకొని ఆపింది.

ఆ రాత్రి మామూలుగా భోజనాలు అయిపోయిన తర్వాత చంద్రిక తన భర్తగదిలోకి వెళ్ళిపోయింది. ఆలోచనలు అంతులేకుండా మనస్సుని క్షోభ పెడుతున్నాయి.

హృదయం మండిపోతున్నది. కానీ దాన్ని ఎలా శాంతింప జెయ్యాలో తెలియకుండా ఉంది. అందరికీ తన మీద అనుమానం. అసహ్యం. తనని చూస్తే తేలికభావం. వీటన్నిటికీ కారణం ఎవరు? తనేనా? తన మంచి తనమా! తన ఓర్పా? తనభర్త అసమర్థు డవటం వల్లనా! తన అందచందాలా? అన్నీ తనకి ఉపకారం చేసే బదులు అపకారమే చేస్తున్నాయి. తానీ యింట్లో ఉండగా తోటికోడలు లక్ష్మి ఈ గడప త్రొక్కదు. మరిది తన అత్త వారింటికి యిల్లరికానికి వెళ్ళడు. అత్తా, లోకులూ తనని ఆడిపోసుకుంటారు. అందరి దృష్టిలో తను చులకనైంది. తన నిర్మలత్వాన్ని సచ్ఛీలతను చాటే ఉపాయం లేదా! ఏ పాపం చెయ్యకుండానే తనకీ శిక్షెందుకు విధించాడు? భగవంతుడు నిర్దయుడా? లేక తన కర్మ పరిపాకమే తాననుభ విస్తున్నదా? ఏ జన్మలో చేసిన పాపం యిది? ఈ జన్మలో తను తెలిసి చేసిన పాప మేమీ తోచటంలేదు. తన అంతరాత్మ నిష్కల్మషమేనని చాటిచేప్తోంది. తన మనస్సులో ఎలాంటి చెడు భావమూ

రాలేదు మరి. అయితే పరిస్థితులా? ఏమో మరి. ఎలాగైన తానా యింటినుంచి వెళ్ళిపోవాలి. అప్పుడే అందరికీ శ్రేయస్సు. అయితే ఎక్కడికి వెళ్ళాలి? ఒంటరిగా వెళ్తే లోకు లేమను కుంటారు? పైగా వారి అనుమానాన్ని దృఢ పరచినట్లు తుంది. మరి భర్తో! ఆయన్ని కూడా తీసుకెళ్ళిపోవాలి. ఆయ నేమంటాడో! ఆయనకి మాటలు రావయ్యె. తనేమ చెపుతుంది? ఎలా నచ్చచెపుతుంది? ఈ కళంకంతో తా నెక్కడికి వెడుతుంది? పుట్టింటికా? ఛీ! అమ్మా, నాన్నా ఏమనుకుంటారు! పరిస్థితులు తనకు ప్రతికూలంగా ఉన్నాయి. అందరూ తననే అనుమానిస్తారు. తన మాటకు పీసమం తైనా విలువ ఉండదు.

చంద్రిక లేచి కూర్చుంది. తనవి రెండుచీరెలూ, భర్తవి రెండు ధోవతులూ, లాల్చీలూ, రెండు అంగ వస్త్రాలూ సంచిలో దోపింది. భర్తని మెల్లగా లేపింది. 'దేనికన్నట్లు' చూచాడు. 'చా - చా - చా-' అంటూ ఏమో చెప్ప బోయాడు.

'తనవెంట రమ్మన్నట్లు' సంజ్ఞచేసి చెయ్యి పట్టుకుంది. ఇంటి పరిస్థితులు పూర్తిగా అవగాహన కాక పోయినా కొంత వరకు తెలుసు సుబ్రమణ్యానికి. తమ్ముడికీ, మరద లికీ, చెడిందనీనీ ఏ కారణం చేతనో ఆవిడ పుట్టింటి నుంచి రావటం లేదనీ, తమ్ముడూ వెళ్ళటం లేదనీను. కానీ కారణం స్పష్టంగా తెలీను. తెలిస్తే ఏంచేసే వాడో మరి?

ంద్రిక చెయ్యి పట్టుకొని లాక్కుపోతుంటే సుబ్రమణ్యాం
శ్శబ్దంగా నడిచి వచ్చాడు. చంద్రిక తలుపు గడియ
మెల్లగా తీసింది. చంద్రిక వెనకనే సుబ్రమణ్యాం నడిచాడు.
చంద్రిక వీధి తలుపు మళ్ళీ చేర వేసింది. తడబడే అడుగుల్తో
ముందు నడిచింది. దారిలో రిక్షా తారస పడింది. సుబ్ర
మణ్యాం చేత్తో రిక్షాని పిలిచాడు. రిక్షా ఆగింది. ఇద్దరూ
ఎక్కి కూర్చున్నారు. నేరుగా రైలుస్టేషనుకు పోనివ్వ
మన్నది చంద్రిక. రిక్షా స్టేషను చేరింది. ఏవూరు పోవాలో
చంద్రికకు పాలు పోలేదు. భర్త సలహా అడిగేందుకు
మాటలు రావయ్యె. తన దురదృష్టానికి తనే వగచింది.
చాల దూరం వెళ్ళిపోవాలి. ఎక్కడికీ? పట్నం వెళ్ళాలి?
వెడితే... తను నిలదొక్కుకో గలదా? హైదదాబాదుకు
టిక్కెట్లు రెండు తీసుకుంది. సంచీ పట్టుకొని యిద్దరూ రైలు
కోసం ప్లాటుఫారంమీద కూర్చున్నారు. సుబ్రమణ్యాం
మనస్సులో వెయ్యి సందేహాలు. అర్ధరాత్రి వేళ ఒంటరిగా
ఎక్కడికి వెడుతున్నట్టు? అమ్మకీ, నాన్నకీ చెప్పకుండా
వెళ్ళవలసిన అవసరమే మొచ్చింది? ఇంతకీ తామెక్కడికి
వెళ్ళుతున్నట్లు? అత్త వారింటికి కాదని మాత్రం నిశ్చ
యించు కున్నాడు.

అత్తవారింటికైతే అలా చెప్పా, చెయ్యకుండా అర్ధరాత్రి వెళ్ళవలసిన అగత్యంఉండదు. ఇందులో ఏదో రహస్యంఉంది. మరదలు రాకపోవటానికీ, తమ్ముడు భార్యని

తీసుకురాక పోవటానికీ, తమ ఈ అర్థాంతర ప్రయాణాని ఏదో సంబంధం ఉండి ఉంటుంది. ఏమిటై ఉంటుంద కారణం ? ఎంత బలీయమైంది కాకపోతే చంద్ర యిలా యిల్లువదలి పారిపోవటానికి సంకల్పిస్తుంది ? ఒకవేళ చంద్రకూ, తమ్ముడికీ ... ఏదైనా నీచ ... సంబంధం ... ఉందా ? ఛీ ... అటువంటిది కాదే చంద్ర! ఇన్నాళ్ళబట్టీ కాపురంచేస్తున్నాడు. ఆ మాత్రం తెలీదా ? అటువంటిదైతే తన నెందుకు చేసుకోవటానికి అంగీకరిస్తుంది ? తన తమ్ముడ్నే చేసుకోక పోయిందా ? వాళ్ళిద్దరికీ పెద్దతేడాలేకపోయినా తన తమ్ముడికంటే చిన్నదే చంద్ర. మేనత్త మేనమామల చుట్ట రికం ఉంది. రామచంద్రాన్నే చేసుకుంటానని చంద్రిక పట్టు పడితే జరిగి ఉండేదే పాపం! చంద్రిక ! తనని కట్టుకొని ఏమి సుఖపడింది ? సంసారం బరువు బాధ్యతలన్నీ తనే మోసింది. ఇంటి పనంతా తనే చేసింది. ఒక మంచి చీరైనా తను స్వయంగా కొని తెచ్చియివ్వలేదు. అమ్మ ఏం తెచ్చియిస్తే అదే కట్టుకునేది! అటువంటి చంద్రికకూ - చంద్రానికీ - ఎలా - నీచ సంబంధం అంటగట్టడం ? తనకి సేవచేసేది. తనకెప్పుడూ నిర్లక్ష్యం చెయ్యటంకానీ, నిరాదరించటంకానీ ఎరుగదు. అటువంటి చంద్రికకా యిలాంటి కళంకం! కానీ తనకి నోరులేదు. లోకుల అనుమానాన్ని రూపుమాపే శక్తి భగవంతుడు తనకి ప్రసాదించలేదు. ఆ వాక్కే తన కుంటే——ఎన్ని చేసేవాడో. ఎన్నిసారులో అనుకున్నాడు. తనకీ

నోరుంటే తమ్ముడిలా చదువుకునే వాడినని. నిజంగా అంత కంటే ఎక్కువే చదివేవాడు. అంతకంటే మంచి ఉద్యోగమే సంపాయించి ఉండేవాడు. చంద్రికని పువ్వుల్లోపెట్టి పూజించే వాడు. పాపం చంద్రిక, మసిబొగ్గుల్లో మాణిక్యంలాంటిది. అలా ఆలోచిస్తున్నాడు సుబ్రమణ్యం. రైలు గుప్పుగుప్పున పొగవదులుతూ 'కూ' అని కూతకూస్తూ స్టేషనుచేరింది. ప్రయాణీకులంతా ఎవరికి వారు హడావిడిగా తమ సరుకూ, సామానూ చంకనెట్టి ఒకరినొకరు త్రోసుకుంటూ, తిట్టు కుంటూ, ఒకరికాళ్ళొకరు త్రొక్కుకొంటూ, పోటీలుపడి ఎక్కుతున్నారు. రైల్వేకూలీలు సామాన్లని కిటికీలగుండా లోపలికి నెట్టున్నారు. చంటి బిడ్డల్ని ఎత్తుకున్న తల్లులు యితరుల్ని తప్పించుకో చూస్తున్నారు. ఆ వత్తిడికి తాళ లేక చంటిబిడ్డలు ఉక్కిరి బిక్కిరై గుక్కపెట్టి ఏడుస్తూన్నారు. ఎలాగోలాగ రైల్లో ఎక్కామనిపించుకుంటే చాలని చూస్తున్నారు. ఆడవాళ్ళని ముందు ఎక్కించి వాళ్ళ వెన కాల సామాన్లు లోపలికి చేరవేస్తున్నారు మొగవాళ్ళు. స్కూలు విద్యార్థులు, కాలేజీ విద్యార్థులు తమ నాగరికతను చూపించే ధోరణిలో ఫుట్‌బోర్డుమీద నిలబడి ఒకచేత్తో కడ్డీపట్టుకొని మరోచేత్తో సిగరెట్ పొగలు వదులుతున్నారు, ఎక్కి దిగేవారు పీరితాకిడితో మరింత ఉక్కిరి బిక్కిరవు తున్నారు. ఎరుకలు, ఏనాదులు, పాములవాళ్ళు, లంబా డీలు, టికెట్టులేకపోయినా తమ సంసార భారంఅంతా

నెత్తికెత్తుకొని అందరికంటే ముందుగా రైలెక్కుతున్నారు. చంకన కట్టుకున్న గుడ్డలో బిడ్డల్ని భద్రంగా కూర్చుండబెట్టు కొని నిర్భయంగా రైలెక్కుతున్నారు. బియ్యం వ్యాపారం చేసేవారు, పాలు, పెరుగు అమ్మేవారు తమతమ తట్టలు నెత్తిన పెట్టుకొని వీలుచేసుకొని ఎక్కుతున్నారు. బైరాగులు, సన్యాసులు, బిచ్చగాళ్ళు, గుడ్డి, కుంటి, అవిటి వాళ్ళూ, పండ్లూ, బిస్కట్లూ, పుస్తకాలు అమ్మేవాళ్ళు సైతం రైలు తమ స్వంతంగా భావించి నిర్భయంగా, సులువుగా ఎక్కుతున్నారు. తమ సామాన్లు బల్లల క్రింద త్రోసి ఏదో మూల ఒదిగి కూర్చుంటున్నారు. చంద్రిక భర్తచెయ్యి ఒకచేత్తో, సంచీ ఒకచేత్తో పట్టుకొని రైలు సమీపించింది. పెట్టెలన్నీ గర్భిణీ స్త్రీలలా నిండుగా ఉన్నాయి. చీమదూరే సందు కనిపించలేదు. సుబ్రమణ్యం వీలుచేసుకొని ముందెక్కాడు. చంద్రిక చెయ్యిపట్టుకొని లాగుతున్నాడు. కానీ ఎక్కేవాళ్ళ వత్తిడితో చంద్రిక నలిగిపోతూంది. లోపలికి జొరబడే ధైర్యం లేక అక్కడే తట పటాయిస్తూ ప్లాట్‌ఫారమ్‌ మీద నిలబడి ఉంది. సుబ్రహ్మణ్యం 'చా-చా-చా' అంటూ ప్రక్కనున్న వారిని అవతలికి నెట్టి చంద్రను పైకి లాగుతున్నాడు.

రైలు కూత వేసింది. భయపడిన జనం అంతా గబ గబా సుడిగాలిలా పెట్టెలోని వాళ్ళమీద వెళ్ళి పడు తున్నారు. ఆ ధాటికి ఆగలేక కూర్చున్నవారు, నిల్చున్నవారు ప్రక్కవారి మీదికి విసుచుకు పడుతున్నారు. ఒకరి కాళ్ళు

కరు త్రొక్కుకుంటున్నారు. దెబ్బతిన్నవారు త్రొక్కిన వారిని శత విధాల శపించి నానా దుర్భాషలాడుతున్నారు. కొట్లాడు కుంటున్నారు. జుట్లు పట్టుకుంటున్నారు. మధ్యవర్తులు చేరి విడదీస్తున్నారు. కొందరా తమాషాని చూచి ఆనందిస్తున్నారు.

చంద్రిక ఎల్లాగో పెట్టె లోపలికి వచ్చిపడింది. సుబ్రమణ్యం చెయ్యి పట్టుకొని ఓ మూల నిలబడింది.

ఆ దగ్గర సీట్లోనే ఓ ధనవంతుడు కూర్చొని ఉన్నాడు. ఆయన ప్రక్కనే పండ్ల బుట్టలూ, ఫ్లాస్కు ఒక చిన్నసూట్ కేసు ఉంది. మనిషి యాభై సంవత్సరాలకు పైబడ్డవాడుగా కనిపిస్తున్నాడు.

పెట్టెలో వారంతా చోటుచేసుకొని కూర్చున్నారు. ఒక రిద్దరు మాత్రం చొరవచేసుకోవటం చేతగాక భిడియపడ్తూ అలాగే నిలబడి ఉన్నారు.

చంద్రిక, సుబ్రమణ్యం ఒకరి నానుకొని ఒకరు నిలబడి ఉన్నారు. రైలు ఒక్కసారిగా కదలటం ఆరంభించే సరికి నిలబడ్డవారు తూలి ప్రక్కవారిమీద పడ్తున్నారు. చంద్రిక పడబోతూ ఉంటే సుబ్రమణ్యం పట్టుకున్నాడు. రైలు వేగం హెచ్చించి వెళ్ళిపోతూ ఉంది.

ఊరి పొలిమేరలు దాటేవరకు వీధిలైట్లు నక్షత్రాలు లాగ మినుకు మినుకు మంటున్నాయి. ఆ వెలుగులో మేడలూ, మిద్దెలూ, వంతెన్లూ, ఫ్యాక్టరీలు, పూరిగుడిసెలు

ఓసారి కనిపించి చీకట్లో లీనమవుతున్నాయి. ఊరి పొలిమేర దాటగానే పొలాలు, కొండలూ, గుట్టలూ, చెట్లూ చేమలూ చీకట్లో విరబోసుకున్న దయ్యాల్లాగా కనిపిస్తు న్నాయి. ఒక్కొక్క స్టేషనే వస్తున్నది పోతున్నది. కాఫీ, టీలు అమ్మేవాళ్ళు కేకలువేసి పోతున్నారు. రైలు కూత కూసి మళ్ళీ వేగం హెచ్చించింది. తన గమ్యస్థానం చేరటానికి అతృతపడుతూ ఉంది.

పెట్టెలోని ప్రయాణీకులు జోగుతున్నారు. తూలి యితరులమీద పడుతున్నారు. తగాదా లాడుకుంటున్నారు. క్షమాపణలు చెప్పుకుంటున్నారు. మళ్ళీ యథాప్రకారం జోగుతున్నారు. రైలు ఆగగానే మేలుకొని తమ సామాను లున్నాయో లేవో సరిచూచుకొని, మెళ్ళో నగలూ, నత్రా భద్రంగా ఉన్నాయో లేవో చూచుకొని మళ్ళీ జోగు తున్నారు. మొగవాళ్లు తమ పర్సులూ, కలాలూ ఉన్నాయో లేవో జేబులు తడుముకొని మళ్ళీ జేబుమీద చెయ్యిపెట్టు కొని కునుకుతున్నారు.

చంద్రిక, సుబ్రమణ్యాం నిలబడ్డ చోటికిదగ్గర్లో ఉన్న బల్లమీద కూర్చున్న ధనికుడు నిద్రపోకుండా పేపరు చదువు కుంటున్నాడు. మధ్య మధ్య బయటికి చూస్తున్నాడు. పెట్టె లోని ప్రయాణీకు లందర్నీ ఒకసారి కలియచూస్తున్నాడు.

పగలంతా పనిచేసి ఉండటాన చంద్రికకు నిద్ర తూలి పోతున్నది. కానీ బలవంతాన కళ్ళు తెరుచుకొని కిటికీలో గుండా చూస్తున్నది.

"మీరిద్దరూ యిలా కూర్చోండి. పాపం అమ్మా యికి నిద్రవస్తున్నట్లుంది" అంటూ ఆ ధనవంతుడు ఆహ్వా నించాడు.

సుబ్రమణ్యానికి మాటలు రావు. అతడేమీ సమా ధానం చెప్పలేదు.

"మిమ్మల్నే, ఏ వూరెళుతున్నారు? ఇలావచ్చి కూర్చోండి" అంటూ బుట్ట, ఫ్లాస్కు, బెడ్డింగు అన్నిసర్దాడు.

సుబ్రమణ్యం ఆసరాతో చంద్రిక వెళ్ళి బెంచీమీద కూర్చుంది. చంద్రికకు ప్రక్కనే సుబ్రమణ్యం కూర్చున్నాడు.

"ఏ వూరెళుతున్నారు?" అన్నాడు ముసలాయన.

సుబ్రమణ్యం నోరు తెరిచాడు. కానీ చెప్పేందుకు చేత కాక ఊరుకున్నాడు.

ముసలాయనకు కోపం వచ్చింది. 'ఇతనికి బెట్టుసరా, ముభావమా, అహంకారమా, లేక చెముడా? ఎన్నిసార్లు పలక రించినా ఏమీ సమాధానం రాదేం?'

"ఏవూరెళుతున్నారు?" అంటూ బిగ్గరగా అడిగాడు.

'ఊహూ' సమాధానం రాదేం!

ముసలాయనకి విసుగు గలిగింది. ఒకవేళ బ్రహ్మ జెముళ్లేమైనా చెవుల్లో మొలిచాయా? లేక చెవిటి వాడా? ఎటూ తేల్చుకోలేక చంద్రిక వంకచూచి "అమ్మాయ్ మీ ఆయన మాట్లాడడేం? చెముడేమైనా ఉందా?" అంటూ అడిగేడు.

"అవునండీ ... అని నాలిక కరుచుకుంది చంద్రిక స్పృహలోకి వస్తూ.

"ఏమిటీ, నే నూహించిన విషయం వాస్తవమే నన్న మాట" అన్నాడు ముసలాయన ఆశ్చర్యపడుతూ.

"అహ, అదికాదండీ. మాటలురావు ... మూగ" అన్నది చంద్రిక సిగ్గుపడుతూ తలవంచుకొని.

"ఆ! భగవల్లీల ఎల్లా ఉంది! ఇంతచక్కటి వాడికి మూగతనమా? రత్నంవంటి పిల్లకు మూగవాడు భర్తా? అంతా ఆశ్చర్యంగా ఉంది సుమా! ఇలా అన్నానని కష్ట పెట్టుకోకమ్మా. ఆ భగవంతుడి లీలలు మానవులమైన మనకేం తెలుస్తాయి? ఆ! ఇంతకీ ఎక్కడిదాకా ప్రయాణం?" అన్నాడు ముసలాయన.

"హైదరాబాదుదాకా ..." అన్నది బెరుకు బెరుకుగా చూస్తూ.

"ఏం? అక్కడ మీ బంధువులెవరైనా ఉన్నారా? అత్తారి ఊరా? అమ్మగారి ఊరా?" అన్నాడు ముసలాయన ఆప్యాయంగా చూస్తూ.

"లేదండీ, అక్కడెవరూ లేరు. బ్రతుకు తెరువు కోసం" అన్నది చంద్రిక నిట్టూరుస్తూ.

"అంతదూరం దేనికి తల్లీ? క్రొత్త ప్రదేశం, అందులో పట్నం. ఆడదానివి ... మూగవాడైన భర్తతో ఎలా నిభాయిస్తావు తల్లీ. కోపగించకు. దూరం ఆలోచించు.

నీ భర్తకా మాటలురావు. జీవితం ఎలా గడుస్తుంది? తెల్ల వారిన దగ్గర్నుంచీ రూపాయలు లేందే ప్రొద్దుపోకదు. అన్నీ కొనుక్కోవలసిందే! ఏం? మీకు ముందూ, వెనకా, ఎవరూ, లేరా?" అన్నాడు ముసలాయన చేతిలోని పేపరు ప్రక్కన పెడుతూ.

"ఎవరూలేరు ... " అన్నది చంద్రిక అబద్ధ మాడుతున్నందుకు బాధపడుతూ.

"ఎంత దురదృష్ట వంతురాలివి తల్లీ. నీకే వయస్సులో ఎన్ని కష్టాలొచ్చాయి! చూస్తూ చూస్తూ యిలాంటి వాడికెలా కట్టబెట్టారు మీ వాళ్ళు? బంగారపు బొమ్మలా గున్నావు? ఎవరికిచ్చినా కళ్ళకద్దుకొని చేసుకుంటారు" అన్నాడు ముసలాయన.

చంద్రిక ఏమీ మాట్లాడలేదు.

"మీవాళ్ళు పేదవాళ్ళా? వాళ్ళకే ఈ అవస్థలన్నీను" అన్నాడు ముసలాయన జాలిపడే కంఠంతో.

"అవును బాబూ" అన్నది చంద్రిక.

"అయినా కూలో నాలో చేసి పెళ్ళాన్ని బ్రతికించ గల వాడికిచ్చి చెయ్యవలసింది. నోరున్నవాడైతే పొట్టకీ, బట్టకీ సంపాదించకపోడు. మరి--మీ ఆయన ఏమైనా పని చేస్తాడా?" అన్నాడు ముసలాయన.

"ఆ...వంటచేస్తాడు" అన్నది చంద్రిక.

"పోనీ...పాపం...ఏదో ఒకటి--బ్రతకటాని కేదైతే నేం" అంటూ సానుభూతి చూపాడు.

"మరి మీ రెక్కడికి వెడతారు? ఊరికి క్రొత్తకదా మరి...అందులో పట్నం" అన్నాడు ముసలాయన.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను బాబుగారూ. ఈయనకి మాట రాదు. అన్నిటికీ నేనే యాతన పడాలి. ఏదైనా హోటల్లో పనికి కుదిరితే బాగుంటుంది" అన్నది చంద్రిక ముసలాయన వంక ఆశగా చూస్తూ.

"ఛీ...బాగుండదమ్మా! వచ్చే పొయ్యే వాళ్ళ తాకిడీకి నీవు తట్టుకోలేవు. చిన్నపిల్లవి. అక్కడ మొగవాళ్ళు పని చెయ్యాల్సిందేకానీ...ఆడవాళ్ళకి మంచి చోటు కాదమ్మా" అన్నాడు ముసలాయన.

"నిజమేనండీ బాబూ. నాకూ అదే భయంగాఉంది. కానీ గత్యంతరం లేనప్పుడు చేసేదేముంది?" అన్నది చంద్రిక తల వంచుకొని.

"అదీ నిజమే. మాయింట్లోనే పెట్టుకుందును. కానీ మా వంటవాడున్నాడు. ఇప్పటి వాడుకాదు. ముప్ఫై ఏళ్ళ నుంచీ చేస్తున్నాడు. రాజయ్య అతని పేరు. ముసలివాడయి పోయాడు. అతన్ని తీసివెయ్యటం నా కిష్టంలేదు...పోనీ ఒక పని చెయ్యమ్మా. మీ ఆయనికి పనికుదిరేదాకా మా యింట్లోనే ఉండండి. రాజయ్యకి సాయం చేస్తుండు. మీకు పనికుదిరాక మీ యిష్టం" అన్నాడు ముసలాయన.

చంద్రిక మనస్సు సంతోషంతో గంతులు వేసింది. పరాయిఊరు పోతున్నామే, నా అన్నవారెవరూలేని చోట

ఎలా మసలాలి; ఎక్కడ ఉండాలి; ఎక్కడ పండాలని మథన పడుతూంది. యింతవరకూ, అత్తమామల యిల్లు, చిరపరిచితమైన ఊరు వదిలి ఎప్పుడూ కనీ వినీ, ఎరగని ప్రదేశానికి ఎలా వెళ్ళాలని తహతహలాడుతూంది మనస్సు. అక్కడ తానెలా నిభాయించుకు రాగలదా అని సంశయిస్తోంది. చేసినపని మంచిది కాదేమోనని వాపోతోంది. ఇప్పుడా అనుమానాలు, భయాందోళన లన్నీ మంచు విడిపోయినట్లు విడిపోయి మనస్సు నిశ్చలస్థితికి వచ్చింది. స్థిమితం చిక్కింది. మనోధైర్యం కలిగింది

"చాలా కృతజ్ఞులం బాబుగారు. ఇంతసేపటినుంచీ ఎలా గడపాలీ అని భయపడుతున్నాను. మాకు దేవుడిలా కనిపించి, కనికరించారు. మీమేలు జన్మ జన్మాలకీ మరిచిపోలేము" అంటూ కృతజ్ఞతాభావంతో చూసింది.

"దీనిలో నేను చేసిన ఉపకారమేముంది తల్లీ. నాకూ ఓ కూతురుండేది. దాదాపు నీ రంగే, నీ వయస్సే, చందనపుబొమ్మలా ఉండేది. పెళ్ళి చేద్దామని అనుకుంటుండగానే మశూచి వచ్చి మాయమైంది తల్లీ. ఆ భగవంతుడు నాతల్లిని తీసుకెళ్ళిపోయాడు. మాతల్లి అంతా తన తల్లి పోలికే. ఇద్దరూ వెళ్ళిపోయారు. నేనే మిగిలిపోయాను రాయిలా" అంటూ నీళ్ళు క్రమ్మిన కళ్ళని ప్రక్కకు త్రిప్పాడు.

"అలానా బాబుగారు. పాపం. మీరూ దురదృష్టవంతులే నన్నమాట" అన్నది చంద్రిక నిట్టూరుస్తూ.

"ఆ! అంతే తల్లీ. ఇంకా మొగపిల్లలున్నారు. పెద్ద బ్బాయి కాలేజీలో చదువుకుంటున్నాడు. చిన్నవాళ్ళు హైస్కూల్లో చదువుతున్నారు. వాళ్ళని ఓ ఒడ్డుకు చేరుస్తే నా బరువు తీరుతుంది." అంటూ నిట్టూర్చాడు.

"అవునండీ బాబుగారూ. పోయినవాళ్ళతో పోలేము కదా? కష్టమో నిష్టురమో ఊకట్టె ఉన్నంతవరకూ బ్రతకక్క తప్పదుగా బాబుగారు" అన్నది చంద్రిక ముసలాయన్ని ఓదార్చే ధోరణిలో.

సుబ్రమణ్యానికేమీ తెలియటంలేదు. భార్యవంకా, ముసలాయనవంకా చూస్తూ మాటలు వింటున్నాడు.

'ముసలాయన అనేదేమిటని' భార్యవంక ప్రశ్నార్థకంగా చూచేవాడు.

'మనల్ని వాళ్ళింట్లో ఉండమంటున్నాడు" అని సంజ్ఞ చేసి చెప్పింది.

సుబ్రమణ్యానికి సంతోషం వేసింది. తనకా మాటలు రావు. ఎవర్ని, ఏమని, ఎలా ప్రాథేయపడాలో తనకి తెలీదు. భార్య, తనూ ఆ క్రొత్తపట్టణంలో, 'నా' అనేవారు లేకుండా ఎలా మసలాలో ఎక్కడ ఉండాలోనని బెంగపడిపోతున్నాడు. భార్యా యిలా యింటినుండి వచ్చేయడం బాగా లేదని అనుకున్నాడు. దీనివల్ల ఉన్న కష్టాలకంటే మించిన కష్టాల్ని కోరి తెచ్చుకున్నట్టవుతుందని అతనిబాధ. కానీ తనభావాల్ని వ్యక్తంచేసే శక్తి తనకి కొరవడింది. చంద్రికమీద ఆధారపడి

బ్రతకటంతప్ప స్వయంగా తనేమీ చెయ్యలేడు. చంద్రిక మీద తనకి విశ్వాసముంది ఆవిడ ఏదిచేసినా తన మంచికే నని. కానీ ఆవిడ చిక్కుల్లో పడకూడదనే వాంఛ. శారీర కంగా శక్తిఉంది. వంట చెయ్యటంలో నేర్పుఉంది. కానీ స్వయంగా చూచుకోలేడు. తనకి అర్థమయ్యేటట్లు చెప్పగల వారు తనప్రక్కన ఉండాలి.

ఇంతలో రైలు కాజీపేట చేరింది. అందరూ ముఖాలు కడిగి, కాఫీలూ, టిఫీన్‌లూ సేవిస్తున్నారు. రైలంతా ఖాళీ అయింది. అందరూ పంపులదగ్గర చేరి ముఖాలు కడుగు తున్నారు. ముసలాయన ముందుదిగి ముఖంకడుక్కొచ్చాడు. ఆ తర్వాత చంద్రికా సుబ్రమణ్యం ముఖం కడుక్కొచ్చారు. ముసలాయన సుబ్రమణ్యాన్ని వెంటపెట్టుకెళ్ళి కాఫీ టిఫిన్‌కి ఆర్డరిచ్చాడు. తనోప్లేట్ తీసుకొని ఒకటి సుబ్రమణ్యం ముందుకి త్రోశాడు 'బే-బే-బే' అంటూ వద్దన్నట్లు తల త్రిప్పాడు. ముసలాయన బలవంతంమీద సుబ్రమణ్యం తిన్నాడు. భార్యకి తీసుకెడదామని అనుకున్నాడు. కానీ హోటలు సర్వరికి తెలిపేదెట్లా? అందువల్ల సిగ్గేసి ఊరు కున్నాడు.

ముసలాయన టిఫిన్ కాఫీ పూర్తిచేసి రెండు కిళ్ళీలు ఒక సిగిరెట్ పెట్టె తీసుకొన్నాడు. రెండు ఇడ్లీలు, ఒక పెసరట్టుకీ ఆర్డరిచ్చి, వాటిని పార్శిల్ చేయించుకొని ఆ పొట్లాలు సుబ్రమణ్యం చేతికిచ్చాడు. ఆ పొట్లాలు తన భార్యకోరకని ఊహించి సిగ్గుపడ్డాడు. తప్పనిసరై తీసు కున్నాడు. ఇద్దరూ వచ్చి రైలెక్కారు.

చంద్రిక తలంతా రేగిపోయి ఉంది. తల దువ్వుకోవటానికి దువ్వెనా ఏమీ లేదు. అందువల్ల చేత్తోనే సరి చేసుకుంది.

కిటికీలోనుంచి చూస్తున్నది. అంత దట్టంగా అలుముకున్న చీకటి తెరలు సూర్యకాంతికి ఒక్కొక్కటీ విడిపోతున్నాయి. మబ్బులను దూసుకొని సూర్యకిరణాలు భూమిమీద పడుతున్నాయి. సూర్యకిరణాలు పడి చెట్ల ఆకులు మెరుస్తున్నాయి. చీకట్లో దయ్యాల్లా కనిపించిన చెట్లే యెంతో రమణీయంగా అవుపిస్తున్నాయి. కొండలూ, గుట్టలూ, నిర్మానుష్యమైన భూములూ, అక్కడక్కడ వెలిసిన ఒకటి రెండు గుడిసెలూ, మొలకి చిన్నబట్టతో పైన గొంగడీ నెత్తికి తలపాగా, చేతిలో కర్రల్తో గొత్తె కాపర్లు పసుల కాపర్లూ, కట్టెలమ్ముకునే వనితలూ, చీరలు మడిచి వెనకకి విరిచికట్టి, జుట్టుముడితో, చేతులకి వెండిమురుగులూ, మెళ్ళో బంగారపు గుండ్లు, నడుమున వెండి వడ్డాణం, చెవులకి బరువుగా వేలాడే కర్ణాభరణాలతో, కాళ్ళకి కడియాలతో వెళ్ళే పల్లె కాపు స్త్రీలూ, నడిచి వెడుతున్నారు, ఆకాశాన్ని సూచించే ఎత్తైన పర్వత శిఖరాలు, వరసలో పేర్చినట్లు వచ్చే పర్వత శ్రేణులు, స్వచ్ఛంగా నీల వర్ణపు చీర ధరించిన అనంత ఆకాశం చూపరులకు కనుల విందు చేస్తున్నాయి. చంద్రిక మనసు ప్రశాంతంగా ఉంది. మరిదీ, అత్తగారూ, మామగారూ, తోడికోడలూ చుట్టు ప్రక్కల అమ్మలక్కలు అంతా కలలోని మనుషుల్లా తోస్తున్నారు.

ంతా విచిత్రంగా ఉంది. ఎక్కడ పుట్టిందీ, ఎక్కడ పెరిగిందీ, క్కడ జీవించిందీ, యిప్పుడెక్కడికి వెడుతున్నదీ...అంతా లోచిస్తే విచిత్రంగా తోచింది. మానవుడి గమ్యం ఏది ? క్కడ అతని స్థిరనివాసం ? ఉన్న చోటనే తన స్థావరం ర్పాడు చేసుకొని అక్కడే నాటుకొని, వ్రేళ్ళు పాతుకొని స్థిరంగా ఉండాలని చూస్తాడు. అంతా తనదేనని భ్రమిస్తాడు. నేను' 'నావా'రని మమకారం చూపిస్తాడు. ఇతరుల్ని వంచి స్తాడు. మోసగిస్తాడు. తనవారిని బాగుచెయ్యాలని అష్ట ష్టాలూ పడతాడు. ఇతరుల్ని నిందిస్తాడు. యాచిస్తాడు. పాధేయ పడతాడు. ఇన్ని అవస్థలూ పడేది ఎవరికొరకు ? ఎవరికి ఎవరు దిక్కు ? చిన్నప్పుడు కనీ, పెంచీ, పెద్దచేసిన తల్లిదండ్రుల్నీ, అన్నదమ్ముల్నీ, అక్క చెల్లెళ్ళనీ, పుట్టిన యింటినీ, ఊరినీ వదిలి తనకు తెలీని మరో ఊరికి, మరో యింటికి, క్రొత్తమనుషులమధ్య వచ్చి పడతారు. కష్టమూ నిష్ఠూరమూ భరించి అదే తన యిల్లనుకొని వారే తన వారను కొని పెట్టి చాకిరీ చేసి ఎంగిలిపడుతుంది...కానీ...తన చేత సేవలు చేయించుకున్నవారే, తన చేతివంట రుచిచూసినవారే తనని అవమానిస్తున్నారు. అనుమానిస్తున్నారు. అసహ్యించు కొంటున్నారు. ఆ పరిస్థితులకి తట్టుకోలేక యిలా తూర్పూ పడమరా, తెలీని మరో ప్రదేశానికి ప్రయాణమైంది. ఇక్క డెంత కాలం ఉండబోతున్నదో, ఎన్ని కష్టాలని ఎదుర్కో బోతున్నదో... దానికి దరీ...దాపూ...ఎక్కడున్నాయి ? ఉన్నాయి. లేకేం...మృత్యువే వీటికి ఒడ్డు, ఈ జీవితమనే

సముద్రాన్ని ఈదీ, ఈదీ, అలిసీ, సొలిసీ, పైకి తేలీ, మునిసుడిగుండాల్లో కొట్టుకొని పోయి, అలా, అలా మృత్యువు దరిచేరుతారు. జీవితం సముద్రం లాంటిది. ఎవరి అదృష్ట ప్రకారం, లలాటలిఖితాను సారం వారి జీవన గతి ఉంటుంది కొందరు అలల తాకిడికి ఒడ్డున చేర్చబడవచ్చు. మరొకరు మునిగి నీళ్ళు త్రాగి చనిపోవచ్చు. వేరొకరు, మొసళ్ళు జలగల బారిన పడి ప్రాణాలని వదలవచ్చు, వేరొకరు సుడిగుండంలో పడి కొట్టుకు పోవచ్చు. ఈ జీవిత సముద్రాన్ని పూర్తిగా ఈది ఆవల ఒడ్డుని పట్టుకునే వారు అరుదు పూర్తిగా ఆవల ఒడ్డుని చేరిన వారికి భగవత్ సాక్షాత్కారం కలగవచ్చు. ఎవరి జీవితం వారిది. ఎవరి అదృష్టం వారిది. ఇందులో ఎవరికీ ఆత్మీయత లేదు. సంబంధంలేదు. కేవలం ప్రేమ, మమకారం, మోహం జాలాల్లో చిక్కుకొని కొన్నాళ్ళు కలిసి ప్రయాణిస్తారు సముద్రంలో. కానీ ఆ సముద్రపు నీటి తాకిడికి తట్టుకో లేనివారు ముందే మునిగి పోతారు. మునగకుండా మిగిలినవారితో మరికొందరు వచ్చి చేరుతారు. మళ్ళీ ప్రయాణం సాగుతూనే ఉంటుంది. మానవుడిలో ఊపిరి ఆడుతున్నంతవరకూ ఎవరినో ఒకరిని ఆప్తులుగా భావించి, ఆత్మీయులుగా ఏర్పాటు చేసుకొని, తోడున్నారని తృప్తిపడి చెయ్యీ చెయ్యీ కలిపి ప్రయాణిస్తుంటారు ప్రవాహ వేగానికి తన తోటపుల్ల వెళ్ళి మరో అల తాకిడికి మరో మార్గాన కొట్టుకు పోవచ్చు. జీవనస్రవంతి

గేదికాదు. తోడూ, నీడా ఉన్నా లేకున్నా అలా
వవహిస్తూనే ఉంటుంది.

కాలమనే ప్రవాహ వేగానికి అలల తాకిడికి తట్టుకో
క యిలా దూర ప్రాంతాలకి నెట్టి వేయబడ్డారు
చంద్రికా, సుబ్రమణ్యాం. ఇలా చీలివచ్చిన ప్రవాహం
మరో క్రొత్త ప్రవాహంతో కలిసి సంగము పొందుతుంది.
మరింత ఉత్సాహంతో మరింత వేగంతో, ధీమాగా, సాఫీగా
సాగిపోతుంది. పిల్లాజెల్లాతో కలకలలాడే యిల్లు పిల్లలు
పెద్దవారై అత్తవారిళ్ళకు వెళ్ళగానే బిక్కుబిక్కుమంటుంది.
కొడుకుల పెళ్లిండ్లై కోడళ్ళు కాపురానికి రాగానే మళ్ళీ
క్రొత్త చిగుళ్ళుపెట్టి వంశవృక్షం కన్నుల పండువుగా తయా
రవుతుంది. క్రొత్త ఆకులు వేస్తుండగానే పాతఆకులు ఒకొ్క
క్కటే, కాలగతి ననుసరించి రాలిపోతుంటాయి. కొన్నాళ్ళకి
పాత ఆకులన్నీ రాలిపోయి కేవలం క్రొత్తగా వేసిన చిగుళ్ళే
మిగులుతాయి. ఆ చిగుళ్లే ఆకులరూపందాల్చి మరికొన్ని
క్రొత్త చిగుళ్ళకి రూపు కల్పించి, తామూ, పండి, ఎండి
రాలిపోతాయి. వంశవృక్షమూ అల్లాంటిదే. సృష్టి రహస్యమే
యిది. ప్రకృతి సహజమైన ఈ మార్పులన్నీ చేస్తున్నా మాన
వులు మొదట ఆమోదించలేక ఏడ్పులూ, పెడబొబ్బలూ
పెట్టటమో, ఆనందంతో గంతులు వెయ్యటమో చేస్తుం
టారు. కానీ విధి బలవత్తరమైనది గనుక సరిపెట్టుకొని
ముందుకు సాగుతుంటారు. సరిపెట్టుకోలేనివారు నమసి
పోతుంటారు.

చంద్రికకూ, సుబ్రమణ్యానికి ప్రస్తుతం ఆత్మీయు లెవరూ లేరు. కానీ ప్రయాణం సాగిస్తున్న కాలంలో - ముసలాయన కలిశాడు. ఆత్మీయుడుగా వెలిశాడు.

సుబ్రమణ్యం టిఫిన్ పొట్లం తెచ్చి భార్యచేతికిచ్చి ముసలాయనవంక చూశాడు. ఎక్కడో ఆలోచిస్తూ, శూన్య లోకి చూస్తున్న చంద్రిక ఉలిక్కిపడింది. విషయం అ గాహన చేసుకొని సిగ్గుపడింది. పాపం, ముసలాయన త కోసం టిఫిన్ తెచ్చియిచ్చాడు. ఆయన ఎవరు తానెవరూ? అప్పటి వరకు ఒకరి ముఖం ఒకరుచూచి ఎర గరు? తన బంధుకోటిలోని వాడుకాడు. ఎలాంటి సంబంధ బాంధవ్యాలు, ఆత్మీయతా లేవు. కానీ ఈ కొద్ది కాలంలో చిరకాల మిత్రులవలె, బంధువులవలె, ఆత్మీయులవలె కలిసి పోయారు. చంద్రిక తన ఆలోచనకు తనే నవ్వుకుంది. ముస లాయన వింతగా చూస్తూ 'ఏమమ్మా నవ్వుతున్నావు' అన్నాడు తన యథాస్థానంలో కూర్చుంటూ.

'ఏమీ లేదు బాబుగారు. ముక్కూమొహం ఎరగని మనం క్షణంలో కలిసిపోయ్యాం. అదే నాకు ఆశ్చర్యంగా ఉంది. అనేక సంవత్సరాలు కలిసి మెలిసి బ్రతికినవారు అదే క్షణ కాలంలో విడిపోవటానికీ, బద్ధవైరులుగా మారిపోవటానికీ అవకాశం ఉంది. అన్ని ఏండ్ల ఆత్మీయత, బంధుత్వం, మమ కారం, అనురాగం ఆ క్షణంలో అడ్డురావు, జ్ఞప్తికిరావు. ఒకర్ని ఒకరు అసహ్యించుకుంటారు. ద్వేషించుకుంటారు. ఒకరి ముఖం ఒకరు చూడరానంత వైరం పెంపొందించు

తుంటాపు అంతా కాలమహిమ దైవలీల. ఇంతకంటే నిద ర్శనం ఏంకావాలి? భగవంతుడి విచిత్రలీలలు కనుక్కోవటం మానవుడి శక్తికి మించినవిషయం. ఏ క్షణాన ఏం జరుగు తుందో, ఎందుకు జరుగుతుందో మనం ఊహించలేము. దాని ఫలితాలెలా పరిణమిస్తాయో గ్రహించలేము. అప్పటి పరి స్థితులనుబట్టి సంతోషించటమో, విచారించటమో, భగ వంతుడ్ని నిందిచటమో, పొగడటమో చేస్తుంటాం, కానీ ప్రతి పనికీ, ప్రతి పరిణామానికీ అడుగున మనకు తెలీని కార ణాలు యిమిడి ఉంటాయి. అలాగే ఫలితాలూను. అవే మనని బలవంతంగా ముందుకు అడుగేయిస్తాయి. అది ముళ్ళ బాట కానూవచ్చు. పూలబాట కానూవచ్చు." అన్నది చంద్రిక. చంద్రిక యింతవరకూ ఎవరితోటీ మనసు విప్పి మాట్లాడి ఎరుగదు. ఇంత దీర్ఘ సంభాషణచేసి ఎరుగదు. తను మాట్లాడటం ఆపివేయగానే తనకే ఆశ్చర్యమైంది అంతసేపు ఏకబిగిని ఎలా మాట్లాడిందా అని. అంతకుముందులేని స్వేచ్ఛ ఈనాడు వచ్చిఉండాలి. ఇంతవరకూ, పెద్దలూ, పిన్నలూ అంటూ కట్టుబాట్లమధ్య గీసిన గిరిలో నిలబడి తన పరిధిని దాటి హద్దునుమీరి ఎప్పుడూ మాట్లాడి ఎరుగదు. కానీ నేడా పెద్దలనుండి దూరంగా వచ్చింది. పంజరంలోనుంచి విడివడ్డ పక్షి రెక్కలు తటతట కొట్టుకొని, కాళ్లు చేతులు చాచి ఆకాశంలో తన యిష్టం వచ్చినట్లు గమ్యంలేకుండా తిరిగినట్లు స్వేచ్ఛగా మాట్లాడింది. మాట్లాడుతున్నంతసేపు తను కొందరి మధ్యఉన్నాననీ, వారు, తన మాటల్నివింటూ

న్నారనీ, తనని గమనిస్తున్నారన్న స్పృహ లేకుండా యిష్టం వచ్చినట్లు స్వేచ్ఛగా, ధారాళంగా మాట్లాడింది. కానీ తనని యితరులు గమనిస్తున్నారన్న స్పృహ కలుగగానే సిగ్గు పడిపోయింది. తలవంచేసింది. ముఖం జేవురించింది.

'అవును తల్లీ. నీవన్న మాట నిజం. మా అమ్మాయి పోయిన తర్వాత ఏదో లోటు కనిపిస్తుండేది. కానీ...నిన్ను చూచిన తర్వాత అమ్మాయి యింకా జీవించే ఉన్నట్లుగా మనసు ఉల్లాసంగా ఉంది. ఇంత తృప్తి, యింత సంతోషం నేనెప్పుడూ ఎరుగను.' అన్నాడా ముసలాయన.

'అమ్మాయ్ స్టేషన్ వచ్చినట్లుందమ్మా. మనం దిగ వల్సింది యిక్కడే' అన్నాడు ముసలాయన.

చంద్రిక పొట్లం విప్పనే లేదు. చేతిలోని పొట్లం అలాగే ఉంది. దాన్ని సంచిలో పెట్టింది.

ముసలాయన లైసెన్సు కూలీని కేక వేశాడు. చంద్రిక పమిటకొంగు నడుము చుట్టూ త్రిప్పి బొడ్లో దోపింది. ముస లాయన సామాన్లన్నీ కూలీకి అందించింది.

'పదమ్మా. పద' అంటూ ముసలాయన దిగేడు.

చంద్రికా సుబ్రమణ్యం ఆయన వెనుకనే వెళ్ళారు.

స్టేషన్ అంతా కిటకిటలాడుతోంది. ఎండ తీక్షణంగా ఉంది. ఒంటిగంట అయినట్లుంది. బంధువులను కలుసుకోవ డానికి వచ్చిన వారూ, రైలు ప్రయాణం చెయ్యటానికి వచ్చిన వారూ, పుస్తకాలు అమ్మేవారు కాఫీ, టీలు అమ్మే

వాహ్నూ, పూలూ, పండ్లూ అమ్మేవారితో స్టేషను నిండు చూలాలిలా ఉంది.

ముసలాయన బయటికి నడిచాడు. చంద్రికా, సుబ్రమణ్యాం ఆయన వెనుకనే వచ్చారు. అక్కడ ముసలాయన కొడుకు చంద్రశేఖరం కారు తీసుకొచ్చి, నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

"శేఖర్. ఇలారా నాయనా" అంటూ ముసలాయన పిల్చాడు.

శేఖరం మాటలాపి కారు దగ్గరకి వచ్చాడు.

లైసెన్సు కూలీ సామానులన్నీ కారులో పెట్టాడు.

కారు దగ్గర్లో నిలబడి బెరుకుగా చూస్తున్న చంద్రికా సుబ్రమణ్యాల నుద్దేశించి 'ఏరెవరు?' అన్నాడు చంద్రశేఖరం.

"వాళ్ళా! ఉదర నిమిత్తం బయలుదేరిన అభాగ్యులు. పాపం. ఎవరూ లేరట..." అన్నాడు ముసలాయన.

అలాగా. అయితే ఈ అభాగ్యులు మీ ఆదరంతో ఐశ్వర్య వంతులైనారన్న మాట...మీ రెక్కడికి పోయినా అతిథులోన్నొ, అభ్యాగతులోన్నొ వెంటబెట్టుకు రాకుండా ఉండరు. ...పదండి" అంటూ నవ్వుతూ కారు తలుపు తీసి నిలబడ్డాడు. ముసలాయన ముందుసీట్లో కూర్చున్నాడు.

చంద్రిక సందేహిస్తోంది. తలవాల్చి ఉంది.

'పదండి. ఎక్కండి పోదాం' అంటూ కారుతలుపుతీసి పట్టుకున్నాడు చంద్రశేఖరం.

చంద్రిక తటపటాయిస్తూ అలాగే నిలబడి ఉంది.

"ఊ. ఎక్కండి. నాన్నగారు ఆహ్వానిస్తే తప్ప ఎక్క కూడదా" అంటూ నవ్వాడు చంద్రశేఖరం.

"ఊరుకోరా. గాబరాపెట్టకు. అసలే పల్లెటూరి పిల్ల. పట్నం మొఖం చూచి ఎరుగదు. పాపం అతగాడికి మూగ. అంతా దురదృష్టం" అన్నాడు ముసలాయన కొడుకుని మందలిస్తూ.

"ఓ. సారీ... మీకు యింగ్లీషు రాదుగా. అన్నట్లు... సరే... దయచేసి ఎక్కండి. అంతా వింతాగా చూస్తారు. ఇంటికి వెళ్ళాక కావలసినంత సిగ్గుపడవచ్చు" అన్నాడు చంద్రశేఖరం గంభీరంగా.

"ఏమిట్రా ఆ హేళన. పెద్దా, చిన్నా, తారతమ్యం లేదు. అసలే బెదురుతున్న పిల్లను మరీ భయపెట్టావ్! రా అమ్మా. ఆ వెనకసీట్లో కూర్చొండి. మా వాడి తీరే అంత. క్రొత్తా పాతా అన్న బెరుకులేదు. అందరితోటీ హాస్యంగా మాట్లాడుతాడు. నీవేమీ గాబరాపడకు" అంటూ పిలిచాడు.

చంద్రిక మెల్లగా ఎక్కి కూర్చుంది. సుబ్రమణ్యాం ఆమె వెనకనే ఎక్కాడు. చంద్రశేఖరం తలుపు దఢాలున మూసి డ్రైవర్ సీటులో కూర్చొని ఆఘ మేఘాలమీద నడిపించాడు.

అసలే భయపడుతున్న చంద్రిక మరింత భయపడింది. బస్సులో ఎప్పుడో ఒకటి రెంటు సార్లు ప్రయాణం చేసి ఉంటుంది. అంతే. సుబ్రమణ్యాం చెయ్యి గట్టిగా పట్టుకుంది,

కారులో ప్రయాణం చెయ్యక పోయినా బస్సు ప్రయాణం సుబ్రిమణ్యానికి అలవాటే. వంటలు చెయ్యటానికి అనేక ఊళ్ళకు వెళ్ళవలసి రావటంతో, బస్సు ప్రయాణాలు, రైలు ప్రయాణాలు బాగా అలవాటయ్యాయి.

చిరు నవ్వు నవ్వుతూ చంద్రికకు అభయమిచ్చాడు.

కారు సరరున వచ్చి ఒక పెద్ద భవంతి ముందు ఆగింది. గేటు దగ్గర ఘుర్కా వాడు వంగి సలాము పెట్టాడు.

గేటులో ఉన్న కుక్క 'భౌ' మంటూ చంద్రిక మీదికి దూకబోయింది. 'అమ్మబాబోయ్' అంటూ కెవ్వున కేక వేసింది చంద్రిక వణికిపోతూ. సుబ్రమణ్యాన్ని గట్టిగా పట్టుకుంది.

'రాణీ...పద లోపలికి' అంటూ ముసలాయన అదిలించాడు. 'రాణీ' తోక ముడిచి లోపలికి దయచేసి వరండాలో నిలబడి ఈ ఆగంతకులవైపు ఓరగా చూస్తున్నది.

చంద్రశేఖరం విరగబడి నవ్వాడు. పల్లెటూరి అమ్మాయికి కుక్కని చూసినా భయమేనా' అంటూ.

"ఛా. అలా అల్లరి చెయ్యకు. ఎన్నేళ్ళొచ్చినా కొంటెతనం పోలేదు. పాపం భయపడి ఆపిల్ల వణికిపోతుంటే నీ నవ్వేమిటి మధ్య" అంటూ కసురుకున్నాడు ముసలాయన.

"సారీ..." అంటూ ముందుకి అడుగేశాడు. 'పదండమ్మా' అంటూ ముసలాయన ముందుకి సాగేడు.

దర్వాన్ వచ్చి కారుని తీసుకెళ్ళి గేరేజిలో పెట్టాడు.

చంద్రిక సుబ్రమణ్యం చెయ్యి పట్టుకొని మెల్లగా అడుగులో అడుగువేస్తూ ముందుకు వెళ్ళింది.

బాట కిరువైపులా చక్కని పూల మొక్కలు. రంగు రంగుల పూలు తలలూపుతూ వచ్చేవారికి స్వాగతం పలుకుతున్నాయి. చంద్రిక ఆశ్చర్యానికి అంతులేదు. మనస్సులో భయం పట్టుకుంది. గుండె వేగంగా కొట్టుకుంటున్నది. ఇంత పెద్ద యింటికి అధికారైన ఆ ముసలాయనలో తను పిచ్చాపాటీ మాట్లాడింది. ఆయన ఏమనుకుంటాడో. ఇంత పెద్ద ధనికుడని తను కలలో కూడా ఊహించలేదు.

వరండాలోని సోఫాలు, కుర్చీలు, బీరువాలు, అందమైన డిజైన్లతో వ్రేలాడే పట్టు తెరలూ, కాశ్మీర్ తివాసీలూ గోడలకి మంచి మంచి ఫోటోలు చూసి ఆశ్చర్యపోతూ ఒకొ్కక్క అడుగేసేస్తున్నది.

'పదమ్మా. ముందు స్నానం చేద్దురుగాని' అని ముందుకి వెళ్ళాడు.

రాజయ్య ఎదురయ్యాడు. మొలకి అంగ వస్త్రం, బుజం మీద ఒక అంగ వస్త్రంతో.

'ఎవరు బాబూ వీరు' అంటూ ముసలాయన్ని ప్రశ్నించాడు.

'నీకు బంధువులోయ్' అంటూ నవ్వాడు ముసలాయన.

'నాకా' అంటూ ఆశ్చర్యపోయి, అర్ధంకాక తెల్ల బోయి చూస్తున్నాడు.

'అలా చూస్తావేం వాళ్ళదీ నీ వృత్తే. అందుకని చెప్పానులే, ఆచార్లు, పద. ముందు వేన్నీళ్లు సిద్ధంచెయ్యి. అందరం స్నానంచేస్తాం. ఆపైన భోజనం సంగతిచూడు' అన్నాడు ముసలాయన

'పదమ్మా' స్నానాలకొట్టు చూపిస్తాను. బాయిలర్ వెలిగిద్దువుగాని' అన్నాడు రాజయ్య ముందుకి వెడుతూ.

'బాయిలరా? అదెట్లా వెలిగించాలో నాకు తెలీదే' అంది చంద్రిక అయోమయంగా చూస్తూ.

'తెలియకపోతే నేను చెప్తాలే పద' అంటూ అధి కారం చెలాయిస్తూ ముందునడిచాడు.

'అప్పుడే అధికారం చెలాయిస్తున్నావుటోయ్ రాజయ్యా. పాపం, ప్రయాణంచేసి. అలిసి, సొలిసివచ్చింది ... నీవుచూడ్డూ ఆనీళ్ళ సంగతి' అన్నాడు ముసలాయన.

"ఓ - అలాగేబాబూ. ఊరికే అన్నాను. పదమ్మా నీ పేరేమిటి? ఎలా పిలవమంటావు?" అన్నాడు రాజయ్య.

"నా పేరు చంద్రిక. మీకెలా వీలయితే అలా పిల వండి. పెద్దవారు" అన్నది చంద్రిక వినయంగా.

"నిన్ను చంద్రమ్మా" అని పిలుస్తాలే తల్లీ! అన్నాడు రాజయ్య. రాజయ్య బాత్ రూమ్‌లోకి వెళ్ళాడు. చంద్రిక కూడా అతడ్ని అనుసరించింది. సుబ్రమణ్యానికి ఏం చెయ్య టానికి తోచక తారట్లాడుతున్నాడు.

"ఇలా రా బాబూ. ఇక్కడకూర్చో" అంటూ కుర్చీ చూపించాడు ముసలాయన. సుబ్రమణ్యం సందేహించాడు. వెళ్ళి తివాసీ అంచున కూర్చున్నాడు. ఏమీ తోచలేదు. కిటికీ దగ్గర నిలబడి తోటలోకి చూస్తూ నిలబడ్డాడు.

'అలా సందేహించకు నాయనా, ఇదీ నీ యిల్లేననుకో. చంద్రాన్ని నీ తమ్ముడనుకో' అంటూ సంజ్ఞ చేసి పిలిచాడు ముసలాయన.

సుబ్రమణ్యం వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు బెరుకుగా చూస్తూ.

చంద్రిక చన్నీళ్ళతో స్నానంముగించి భర్తకీ, ముసలాయనకి స్నానానికి నీళ్ళుతోడింది.

రాజయ్యకు వంటలో సాయంచెయ్యటానికి వెళ్ళింది.

'రామ్మా! కూర్చో' అన్నాడు రాజయ్య ఆప్యాయంగా చూస్తూ.

"దేనికి బాబాయ్. ఇలా కూర్చుంటాలే, తరగవలసిన కూరలేమిటో యిలాపడెయ్. నే నేం సాయం చెయ్యాలో చెప్పు. పెద్దవాడివి. అన్నీ నీవే ఎక్కడచేస్తావు" అన్నది చంద్రిక చొరవగా.

"అప్పుడే ఎందుకులే తల్లి. ఊరికే తమాషాకి అన్నాను. ఈవంట నేటిదా. ఎన్నేళ్ళబట్టో చేస్తున్నాను. చేసి, చేసి చేతులు కాయలు కాసినాయి" అన్నాడు రాజయ్య.

"బాబాయ్. పిన్ని లేదా? ఏమైంది? నీ వొక్కడివే ఎందుకు చేస్తున్నావు? నీ కెంతమంది పిల్లలు? అన్నది చంద్రిక ఊపిరాడకుండా ప్రశ్నల వర్షం కురిపిస్తూ.

"పిన్ని లేదమ్మా. పోయి చాలా కాలమైంది. గుండె జబ్బుతో వెళ్ళిపోయింది ఈ నీ బాబాయిని విడిచిపెట్టి" అన్నాడు కళ్ళు అంగవస్త్రంతో తుడుచుకుంటూ.

"మరి పిల్లలమాట చెప్పావుకాదు" అన్నది చంద్రిక జాలిగాచూస్తూ.

"పిల్లలా, ఉన్నదమ్మా, ఒక్కకూతురు" అంటూ నవ్వాడు. కన్నీటి తెరనుంచి తళుక్కున నవ్వుమెరిసింది.

"ఎక్కడ ఉంది బాబాయ్. నాకోసారి చూపించు. పరిచయంచేసుకోవాలి. పెద్దపిల్లేనా? చిన్నపిల్లా? పెళ్ళి చేశావా? కాపురానికి వెళ్ళిందా? పిల్లలేమైనా ఉన్నారా?" అన్నది చంద్రిక ఉత్సుకతతో చూస్తూ.

"ఆ, పెళ్ళయిందమ్మా. పిల్లలింకాలేరు. ఇక్కడే ఉంది" అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"ఏది బాబాయ్. ఈ యింట్లోనే ఉందా? ఎక్కడైనా ఉందా. చూపించవూ?" అన్నది చంద్రిక కూరగాయలబుట్ట ముందు వేసుకొని.

"ఆ, ఆ, ఇక్కడే ఉందిలే. ఇప్పుడేం తొందర. నెమ్మదిగా చూద్దువుగాని. మా అమ్మాయికిచాలా భిడియం. క్రొత్తవాళ్ళతో మాట్లాడ దేమనుకుంటున్నావో మరి" అన్నాడు రాజయ్య బులిపిస్తూ.

"ఓస్, నీకెందుకు బాబాయ్. నీవు నన్ను పరిచయం చెయ్యి రేపీపాటికి ప్రాణ స్నేహితులం కాకపోతే ఒట్టుపెట్టు" అన్నది చంద్రిక.

"అది సరేలే, మాటల్లోపడి ఏఏ కూరగాయలు తరుగుతున్నావో చెప్పు. ముందు వంటకానీ. ఆ తర్వాత మాటలు. బాబుగారు కోపపడతారు" అన్నాడు రాజయ్య.

"అలాగేలే, ఇవిగో, కాకరకాయలు పొట్టలుచీల్చి కారం ఉప్పు కూరేను. వాటిని కారపుకాయలు చెయ్యి. ఇదిగో ఈ పొట్లకాయ తరిగాను. దీన్ని తిరగమోతవేసి పెరుగు పచ్చడిచెయ్యి. ఇవిగో ఈ వంకాయలు తరిగేను. కొబ్బరి, శనగపప్పు వేసి కూరవండు. ఈ బీరకాయలు కాల్చియివ్వు. పచ్చిమిరపకాయలు, కొత్తిమేర, చింతపండూ ఉప్పువేసి నూరుతాను. ఇంక పులుసు పెడతావా? చెప్పు" అన్నది చంద్రిక.

"అబ్బో చాలాకూరలు తరిగేవే. ఇన్ని నే నెప్పుడూ చెయ్యలేదు. పండగనాడుకూడా...ఇంకా పిండి వంటలేమీ ఆలోచించలేదా?" అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"ఉల్లిపాయ పకోడీలుచేస్తే..." అన్నది చంద్రిక.

"బాబుగారు తినరు" అన్నాడు రాజయ్య.

"పోనీ ఆలుగడ్డ బజ్జీలుచేస్తే" అన్నది చంద్రిక

"చినబాబుగారు తినరు" అంటూ చంద్రశేఖరం వచ్చాడు.

చంద్రిక వెనుతిరిగిచూసింది. ద్వారం రెండుకమ్మీల మీదా రెండుచేతులుపెట్టి గడపమీద నిలబడ్డాడు చంద్ర శేఖరం.

చంద్రికకు సిగ్గువేసింది. పమిటకొంగు తీసిచుట్టూ కప్పుకుంది.

"గడపమీద నిలబడకూడదు. తప్పని చెప్పు రాజయ్యా బాబాయ్" అన్నది చంద్రిక తల అటుత్రిప్పకుండానే.

"ఓ సారీ ... వదినా. ఇంతవరకూ ఎవరూ చెప్ప లేదు తప్పని" అన్నాడు నవ్వుతూ చంద్రశేఖరం గుమ్మందిగి వంటింట్లోకి అడుగు బెడుతూ.

"చెప్పులు తొడుక్కొని వంటింట్లోకి రాకూడదని చెప్పు బాబాయ్" అన్నది చంద్రిక తలవంచుకునే.

"ఓ సారీ ..., అన్నీ .... పట్టింపులూ, ఆచారాలూ మా వదినగారి కున్నట్లున్నాయే. చచ్చాంరా బాబూ" అంటూ బయటికి వెళ్ళి చెప్పులు వదిలి వచ్చాడు.

"రాజయ్యా తాతా ... అన్నం వడ్డిస్తావా ? నాకు పనుంది. స్నేహితుల్ని కలుసుకోవాలి" అన్నాడు చంద్ర శేఖరం పీట వాల్చుకొని కూర్చుంటూ.

"పేంట్లూ, షర్టులూ విప్పి లుంగీ కట్టుకొని రమ్మను బాబాయ్. కాళ్ళు కడుక్కోవడం మర్చిపోవద్దను" అన్నది చంద్రిక.

"నేను చెప్పడం దేనికి తల్లీ. చిన్నబాబుగారు వింటూనే ఉన్నారుగా. ఇంతవరకూ నేనెంత మొత్తుకున్నా

బట్టలువిప్పి వచ్చేవారుకాదమ్మా. పాంట్లూ, షర్టులతోనే భోజనం. చెప్పులు విడిచి ఒక్కనాడూ భోజనం చెయ్యలేదు. పైగా టేబిల్ మీల్స్ అంటూ బల్లమీద పెట్టించుకొని కుర్చీలో కూర్చుని తినేవారు ... ఈ రోజు నీవు చెప్పంగానే చేసేస్తున్నారు" అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"ఓ - అదా నీకు కలిగిన కష్టం. ఎంతైనా వదినగారు కదా. అధికారం చలాయించే హక్కు ఆవిడకున్నది. అమ్మ ఎప్పుడో పోయింది. ఈ యింట్లో చెల్లి ఉండేది ... అది కూడా పోయింది. అప్పటినుంచీ నన్ను అదుపులో పెట్టేవారు లేకపోయారు" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు.

"ముందు వెళ్ళి బట్టలు మార్చుకుదాండి బాబుగారు. ఈ లోపల వంట అయిపోతుంది. అందరూ కలిసి భోజనం చెయ్యవచ్చు" అన్నాడు రాజయ్య.

"ఓ, అలాగే. ఈరోజు పంక్తి భోజనమన్నమాట" అన్నాడు చంద్రశేఖరం వెళ్ళిపోతూ.

"ఊ, త్వరగా కానిచ్చి రండి" అన్నాడు రాజయ్య.

కూరలు తరిగిన చెక్కలు అన్నీ ప్రోగుచేసింది చంద్రిక. వంటిల్లంతా శుభ్రంగా ఊడ్చింది - భోజనశాల తడిగుడ్డతో తుడిచి శుభ్రంచేసింది. పీటలు వరసగా అమర్చింది. మంచినీళ్ళు పెట్టింది. పెద్దబాబుకూ, చిన్నబాబుకూ వెండి కంచాలు పెట్టింది. ప్రక్కన వెండి ఆకులు పెట్టింది. తన భర్తకి అరిటాకు కోసివేసింది. అంతా సిద్ధంచేసింది. రాజయ్య వంట పూర్తిచేశాడు.

చంద్రిక అన్ని కంచాల్లో వడ్డించింది. నేతిగిన్నె రాజయ్య చేతికిచ్చి తను వంటింటి గుమ్మంచాటున నిల బడింది. రాజయ్యకేం కావాలో అడిగి అందిస్తున్నది.

ముసలాయనా, చంద్రశేఖరం, సుబ్రమణ్యం వచ్చి పీటలమీద కూర్చున్నారు. ఒక్కొక్కటే కలుపుకు తింటు న్నారు.

"రాజయ్యా - ఈరోజు నీవంట చాలా అద్భుతంగా ఉంది. కారణం ఏమిటో" అన్నాడు ముసలాయన.

"కారణం అమ్మాయి చంద్రమ్మ రాకే. ఈరోజు అమ్మాయి చెప్పినట్లు చేశాను" అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"ఓ, అదా సంగతి, అప్పుడే అమ్మాయి వంటింటి అధికారం సంపాయించిందన్నమాట. ఇంక నీకు పింఛను యిచ్చేస్తుందేమో జాగ్రత్త" అన్నాడు ముసలాయన నవ్వుతూ.

"అంతకంటేనా ... బాబుగారు. నాకీనాటినుంచీ ఓ కూతురు కలిగింది ..." అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"ఓ ... అయితే మంచి ఛాన్సే కొట్టావు. ఇంక నీకు ముసలితనంలో భయంలేదు. నిన్ను కనిపెట్టుకొని ఉంటుంది. నీకు ఆలనా, పాలనా చూస్తుంది" అన్నాడు ముసలాయన.

"అవును బాబుగారూ, నాకు ఈరోజున అమ్మదొరి కింది. మాతల్లి నన్ను చూడకుండా ఉంటుందా" అన్నాడు రాజయ్య వంటింటి గుమ్మంలోకి చూస్తూ.

చంద్రిక సిగ్గుపడిపోయింది.

"అయితే ... రాజయ్యా మరి ఈ సంతోషసమయంలో మాకు పార్టీ యివ్వవా?" అన్నాడు చంద్రశేఖరం నవ్వుతూ.

"ఎందుకివ్వనూ, ఈ రోజు స్పెషల్ టిఫిన్ చేస్తాను." అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"కాకరకాయలు చాలా బాగున్నాయి రాజయ్యా. మరి రెండు వెయ్యి, ఆ... పెరుగు పచ్చడికూడా కాస్త ఆ చేత్తోనే వడ్డించు" అన్నాడు చంద్రశేఖరం.

సుబ్రమణ్యానికి మాటలురావు కాబట్టి తలవంచుకొని తింటున్నాడు.

అందరూ తృప్తిగా భోజనాలు కానిచ్చి త్రేవుమని త్రేన్చారు. చేతులు కడుక్కోవటానికి నీళ్లూ, టవలూ, సబ్బూ అన్నీ రెడీగా పెట్టిఉన్నాయి.

అందరూ చేతులు కడుక్కొని హాల్లోకి వచ్చారు. తాంబూలం సిద్ధంచేసిన పళ్లెం బల్లమీద ఉంది. భుక్తాయాసం తీర్చుకోవడానికిగానూ ప్రక్కలుసిద్ధంచేసింది ముగ్గురికీ.

ముసలాయన గుర్రుపెట్టి నిద్రపోయాడు. చంద్రశేఖరం బట్టలువేసుకొని సుబ్రమణ్యాన్ని చేత్తో పిలిచాడు. సుబ్రమణ్యం సందేహిస్తూ చంద్రశేఖరం వెంటవెళ్ళాడు.

చంద్రశేఖరం కారుబయటికి తీశాడు. సుబ్రమణ్యాన్ని ప్రక్కన కూర్చోబెట్టుకొని కారు స్టార్టు చేశాడు. సుబ్రమణ్యానికి సంజ్ఞచేసి కారు నడిపే పద్ధతి చూపించాడు. సుబ్ర

మణ్యాం శ్రద్ధగా చూస్తున్నాడు. సుబ్రమణ్యంలో ఎప్పుడూ లేని వింతకోరిక ఒకటి కల్గింది.

'తాను కారు నడపటం నేర్చుకోవాలి !

చంద్రిక, రాజయ్య భోజనం ముగించి వంటిల్లు సర్దుకున్నారు. పనిమనిషి నూకాలు వచ్చి అంట్లు తోమి యిల్లు చిమ్మింది.

చంద్రిక తమ బట్టలు తీసి శుభ్రంగా ఉతికి ఆర వేసింది. వచ్చి హాల్లో చూస్తే ముసలాయన లేచాడు. సోఫాలో కూర్చొని పేపరు చూసుకుంటున్నాడు. చంద్ర శేఖరం, సుబ్రమణ్యాం లేరు.

చంద్రిక మనస్సు గుబగుబలాడింది. భర్త ఏమైనట్లు? అతనికి మాటలు రావు - ఎక్కడికి వెళ్ళాడు? ఈ క్రొత్త ఊళ్ళో అతను తిరిగి రాగలడా ఒక్కడూ? ఎందుకు వెళ్ళి నట్లు? చంద్రిక మనస్సు భయాందోళనలతో అతలాకుతల మైంది.

"బాబుగారూ...ఆయన...ఎక్కడ ?" అన్నది వణికే కంఠంతో.

"ఏమోనమ్మా...మీ ఆయున సంగతేనా. నేను నిద్రలేచిచూస్తే అబ్బాయీ లేడు. మీ ఆయనా కనిపించలేదు. ఒకవేళ యిద్దరూ కలిసి వెళ్ళారేమో. వాళ్ళే తిరిగి వస్తార్లే. నీ వేమీ గాబరాపడకు" అన్నాడు ముసలాయన మామూలు ధోరణిలో.

కానీ చంద్రిక మనస్సు మాత్రం స్థిమితపడలేదు. రాజయ్య దగ్గరికి వెళ్ళింది విచార వదనంతో.

"ఏమ్మా. ఏమైంది. అలా దిగులుగా ఉన్నావ్" అన్నాడు రాజయ్య టిఫిన్ చెయ్యటానికి ఉపక్రమిస్తూ.

"ఆయన కనిపించటం లేదు బాబాయ్" అన్నది చంద్రిక దిగులుతో.

"ఓస్. అదేనా. చిన్న బాబుగారు వెంటపెట్టుకుని వెళ్ళి ఉంటారు. ఆయనకు తిరగట మంటే సరదా" అన్నాడు రాజయ్య.

"ఏమో. అలాగయితే నాతో చెప్పి వెళ్ళరా? నిజమే నంటావా బాబాయ్. తిరిగి వస్తారంటావా?" అన్నది చంద్రిక.

"పిచ్చి పిల్లా. నీ కన్నీ భయాలే. తిరిగి రాక ఎక్కడికి పోతాడు. నిన్ను వదిలిపెట్టి పోగలవాడైతే యింత దూరం నీతో ఎందుకొస్తాడు" అన్నాడు రాజయ్య నవ్వుతూ.

"ఏమో బాబాయ్. భగవంతుడి దయవల్ల తిరిగివస్తే ఆంజనేయస్వామికి రెండు టెంకాయలు కొడ్తాను" అన్నది చంద్రిక,

"అలాగేలే. ఇంతకీ ఈ రోజు టిఫిన్ ఏమిటి చెయ్య మంటావో చెప్పు. ప్రొద్దున నీవు చెప్పినట్లు చేస్తే బాబు గారు మెచ్చుకున్నారు. అమ్మగారు, అమ్మాయిగారు చని పోయిన తర్వాత ఆయన నా వంట మెచ్చుకోవటం యిదే మొదటిసారి" అన్నాడు రాజయ్య నిట్టూరుస్తూ.

"గుమ్మడికాయ హల్వా చెయ్యి" అన్నది చంద్రిక.

"అదేదో నీవే చెయ్యి. నాచేత కాదు. బాగాలేక పోతే అంతా నన్నే అంటారు" అన్నాడు రాజయ్య.

"నా మనస్సు బాగాలేదు బాబాయ్. చేసే విధం చెప్తాను. ఈ రోజుకి నీవు చేద్దూ" అన్నది చంద్రిక.

"హల్లో, రాజయ్యా...టిఫిన్ ఏంచేశావ్. త్వరగా పట్రా. ఈరోజు సినిమాకి వెడుతున్నాం, నేనూ అన్నయ్య" అంటూ వచ్చాడు చంద్రశేఖరం.

చంద్రశేఖరం వెనక సుబ్రమణ్యం నిలబడి ఉన్నాడు. అతని ముఖాన హాసరేఖలు దోబూచు లాడుతున్నాయి.

చంద్రిక తొంగిచూచింది. భర్త నవ్వుతూ నిలబడి ఉన్నాడు.

చంద్రిక ముఖం వికసించింది. సిగ్గుతెరలు ముంచెత్తాయి.

"చంద్రమ్మ తల్లీ, ఇందాకటినుంచీ మీ ఆయనకోసం కలవరిస్తుంటివే. అదుగో చూడు. ఏమయ్యా చెప్పా పెట్టకుండా వెళ్ళిపోవాలి! మీ ఆవిడ గాబరా పడుతున్నది" అన్నాడు రాజయ్య.

"ఓ సారీ... ఆ తప్పునాదే. వదిన గాబరాపడే విషయం నాకు గుర్తులేదు. అన్నయ్యని తోడు తీసుకెళ్ళాను" అన్నాడు చంద్రశేఖరం క్షమాపణ చెప్పుకుంటూ.

"పదండి బాబుగారూ. పదినిమిషాల్లో టిఫిన్ రెడీ అవుతుంది" అన్నాడు రాజయ్య.

"ఇదిగో రాజయ్యా. ఈ ప్లేట్లూ ఈ గ్లాసులూ తీసి కెళ్ళి టేబిల్ మీద పెట్టు" అన్నది. చంద్రిక తలుపు చాటు నుండే.

"ఓ మొగుడ్ని చూడగానే అమ్మాయి గారికి ఏను గంత బలం వచ్చినట్లుందే. మాటల్లోనే టిఫిన్ కాఫీ సిద్ధం చేసేసింది. పదండి బాబుగారు. తెస్తున్నాను" అంటూ రాజయ్య వంటింట్లోకి వెళ్ళి ఒక ట్రేలో ప్లేట్లూ, కాఫీ గ్లాసులూ పెట్టుకొని బయటికి వచ్చాడు.

"ఏమిటి రాజయ్యా ఈరోజు టిఫిన్" అన్నాడు చంద్రశేఖరం నవ్వుతూ.

"తినబోతూ రుచి అడగటం దేనికి చినబాబూ, పదండి" అంటూ ముందుకు వెళ్ళి బల్లమీద ట్రే పెట్టాడు.

టిఫిన్ మాట వినగానే ముసలాయన కూడా వచ్చి చేరాడు. ముగ్గురూ టిఫిన్ కాఫీ పూర్తిచేశారు,

"బాగుంది రాజయ్యా టిఫిన్, ఇప్పుడు నీ చెయ్యి అమృతహస్తంలాగా ఉంటున్నది" అన్నాడు. ముసలాయన నవ్వుతూ.

"అంతా మా చంద్రమ్మతల్లి చలవ. ఆవిడ చెయ్యి చేసుకుంటే దేనికి రుచిరాదూ" అన్నాడు రాజయ్య.

"అలాగా. మరి ఈ రోజు సినిమా ప్రోగ్రాం ఉంది. మీ రొస్తారా నాన్నగారూ" అన్నాడు చంద్రశేఖరం.

"నేనేమిట్రా ఇన్నేళ్ళొచ్చి. మీరు వెళ్ళరూ" అన్నాడు ముసలాయన.

"రండి. అందరం కలిసి వెడదాం. రాజయ్యా వంట త్వరగా కానివ్వు. వదినని కూడా మనతో తీసుకుపోదాం" అన్నాడు చంద్రశేఖరం.

సినిమా మాటవినగానే రాజయ్య ముఖం వికసించింది. ఎన్ని సంవత్సరాలైందో తను సినిమా చూసి. భార్య పోయిన తర్వాత తన దృష్టి అటు పోనేలేదు.

"అలాగే బాబుగారు. చిటికెలో చేసేస్తాం. అమ్మాయ్ చంద్రమ్మా. ఈరోజు వంట నిమిషాలమీద చేసెయ్యాలమ్మా" అన్నాడు ఉత్సాహంగా.

"దేనికి బాబాయ్" అన్నది చంద్రిక ఆశ్చర్యపోతూ.

"సినిమాకి తీసుకు పోతారట చినబాబుగారు మనల్ని అందర్నీ" అన్నాడు రాజయ్యా.

"ఓ. అదాసంగతి, అలాగేలే బాబాయ్" అన్నది చంద్రిక ఉల్లాసంగా.

"పద. పద. వంట పూర్తి చేద్దాం" అన్నాడు రాజయ్య.

"ఇప్పటినుంచేనా" అన్నది చంద్రిక.

"అవునమ్మా. త్వరగా పూర్తిచేస్తే నీవు తయారవు దువుగాని" అన్నాడు రాజయ్యా.

"అలాగేలే బాబాయ్"అంటూ చంద్రిక వంటపనిలో పడింది.

రాజయ్య ఉత్సాహంగా పనులన్నీ చకచక చేసేస్తున్నాడు.

"ఇక పూర్తయినట్లే చంద్రమ్మ తల్లీ. నీవు వెళ్ళి స్నానం చేసి బట్టలు కట్టుకొని తయారవు" అంటూ నుదిటి నుంచి కారే చమటల్ని అంగవస్త్రంతో తుడుచుకున్నాడు.

"నీవుకూడా తయారవు బాబాయ్" అన్నది చంద్రిక బుజాన టవలూ, చీరా, రవికా వేసుకొని సబ్బు చేతబట్టి వెడుతూ.

చంద్రిక తయారై వచ్చింది. తలలో రెండు గులాబీలు తురుముకుంది. వాలుజడ చివర రిబ్బన్ వ్రేలాడుతూంది. కళ్ళకు కాటుక, నుదుట పెద్ద కుంకుమ బొట్టు, వంటిన సాదా నేతచీర, అందుకు తగ్గ సాదా రవిక తొడుక్కొని ఉంది. లక్ష్మీ దేవి దిగివచ్చినట్లుంది. తెల్లటి మెడచుట్టూ నల్లటి పూసలు దండ అందంగా అమిరి ఉంది. నల్లటి పూసలమధ్య లక్ష్మి బొమ్మ వేసిన పచ్చటి బంగారుకాసు మెరుస్తూంది.

"ఈ చీరేనా. ఇంతకంటే మంచిది లేదూ" అన్నాడు రాజయ్య.

"ఊహూ. ఏ బాగా లేదా" అన్నది చంద్రిక చిన్న పుచ్చుకొని.

"బాగా లేకేం. కానీ మంచి చీర కట్టుకుంటే యింకా బాగుండేదానివి. నాకే యిలాంటి కూతురుంటే కొనిపెట్టక పోయానా" అన్నాడు రాజయ్య.

"కూతురున్నదంటివిగా రాజయ్యా" అన్నది చంద్రిక. ంటనే నాలిక కరుచుకుంది అలా పేరుపెట్టి పిలిచినందుకు.

"ఓ అదా. తమాషాకి అన్నాను. నీవుతప్పు ఎవరూ దు తల్లి. నిన్నుద్దేశించే అలా అన్నాను" అన్నాడు రాజయ్య.

"నువ్వింకా యిలాగే ఉన్నావేం బాబాయ్. బట్టలు మార్చుకోవూ" అన్నది చంద్రిక.

"ఒక్క క్షణంలో వస్తాను. నాదెంత పనీ" అంటూ రాజయ్య వెళ్ళాడు.

"రాజయ్య తాతా, త్వరగా రావాలి. టైమయి పోయింది" అంటూ హడావిడిగా వచ్చాడు చంద్రశేఖరం.

చంద్రిక ప్రక్కకి తప్పుకుంది.

రాజయ్య బట్టలు మార్చుకొని వచ్చాడు.

"జరీ బట్టలు కట్టాడే రాజయ్య తాత! ఇవేళ బయటికి తీశాడే. పెళ్ళి కొడుకులా ఉన్నావ్ తాతా" అన్నాడు చంద్రశేఖరం నవ్వుతూ.

"అలాగా బాబూ. నాదేం ఉంది. ఊరుపొమ్మం టున్నది. కాడు రమ్మంటున్నది. పదండి చినబాబూ. పెద బాబుగారు తయారైనారా" అన్నాడు రాజయ్య.

"ఆయన తయారవటమంటూ ఏమీ లేదు. ఎక్కడికి వెళ్ళినా ఒకటే డ్రస్సు. పదండి పదండి" అంటూ తను ముందుకెళ్ళి కారు సిద్ధంచేశాడు.

అంతా కారులో ఎక్కారు.

చంద్రశేఖరం గాలిలా రివ్వున పరిగెత్తించాడు కారుని. నల్లటి సిమెంటు రోడ్డుమీద జర్రున జారిపోతున్నది కారు.

కళ్ళు మూసి తెరిచే లోపల సినిమా హాలు ముందు ఆగింది.

చంద్రశేఖరం సుబ్రమణ్యం దిగి టిక్కెట్లు తీసుకొచ్చారు. అందరూ హాలులోకి నడిచారు. చంద్రిక ప్రక్కన సుబ్రమణ్యం, ఆ ప్రక్కనే చంద్రశేఖరం, ముసలాయన, రాజయ్య వరసలో కూర్చున్నారు.

అందరూ సినిమాలో లీనమైనారు.



# 12

లక్ష్మి ఇప్పుడు కాలేజీలో చేరింది. పట్నంలో హాస్టలులో ఉండి చదువుతున్నది.

లక్ష్మి వస్త్రాలంకరణలో చాలా మార్పులు వచ్చాయి. ఇదివరకే నాజూకుగా ఉండటానికి ప్రయత్నించేది. ఇపుడు మరీ అప్‌టూడేట్‌గా తయారవుతున్నది. కట్టూ, బొట్టూ, జుట్టులో, నడక తీరులో, హావభావ ప్రకటనలో అంతా అధునాతన పద్ధతులు అలవర్చుకుంది.

సన్నటి దేవతా వస్త్రాల వంటి బట్టలు ధరించి, చెవులకు రింగులూ, రెండు జడలూ, ముఖాన పెద్ద బొట్టూ ఆకర్ణాంతంగా తీర్చి దిద్దిన కాటుక రేఖలు, పెదవులకు లిప్‌స్టిక్‌తో రోజుకొక హెయిర్ స్టయిల్‌ని అనుకరిస్తూ తళుకు బెళుకుల్తో కాలేజీకి వెడుతుండేది. లక్ష్మికి చదువుమీదకన్నా అలంకరణ మీద శ్రద్ధ ఎక్కువ. గంటలకొద్దీ అద్దంముందు నిలబడి తయారయ్యేది. అందరూ తనని కాలేజీ బ్యూటీ అనక పోయినా కనీసం అసహ్యించుకోకుండా ఉండాలని తాపత్రయ పడేది.

హాస్టలు పిల్లలంతా గుంపులు గుంపులుగా చేరి జట్లు జట్లుగా కాలేజీకి వెడుతుంటే మొగపిల్లలుకూడా జట్లు జట్లుగ వెనక చేరి బాడీ గార్డ్సులా ఉపకరిస్తుండేవారు.

కాలేజీ గంటకొట్టారు. లక్ష్మి తోటి వారంతా క్లాస లోకి అడుగెట్టారు. లక్ష్మి హడావిడిగా క్లాసు కెడుతోంది చేతిలోని అందమైన పూసల పర్సు చల్లగ జారిపోయింది. లక్ష్మి చూచుకోలేదు.

"సారీ...మిస్. మీమ్మర్స్" అంటూ యువకుడు వెనకనే వచ్చి పిలిచాడు.

"ఛా. రాస్కెల్. ఎవరూ ?" అంటూ విసురుగా వెనక్కి తిరిగి ఉట్టి పుణ్యానికే అతని చెంపను చెయ్యాపరం చేసింది.

"చెంపకి చెయ్యి పరంబయి నప్పుడు దెబ్బ ఆదేశం బగు" అంటూ నవ్వుతూ చెంప తడుముకున్నాడు.

"ఆడవాళ్ళు కోపంలోకూడ అప్సరసల్ని మించి పోతారు సుమా. ఇంతవరకూ ఏమో అనుకున్నాను. నీ చేయి కందెనేమో చూడ నిమ్ము నెచ్చెలీ" అంటూ విరగ బడి నవ్వాడు.

లక్ష్మికి మతిపోయింది. తాను దెబ్బవేసినా 'ఈ రాస్కెల్' ఇంకా నవ్వుతున్నాడేమా అని బిత్తరపోయింది. కోపం కట్టలు తెంచుకుంది.

చర చర నడిచివెళ్ళి ప్రిన్సిపాల్‌తో రిపోర్టుచేసింది. కానీ అతని వివరాలు ఆమెకి తెలియవు.

లక్ష్మినిచూచి "కమిన్ ప్లీజ్, సిట్‌డవున్. వాటీజ్ ది మేటర్ మేడమ్" అన్నాడు ప్రిన్సిపాల్ లక్ష్మికి కుర్చీ చూపిస్తూ.

"సారీ సర్, ఒకతను నా వెంటబడి అసభ్యంగా ప్రవర్తిస్తున్నాడు. మీరు అతనిమీద చర్యతీసుకోవాలని నా ప్రార్థన" అంటూ చెప్పింది లక్ష్మి.

"ఓ ... అలాగా. అతని పేరూ, క్లాసు పేరూ వివరాలు యిస్తే తగిన యాక్షన్ తీసుకుంటాం" అన్నాడు ప్రిన్సిపాల్.

"సారీ, అతని వివరాలు నాకు తెలీవండీ. నేను క్రొత్తగా కాలేజీలో జాయిన్ అయ్యాను. ఇప్పుడే క్లాసు రూముకి వెడుతుంటే వెనకనుంచి గొడవచేస్తున్నాడు" అన్నది లక్ష్మి.

"అలాగా, వివరాలు తెలీందే ఎవరిమీద ఏక్షన్ తీసుకోమన్నారు. నో, సారీ. వీలుకాదండీ. ఎక్స్క్యూజు మీ. క్షమించండి అన్నాడు ప్రిన్సిపాల్.

లక్ష్మికి నవ్వువచ్చింది, ప్రిన్సిపాల్ తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ మాట్లాడుతుంటే. ఒకప్రక్క తను 'గ్రేడ్' తిన్నానే అన్న బాధ. ఎంత అవమానం. తన అసమర్థతకి అతగాడు యింకా రెచ్చిపోయి ఏమైనా చెయ్యవచ్చు. అతడి వివరాలు తెల్సుకోవలసింది.

"సారీ, క్షమించండి. అనవసరంగా మిమ్మల్ని కష్ట పెట్టాను. మీ టైము పాడుచేశాను" అన్నది లక్ష్మి క్షమా పణ చెప్పుకుంటూ.

"ఓ, ఫరవాలేదు. ఇటువంటి పొరపాట్లు జరుగుతూనే ఉంటాయి. క్లాసుకు వెళ్ళండి. మీ కాతని వివరాలు తెలిసి నప్పుడు రిపోర్టు చెయ్యండి మిస్" అన్నాడు ప్రిన్సిపాల్.

"మిస్, కాదండీ, మిసెస్" అన్నది లక్ష్మి లేస్తూ.

"ఓ సారీ, క్షమించండి మిసెస్. మిస్" అన్నాడు ప్రిన్సిపాల్.

లక్ష్మి నవ్వుకుంటూ లేచింది. అతని మతిమరుపుకీ, యదాలాపానికి నవ్వువచ్చింది.

"సార్, మే ఐ కమిన్ ప్లీజ్" అంటూ ఓ యువకుడు ప్రవేశించాడు. అతడు లక్ష్మిని ఢీ కొన్నాడు. లక్ష్మి చూడ లేదు; అతడూచూడలేదు.

లక్ష్మికి ఒళ్ళుమండింది. తలెత్తిచూస్తే అతను! 'ఎంత ధైర్యం! ఎందుకొచ్చాడు. తనమీద రిపోర్టుచెయ్యటానికి కాదుకదా! లక్ష్మి తెల్లబోయింది. తమాయించుకుంది. 'సారీ' అంటూ వెళ్ళబోయింది.

"సారీ! మీరు ఒకసారి ప్రిన్సిపాల్ దగ్గరికిరండి. మాట్లాడాలి" అన్నాడు ఆ యువకుడు.

"నేను దేనికీ? మాట్లాడేదేదో మీరే మాట్లాడు కోండి వెళ్ళి" అన్నది లక్ష్మి.

"అలాకాదు, ఈ విషయం మీకు సంబంధించిందే" అన్నాడు ఆ యువకుడు.

"సరే పదండి" అంటూ లక్ష్మి వెనక్కు మళ్ళింది.

"సార్! మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నందుకు క్షమించండి. నేను చెప్పిన యువకుడితనే" అంటూ కూర్చుంది.

"వాట్! యూ... యూ... వాట్ డు యు మీన్ బై దట్... వై ఆర్ యు వర్రీయింగ్ దట్ లేడీ" అంటూ లేచాడు ప్రిన్సిపాల్.

"సార్! ముందు నన్ను మాట్లాడనివ్వండి. ఆపైన నాది తప్పయితే శిక్షించండి. అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు యువకుడు.

ప్రిన్సిపాల్ తగ్గిపోయాడు. ఎస్, ఫస్టు టెల్ అజ్ వాట్ ది మాటర్ విత్ యు" అన్నాడు.

"సార్! ఆమె ముందు వెడుతోంది. నేను వెనక వెడుతున్నాను. ఆమె పూసల పర్సు క్రిందపడిపోయింది. ఆమెకి తిరిగి యిద్దామని ఆమెని మర్యాదగానే పిల్చాను. కానీ ఆమె వెనుతిరిగి విషయం తెల్సుకోకుండా వెంటనే చెంప దెబ్బ వేసింది. నేను చెప్పాలనుకున్న మాటలు వననే లేదు. నాకు మాట్లాడే అవకాశమే యివ్వలేదు. మీకు రిపోర్టుచేస్తానంటూ వచ్చింది. ఇప్పుడు చెప్పండి. ఇదిగోండి పర్సు. అది యీమె దవునో కాదో చెప్పమనండి. ఇప్పుడు నా తప్పేమిటో తెలవివ్వండి. శిక్షించండి. నా కభ్యంతరం లేదు. మీరే శిక్ష

విధించినా అనుభవిస్తాను” అంటూ ఒక ఫ్రాసల పర్సు తీ బల్లమీద పెట్టాడు.

“ఈ పర్సు మీదేనా? ఐ మీన్ ఈజిట్ ది పర్సు యు లాస్టు అండ్ ఈజిట్ ట్రూ దట్ యు లాస్టు ఎ పర్సు” అన్నాడు ప్రిన్సిపాల్.

లక్ష్మి ముఖాన కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు. ముఖం పాలిపోయింది, తడబడింది. మాట పెగిలి రాలేదు. అది తన పర్సే.

“సారీ సర్, మిమ్మల్ని అతన్ని అనవసరంగా బాధ పెట్టాను. ఆ పర్సునాదే. పర్సుపోయిన విషయం నాకింత వరకు తెలీదు” అన్నది లక్ష్మి.

“సారీ మిస్, మీరిలా దుడుకుగా ప్రవర్తించకూడదు. యు షుడ్ నాట్ రిపోర్టు అన్ అదర్సు అన్నెససరిలీ. యు ఆర్ టూ హేస్టు యిన్ యువర్ డెసిషన్స్. ఇలా అన్నానని కోపగించుకోకండి. ఇంక వెళ్ళండి. సారీ ఐ మేడ్ టు ట్రిబుల్ యు. యు కెన్ గో” అంటూ తన పనిలో నిమగ్నమైనాడు.

లక్ష్మి, ఆ యువకుడూ ప్రిన్సిపాల్ సంభాషణ తీరుకి నవ్వుకుంటూ బయటికి వచ్చారు.

“సారీ, మిమ్మల్ని అపార్థం చేసుకున్నాను. అనవసరంగా బాధించాను. నన్ను క్షమించండి” అన్నది లక్ష్మి తలవంచుకొని.

"దీనికేముందిలెండి. అయినా మీకు తొందరపాటు జాస్తి, విషయం తెల్సుకోకుండా కోపిస్తారు. ఇక క్లాసుకి పదండి" అన్నాడు ఆ యువకుడు ముందు నడుస్తూ.

"సారీ, మిస్టర్, మీ పేరు" అన్నది లక్ష్మి.

"నా పేరా ... చంద్రమోహన్" అన్నాడు యువకుడు వెనుదిరిగి.

లక్ష్మిముఖాన విచార మేఘాలు కమ్మేయి.

"ఏం అలా ఉన్నారే" అన్నాడు యువకుడు.

"ఏమీలేదు తలనొప్పిగా ఉంది" అన్నది లక్ష్మి పెదవులపై నవ్వు బలవంతాన తెచ్చిపెట్టుకుంటూ.

"అవును. మీరు యితరులకి తలనొప్పి తెప్పిస్తారు. స్వయంగా మీకు మీరే తలనొప్పి తెప్పించుకుంటారు" అంటూ నవ్వాడు.

లక్ష్మి క్లాసులోకి వెళ్ళబోయింది.

"పోని శలవుపెట్టి యింటికి తిరిగెళ్ళండి. మీరు లేచిన వేళ మంచిది కానట్టుంది" అన్నాడా యువకుడు.

లక్ష్మికి నవ్వు వచ్చింది. "నేను లేచిన వేళ మంచిదే. మీరు లేచిన వేళ మంచిది కానట్టుంది. ఉత్తపుణ్యానికే చెంప దెబ్బ తిన్నారు" అన్నది.

"అహా. లేనిపోని అపోహలతో నేరారోపణచేసి అవమానించబోయి మీరే అనుమానానికి గురైనారు. అందుకని అన్నాను. క్షమించండి" అంటూ క్లాసులోకి వెళ్ళాడు.

లక్ష్మికూడా వెళ్ళి తన సీట్లో కూర్చుంది.

"లేట్ కమింగ్ ఈజ్ మోడ్రన్ ఫేషన్" అంటూ వెనకనించి గొణిగాడో విద్యార్థి.

లక్ష్మి ముఖం చిట్లించి తలవంచుకుంది. మనస్సు క్లాసు పాఠాలమీద లగ్నంకాలేదు. ఆ రోజు సంఘటనే మాటి మాటికీ తలపుకొస్తున్నది.

"పేరు చంద్ర మోహన్‌ట. చాలా బాగుంది. తన భర్తపేరు రామచంద్రం. ఆయన కూడా ఈ పేరు పెట్టుకుంటే బాగుంటుంది. ఆయన అందానికి తగిన పేరు...ఛీ...ఛీ... ఏమిటీ ఆలోచనలు" అంటూ తన పైన తనే విసుక్కుంది లక్ష్మి.

భర్త ఏం చేస్తుంటాడు? స్కూల్లో తమబోటి విద్యార్థులకూ, విద్యార్థినులకూ పాఠాలు చెప్తుంటాడు. ఆయన కొంపతీసి ... ఏ విద్యార్థిని పైనో ... మనస్సు నిలుపుకుంటే ... తను అసలే లేదు ... ఏమైనా కావచ్చు. ఛీ. ఏమిటీ ఆలోచనలు...ఆయన అటువంటి వాడుకాడు. కాడని ఎలా నమ్మకం? తనింత దూరం రావటానికి ఆయన ప్రవర్తనేగా కారణం! ఆయన ప్రవర్తనలో ఎలాంటి లోటూ లేక పోతే హాయిగా చిలుకా గోరువంకల్లా ఉండక పోయారూ! ఆయనకీ...తన తోటి కోడలికీ...ఛీ...ఎంతవరకు నిజమో ...తనవన్నీ అనుమానాలే కావచ్చు. అదెలా సంభవం? తనని అలక్ష్యం చేశాడే. ఏమీ కారణం లేకపోతే ఆయనెందుకలా ప్రవర్తించాలి? 'చంద్రమోహన్' చూడు. తనతో

ఎంత ఉల్లాసంగా, ఉత్సాహంగా మాట్లాడుతాడు. మాటి మాటికీ గలగలా ఎలా నవ్వుతాడో! ఆయనో! ఆయన అన వసరంగా నవ్విన ఘట్టం తనకి జ్ఞాపకం లేదు. ఎంతో నవ్వు వచ్చే సంఘటనైతే చిరునవ్వు ఒలకబోస్తారు. ఆ నవ్వు విచ్చీ, విచ్చని మొగ్గలా అందంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. అసలు నవ్వుతున్నట్లు కనుక్కోవటం కష్టమే. తనతో చను వుగా మాట్లాడేది చాలా అరుదు. అసలు అతిగా మాట్లాడే అలవాటాయనకు లేదు. ముక్తసరిగా, ముద్దుగా, ముచ్చటగా మూడు మాటలు మాట్లాడతాడు. అక్కడికే గొప్ప.

ఇతనో "కదిలిస్తే చాలు. సెల ఏరులా అతని వాగ్ధో రణి ప్రవహిస్తుంది. అడ్డు కట్టు వేస్తే తప్ప ఆగదు. వీరిద్దరికీ ఎంత తేడా? భర్త అంత అందగాడు కాకపోయినా మొత్తా నికి అందగాడే. నలగని ఖరీదైన సూట్లు. వాడని పువ్వులా ఉంటాడు. భర్తో! తెల్లని మల్లెపూవు వంటివాడు. ఎప్పుడూ తెల్లటి బట్టలే వేస్తాడు. చాలా సాదావి. అతి చౌక రకం. కానీ ప్రత్యేకంగా కనిపిస్తాయి. అతని ఒంటికి అతుక్కుపోయి నట్లుంటాయి. ఆడంబరంగా కనిపించవు.

ఏమిటీ పోలికలు. ఇత నెలా ఉంటేనేం? తనకెందుకు? భర్త విషయం మాత్రం. ప్రస్తుతం - అతనికీ తనకూ మధ్య అంతులేని అగాధాలు ఏర్పడ్డాయి. ఆ అగాధాలు కల్పించిం దెవరు? అతనా? తనా?

లక్ష్మి తల గట్టిగా నొక్కుకుంది. ఈ ఆలోచన్లనుంచి బయట పడాలని ప్రయత్నంచేసి విఫలురాలైంది.

ఇంతలో గంట కొట్టారు. లక్ష్మి ఉలిక్కిపడి మళ్ళీ లోకంలోకి వచ్చింది.

క్లాసునుంచి బయటికి నడిచింది. తల భారంగా ఉంది. ఏం చెయ్యాలి? ఈరోజు తన మనస్సు క్లాసు పాఠాలమీద లగ్నం కావటంలేదు. మనస్సు వికలమైంది.

మళ్ళీ క్లాసుకు వెళ్ళబుద్ధి కాలేదు. పోనీ హాస్టలుకు వెడదామా అనుకుంది. కానీ తోచదు.

పబ్లిక్ గార్డెన్సు తానింతవరకూ చూడలేదు. పోనీ అటు వెడదామని నిశ్చయించింది. ఆ వుద్దేశ్యంతోనే బస్సు స్టాపుకి నడిచింది. వెధవ బస్సులు వచ్చేవీ, పొయ్యేవీ కని పిస్తున్నాయి కానీ ఖాళీ మాత్రం శూన్యం. ఫుట్‌బోర్డుమీద నిలబడి చువ్వలు పట్టుకు వేలాడుతున్నారు అనేకులు.

రిక్షా మాట్లాడింది. ఎక్కికూర్చుంది. రిక్షా దిగి పర్సు లోంచి డబ్బులు తీసియిస్తున్నది. 'హలో' అన్న పిలుపుతో తలెత్తి చూచింది. అతనే! చంద్రమోహన్. దేనికి వచ్చి నట్లు? తనని వెంటాడుతున్నాడా? తనని హేళన చెయ్య టానికి వచ్చాడా? తనని అవమానిస్తాడా? ఒంటరిగా ఉంటుంది కదా పగ తీర్చుకుందామని వచ్చాడా? ఎలాంటి దురుద్దేశ్యం లేందే అతడు తన వెంట రావలసిన అగత్య మేమిటి? అసలు తనిలా బయలుదేరినట్లు అతడికెలా తెలుసు? రిక్షాలో ఎక్కి హాస్టలుకి వెళ్ళిపోతే! ఛ! ఛ! ఇంత చదువుకొని ఒక మగవాడికి భయపడటమా? అందులో

ట్టపగలు! నట్టనడిబజారు. పైగా వచ్చింది పబ్లిక్ గార్డెన్సుకి. ంతోమంది జనం ఉంటారు. తనకి భయమేమిటి? పోలీసు ాపలా ఉండనే ఉంటుంది. అంతగా అవసరమైతే వారి హాయం అర్థించవచ్చు.

తన ఊహాలకి తనకే నవ్వొచ్చింది. తన నీడనుచూచి తానే భయపడే రకమా తను? అంత పిరికి పందా తను?

లక్ష్మివంకే చూస్తున్న చంద్రమోహన్ "అదేమిటి? మీలో మీరు నవ్వుకుంటున్నారు! లోకులు చాలా చెడ్డవారు సుమా. పిచ్చిదానివని అనుకోగలరు" అన్నాడు నవ్వుతూ.

"ఆ! ఏమిటి? నేను నవ్వలేదే! సరే! ఆ సంగతి అలా వుంచండి. మీరిక్కడ కూడా ప్రత్యక్షమయ్యారేం? విశేష మేమిటో" అన్నది ఓరగా చూస్తూ.

"విశేషాలూ, సశేషాలూ ఉండనే ఉంటాయి. దానికేం గాని, మీరు వెళ్ళిన చోటికి మరెవ్వరూ వెళ్ళగాదని నిబంధన ఉన్నదా? ఏదైనా ఆర్డర్ పాస్ చేయించారా? నాకు తెలిసినంతవరకూ అలాంటిది వినలేదు. ఉంటే చెప్పండి వెడతాను" అంటూ విరగబడి నవ్వాడు.

"అంత నవ్వు దేనికి వస్తుందో మీకు? రాకూడదని కాదు. వెంటనే యిక్కడికి కూడా వస్తే; ఏమైనా విశేషాలున్నాయేమో నని" అన్నది లక్ష్మి ముఖం చిట్లించి.

"విశేషా లేమీ లేవు. ఈ రోజు మీకు నాకుకూడా తలనొప్పి తెప్పించారుగా. అందువల్ల క్లాసుపాఠం రుచించక

అలా గాలికి తిరిగి వద్దామని బయలుదేరాను. చల్లటి వృక్షాల నీడల్లో పచ్చిక మీద పయనిస్తే వంటికీ, మనస్సుకీ హాయిగా ఉంటుంది. నాకు సహజంగా అలాంటివే యిష్టం. మనస్సు బాగా లేనప్పుడల్లా క్రిష్ణ ఒడ్డుకు వెళ్ళటమో, యిలా పార్కుకి రావటమో అలవాటు. చెదిరిన మనస్సును కూడదీసుకోవటానికి ప్రశాంత వాతావరణం ఎంతైనా అవసరం. మనస్సూ ప్రకృతీ కలిసి ఉల్లాసంగా ఉయ్యాల లూగుతాయి. దానితో సయ్యాట లాడుతాయి. ప్రకృతిలో లీనం కావటం నాకెంతయినా యిష్టం. ఒక మంచి నవల, ప్రశాంతవాతావరణం, చక్కటి ప్రకృతి దృశ్యాలూ, తినటానికి మంచి టిఫిన్, త్రాగటానికి కాఫీ, సిగరెట్లూ ఉంటే నాకింక ఈ ప్రపంచంతోటి ఎలాంటి సంబంధమూ అక్కర్లేదు. నన్ను నేను మర్చిపోగలను. ఇతరులని మించిపోగలను" అన్నాడు చంద్రమోహన్

"ఇది బహిరంగ స్థలమనీ, నలుగురూ తిరిగే బాట అనీ మర్చిపోయినట్లున్నారు. ఆవేశంగా మాట్లాడేస్తున్నారు. అలా ఆ చెట్టుక్రింద కూర్చుందాం పదండి." అన్నది లక్ష్మి. తను ముందుగా వెళ్ళి పచ్చికమీద చేరగిలబడి చేతిలో పుస్తకాలు ప్రక్క వడవేసింది. ఆమెకి అల్లంత దూరంలో చంద్రమోహన్ పచ్చికమీద వెల్లకిలా పడుకున్నాడు.

"ఎంత బాగుందీ. ఎప్పుడూ యిల్లాగుంటే నాకెంతో ఆనందం. ఎండాకాదు, వానాకాదు. మూగ ఎండలో చల్లని పిల్లవాయువులు చక్కలిగింతలు పెడుతుంటే, ఫౌంటెన్లోని

నీరు ఆకాశంలోకి ఎగిరి క్రిందపడుతుంటే చక్కని పూలచెట్లు గాలికి వయ్యారంగా తలలూపుతుంటే, పూలకన్నియలు ఆకుల చాటునుండి తొంగిచూస్తుంటే, సీతాకోకచిలుకలూ, తుమ్మెదలూ ఒకచెట్టునుండి మరోచెట్టుమీద వాలుతుంటే, చెట్టుమీద పిట్టల కల కల ధ్వనులను చెవియొగ్గి వింటుంటే ఎంత ఆహ్లాదంగా ఉంటుంది" అన్నాడు కళ్ళుమూసుకొని.

లక్ష్మి గల గల నవ్వింది.

"దేనికీ అలా నవ్వుతున్నారు" అంటూ దిగ్గునలేచి కూర్చున్నాడు చంద్రమోహన్.

"దేనికా, మీ కవిత్వ పైత్యానికి. కళ్ళుమూసుకొని కలలు కంటుంటేను. ప్రకృతి దృశ్యాలు ప్రత్యక్షంగా అనుభవంలో ఉంటే వాటినిచూచి ఆనందించకుండా, కళ్ళుమూసుకొని పడుకొని వాటి అందచందాలని వర్ణించి మీలోమీరే ఆనందిస్తుంటే మీ వికారానికి నవ్వువచ్చింది" అన్నది లక్ష్మి మళ్ళీ నవ్వుతూ.

"ఓస్, అంతేనా ? నేనింకా ఏమిటో అనుకున్నాను. కళ్ళుతెరచి చూస్తే కనుపించేది బాహ్యసౌందర్యమే. దాని కంటే కళ్ళుమూసుకొని ఊహిస్తుంటే ఆ ఆలోచన్నలోని తియ్యదనం మీకేంతెలుసు ? చూచి ఆనందించేకన్నా చూడకుండా ఊహించితే కలిగే ఆనందం హెచ్చు" అన్నాడు చంద్రమోహన్.

"ఇంకేం, భోజనం చెయ్యటం మానండి. మంచి బట్టలు వేసుకోవటం మానండి. చదవటం మానండి. రేపు

ఉద్యోగం చెయ్యటం మానండి. అంతా యింటి దగ్గర పడు కొని ఊహించుకోండి. అంతులేని ఆనందం కల్గుతుంది. దేని కీ లేనిపోని శ్రమ. పాపం, యింత దూరం పనిగట్టుకొని చదువు నిమిత్తమని పడుతూ, లేస్తూ రావటం ?" అన్నది లక్ష్మి హేళనగా నవ్వుతూ.

"మీరన్నమాటా నిజమే. నిజంగా ఊహించి నవ్వు డున్న ఆనందం ప్రత్యక్షంగా దాన్ని అనుభవిస్తున్నప్పు డుండదు. ఇదేకదా అన్న తేలికభావం కల్గుతుంది. చిటారు కొమ్మన మిఠాయిపొట్లం చూస్తే నోరూరుతుంది. దాని కొరకు ఆశతో ఒళ్ళంతా కళ్ళుచేసుకొని చూస్తాం. ఎగిరెగిరి పడతాం. అందులోనే ఎంతో ఆనందం ఉంది. అదే ఎలాంటి శ్రమా లేకుండా మనచేతిలో ఉంటే అంతరుచిగా ఉండదు. పైగా చప్పగాఉన్నట్లు బాధపడతాం. మానవనైజమే అది" అన్నాడు చంద్రమోహన్.

"మీ మెట్ట వేదాంతం వినటానికి రాలేదు. కాసేపు అలా తిరిగి మనస్సుకి ఉల్లాసం కలిగించుకోవాలని వచ్చాను. కాసేపు తిరిగివద్దాం వస్తారా" అన్నది లక్ష్మి.

"నేనెందుకూ ? అలా తిరిగిరండి. తిరగటంకంటే ఒక చోట కూర్చుని చూస్తుంటేనే నాకెక్కువ ఆహ్లాదం కలుగు తుంది" అన్నాడు చంద్రమోహన్.

"అల్లాగా. సరే, అయితే యిక్కడే ఉండండి. నేను వెడుతున్నాను" అంటూ లేచి చీర దులుపుకొని పుస్తకాలు చేతబట్టింది. లక్ష్మికి తెలీకుండానే కోపం ముంచు

కొచ్చింది. మనస్సుకి కష్టంతోచింది. అతను అడగ్గానే లేచి రాలేదే అన్న బాధ కల్గింది. తనంటే ఆ మాత్రం గౌరవం లేదే అని బాధ కల్గింది.

ఇంతవరకూ అతను తనని వెంబడిస్తున్నాడని విసుక్కుంది. సణుక్కుంది. గొణుక్కుంది. కోపగించుకుంది. కానీ యిప్పుడు అతను తను చెప్పినట్లల్లా చెయ్యటంలేదే అని బాధ పడుతోంది.

మనస్సు చాలా విచిత్రమైంది. ఒక క్షణంలో ఉన్న భావం మరో క్షణంలో నిలవదు మనసు చాలా దుర్బలమైంది గాలి తాకిడి ఎటు బలంగా ఉంటే అటువైపు మొగ్గుతూ ఉంటుంది. మనస్సు కళ్ళెంలేని గుఱ్ఱంలాంటిది. దానికి పూర్తి స్వేచ్ఛనిస్తే విశృంఖలంగా తిరిగి వస్తుంది. ముళ్ళకంచెల్లోకి, గతుకులలోకీ, గుంటల్లోకి, మెట్ల మీాదికి గమ్యంలేకుండా, బాటలేకుండా తిరిగి చెడిపోతుంది. అనేక కష్ట నష్టాలకు గురి అవుతుంది మనసూ అంటే దాన్ని ఎప్పుడూ అదుపులో పెట్టితే తప్ప ఎప్పుడూ జాగురూకతతో, మెళుకువతో ఉంటేతప్ప సరైన దోవన నడవదు. కాస్త అజాగ్రత్త, ప్రమత్తత, నిర్లక్ష్యత చూపిస్తే వెంటనే ప్రక్క దోవలు త్రొక్కి ముళ్ళ డొంకల్లోకి ఈడ్చుకెళ్ళి పడేస్తుంది. పడేటప్పుడు ముళ్ళ డొంకలో ప్రయాణించే టప్పుడూ స్పృహ కలుగదు. తీరా ఆ ముళ్ళమీాద పడిపోయాక, ముళ్ళన్నీ శరీరం నిండా గుచ్చుకున్న తరువాత, వాటివల్ల శరీరానికి బాధ కల్గిన తర్వాత, గాయాలు తగిలి రక్తం చిమ్మిన తర్వాత

స్పృహ కలుగుతుంది. కానీ అప్పటికి పుణ్యకాలం కాస్తా గడిచిపోతుంది. వెనక్కి తిరిగిపోవటానికి గానీ ముందుకి సరైన బాటన నడవటానికి కానీ మార్గం కనిపించదు అంతా అయోమయంగా, గందరగోళంగా ఉండి అసలే అలిసి సొలిసి సోలిపోయిన మనస్సును మరింత ఉక్కిరి బిక్కిరి చేసి, ఊపి రాడనివ్వక చిరాకుగా ఉన్న మనస్సుని మరింత చికాకు పరుస్తుంది. అందుకే దాన్ని ఎప్పటి కప్పుడు కనిపెట్టి ఉంటూ దాన్ని సక్రమ మార్గంలో నడిపించాలి. అంకుశమనే ఆత్మ విమర్శ ఉంటే తప్ప, మావటీడనే బుద్ధి మనస్సు మీద స్వారి చేస్తే తప్ప, అధికారంలో అదలిస్తే తప్ప మనస్సనే ఏనుగు సక్రమ మార్గంలో నడవదు. సరైన మావటీడు, మంచి అంకుశం దెబ్బలేకపోతే ఆ మనస్సనే ఏనుగు హృదయమనే తోటని ఛిన్నాభిన్నం చేసి చిందరవందరచేసి మానస సరోవరంలోని నీళ్ళని కెలికి బురదమయం చేస్తుంది.

అందువల్ల ఎప్పుడూ మనస్సుని ఆత్మపరీక్ష అనే అంకుశంతో పొడుస్తుండాలి. అప్పుడే అది సరైన బాటలో వెడుతుంది. మనస్సు బాట తప్పితే భావి జీవితమనే నందన వనం సర్వనాశనమవుతుంది. చేరవలసిన గమ్యం గగన కుసుమ మవుతుంది. గతుకుల బాటన వెడితే అతుకుల జీవితం అనుభవంలోకి వస్తుంది. పరిశ్రమ ననుసరించే ఫలం ఉంటుంది. కర్మ ననుసరించే జన్మ నడుస్తుంది.

లక్ష్మికి హఠాత్తుగా స్పృహకల్గింది. అతడు తన వెంట రాకపోతే తనకి నష్టమేమిటి? అసలు అతనెవరు?

తనెవరూ? తను చెప్పినట్లల్లా వినవలసిన అగత్యం అతని కెందుకున్నది?

ఇంకతనిక్కడ ఉండకూడదు. ఒంటరి తనం అనేక అనర్థాలకి మూలం. సోమరి తనం మనస్సుకి మంచిది కాదు. కలుపు లేచినట్లు అనేక వికృతమైన ఆలోచనలు మానసోద్యానవనంలో కుక్క గొడుగుల్లా క్షణంలో తలెత్తుతాయి. ఆ కలుపుని ఎప్పటి కప్పుడు పెరికివేస్తే తప్ప నందన వనంలాంటి మనస్సు స్వచ్ఛంగా, సుందరంగా ఉండదు. కలుపు మొక్క లున్నచోట ఖరీదైన మొక్కలు చేవగా, ఏపుగా పెరగవు. బలాన్నంతా కలుపు మొక్కలే కడుపున పెట్టుకుంటాయి. అందువల్ల మంచి మొక్కలు చచ్చిపోయే ప్రమాదం కూడా ఉంది. అందుకే కలుపును తీసివేస్తుండాలి. అప్పుడే సద్భావాలనే చక్కని మొక్కలు చక్కగా పెరిగి మంచి పువ్వులు పూసి సుగంధ పరిమళాలతో చుట్టు ప్రక్కల వారికి హాయిని కలిగిస్తాయి. ఈ ఊహాలతో చకచకా పార్కుగేటు దగ్గరికి వచ్చింది.

“నామీద అలిగి నా నుండి తొలిగి పోతున్నట్లున్నారే. నేను రాలేదనే నాకోపం. కోపగించటం చాలా పాపం. తన కోపమే తనశత్రువన్న... సామెత విన్నారో లేదో” అన్నాడు చంద్రమోహన్ నవ్వుతూ.

“కోపం లేదు తాపం లేదు” అన్నది లక్ష్మి రిక్షా కోసం నిరీక్షిస్తూ.

"అలాగా కోపం, తాపం లేకపోతే, పరితాపం, సంతాపం, విలాపమూ ఉన్నాయా?" అన్నాడు చంద్ర మోహన్.

"హాస్యానికి హద్దుంది మిష్టర్..." అంటూ ఆగి పోయింది లక్ష్మి.

"మోహన్" అవునా? నా సహకారం మీ కెల్ల ప్పుడూ ఉంటుంది. చివరికి మాటలు అందించటంలో కూడా... ఏమంటారు?" అన్నాడు చంద్రమోహన్.

"నా ముఖంలా ఉంది. మీ సహకారం వద్దూ, ఉప కారం వద్దు, దయచేయండి" అన్నది లక్ష్మి విసుగుతో.

"పోనీ ఉపకారం, సహకారం అక్కర్లేకపోతే అప కారం చెయ్యమంటారా?" అన్నాడు సీరియస్ ముఖంపెట్టి.

"ఆ. చెయ్య తల్చుకుంటే చెయ్యండి. నా కెలాంటి అభ్యంతరమూ లేదు" అంటూ దారినపొయ్యే రిక్షా ఆపి ఎక్కి కూర్చుంది.

"చిత్రంగా ఉందే. మగువల మనస్సు మంచుపొగ లాంటిది. దట్టంగా కమ్ముకుంటే అవతల అంతా అంధకారం. కన్ను పొడుచుకున్నా అవతల ఏమున్నదీ కనిపించదు. ఆ మంచు తెర క్షణంలో యిట్టే విడిపోతుంది. చూద్దామన్నా కనిపించదు మంచు. అప్పుడు సూర్యుడు స్వచ్ఛంగా కని స్తాడు. అటువంటిదే స్త్రీ బుద్ధి" అనుకుంటూ మరో రిక్షా ఎక్కి మాయమయ్యాడు.

---

# 13

తెల్లవారిం తరువాత ఆవులించుకుంటూ ఒళ్ళు విరుచుకుంటూ 'రామనామ' స్మరణచేస్తూ లేచింది అలివేలు.

'ఒసే చంద్రా' అంటూ తన అలవాటు ప్రకారం ఒకసారి కేకేసింది.

'ఏమిటి అత్తయ్యా' అంటూ ఎవరూ పరుగు పరుగున రాలేదు.

అలివేలు మనస్సు భగ్గున మండింది. చంద్రిక ఎప్పుడూ తనని అలక్ష్యంచేసి ఎరుగదు. పిలవంగానే ఎంత ముఖ్యమైన పనిలో ఉన్నా ఎదుట హాజరవవలసిందే. అలాంటిది నేడు ఎంత పిలిచినా పలకదేమని ఆశ్చర్యపోయింది. దానితో బద్ధకం కాస్తా వదిలిపోయింది.

వంటింటివైపు వెళ్ళింది అలివేలు. వంటింటి గొళ్ళెం అలాగేఉంది. దొడ్డితలుపువైపు వెళ్ళింది. అదీ అలాగే మూసి ఉంది. ఏమిటి చెప్మా? చంద్రిక ఎందుకు లేవలేదు. ఎంతో ప్రొద్దుండగానే లేచి పనులన్నీ చకచక చేసేపిల్ల యింత వరకూ లేవకపోవటానికి కారణం? ఒకవేళ ఒంట్లోగానీ బాగా లేదేమో. వెళ్ళిచూస్తే మంచిది. ఇలా ఆలోచించిన అలి

వేలు చంద్రిక వాళ్ళ పడక గది దగ్గిరికి వెళ్ళింది. తలుపు జేరవేసిఉంది. తలుపు నెట్టటం బాగుండదేమోనని సందేహించింది. తలుపుమీద 'అమ్మాయ్ చంద్రా' అంటూ మెల్లగా కొట్టింది.

'ఉహూం' ఎలాంటి సమాధానం లేదు. దానితో కోపం రెచ్చిపోయి తలుపు పెద్దగా బాదింది. అందుకు సమాధానం శూన్యం. తలుపులు మాత్రం ఆ విసురుకు భళ్ళున తెరుచుకొని వెళ్ళి గోడకి కొట్టుకున్నాయి. గది ఖాళీ! ఇద్దరూ ఏమైనట్లు?

అలివేలు కాళ్ళక్రింద భూమి కదిలిపోతున్నట్లు భ్రమించింది. నిలబడలేక పోయింది. ఏమైనా రిద్దరూ?

గోడపట్టుకొని అలాగే నిలబడింది. తూలిపోయేట్టుంది శరీరం.

'అమ్మా, ఇవాళఎవరూ లేచినట్టు లేదే' అంటూ రామచంద్రం వచ్చాడు. వచ్చి తల్లి స్థితి చూచాడు. చూచి నిశ్చేష్టుడైనాడు. తల్లి అయోమయ పరిస్థితికి కారణం తెలీలేదు.

'అమ్మా. ఏమిటీ - అలా వున్నావేం? ఏం జరిగింది' అంటూ ప్రశ్నించాడు.

"ఇంకా జరిగేదేముంది? అన్నయ్యా, వదినా కనిపించటములేదు" అన్నది అలివేలు నూతిలోనుంచి మాట్లాడినట్లుగా. తలని రెండుచేతుల్తోనూ పట్టుకొని కూలబడింది.

"అవునమ్మా, నే నప్పుడే అనుకున్నాను. నీవు చేసింది మంచిపని కాదమ్మా. వదిననీ, నన్నూ నిష్కారణంగా ... అనుమానించారు మీరంతా. ఆవిడకి ఆ విషయం తెలిసింది గాబోలు. వెళ్ళిపోయింది. ఇద్దరూ కనపడటంలేదుగాబట్టి వదిన ఎలాంటి అఘాయిత్యమూ చెయ్యలేదని రూఢి అవుతోంది. కూడా అన్నయ్యని వెంటబెట్టు కెళ్ళింది గాబోలు" అన్నాడు రామచంద్రం నిశ్చలంగా, నిబ్బరంగా.

ఇంత ఘోరం జరిగినా యింకా నిశ్చలంగా ఎలా ఉన్నాడో? అలివేలు ఆశ్చర్యపోయింది ఈ అనర్థాలన్నిటికీ కారకులు ఎవరు? తప్పు ఎవరిది? తనదే? గుట్టుచప్పుడుగా జరిగే కాపరం నేడు వీధిపాలైంది. ఛీ ... ఛీ ... తను బ్రతికుండగానే యింత ఘోరమా? తనింకా బ్రతికి దేనికి?

"ఏమిటీ ... అలా విచారపోతున్నావు? ఏంజరిగింది?" అంటూ వెంకటాచారి వచ్చాడు.

"ఏముందీ? వదినా, అన్నయ్యా పరారయ్యారు" అన్నాడు రామచంద్రం.

"ఆ! దేనికీ" అన్నాడు వెంకటాచారి విచారపడుతూ.

"దేనికేమిటి? వదిన అపనిందలు భరించలేక వెళ్ళిపోయింది. దీనికంతా కారణం నేనే" అంటూ తల వంచుకున్నాడు.

"అపనిందలా? దేనికీ? నీవెలా కారణమైనావు?" అన్నాడు వెంకటాచారి. ఇంతవరకూ యింటి సంగతులు

పట్టించుకోని ఎరగడు. ఏ విషయమూ తీవ్రంగా తీసుకోడు. తేలిగ్గా కొట్టిపారేస్తాడు. అసలతనికి తీరికా లేదు. ఎప్పుడూ ఎలా డబ్బు కూడపెట్టటమా, ఎలా సంసారాన్ని బాగు చెయ్యటమా అనే ఆలోచనతప్ప, యింట్లో ఏంజరుగుతున్నది, ఎలా తింటున్నారు, ఎలా బ్రతుకుతున్నారు, అంతా కలిసి మెలిసి ఉంటున్నారా లేదా అనేదేమీ లేదు. చిన్నకోడలు వెళ్ళిపోయినప్పుడూ అంతే. ఇప్పుడూ అంతే. అయితే దాని కంటే యిది పెద్ద దెబ్బ. పిల్లల తగాదాల్లో తలదూర్చటం అంత బాగుండదనీ, వాళ్లే సరిపెట్టుకొని మళ్ళీ కలుస్తారనీ ఆయన ఉద్దేశ్యం. అందుకే ఏ విషయమూ సామాన్యంగా భర్తతో ప్రస్తావించదు అలివేలు. ప్రస్తావించినా ఆయన సమాధానాలు ఎవరికీ రుచించేవికావు.

కానీ నేడు పెద్దకొడుకూ, కోడలూ మాయమవటంతో కొంత ఆశ్చర్యపోయాడు. మరికొంత బాధ పడ్డాడు.

'అసలు దీనికంతా మూలం ఎవరు ? ఏమిటీ కథ' అన్నాడు వెంకటాచారి గంభీరంగా.

'నేనేనండీ నాన్నా. ఎలాచెప్పాలో నాకు తెలీకుండా ఉంది. దీనికంతా లక్ష్మి పుట్టింటికి వెళ్ళటం మూలం. అప్పటి నుంచీ అనర్థాలు వాటిల్లుతూనే ఉన్నాయి' అన్నాడు రామ చంద్రం.

"మరి నీవువెళ్ళి ఎందుకు తీసుకొచ్చావు కావు. నాతో ఎందుకు చెప్పలేదు ?" అన్నాడు వెంకటాచారి.

"ఆవిడ నామీద నిష్కారణంగా అనుమానాలు పెంచుకొని వద్దన్నా వినకుండా వెళ్ళింది. అందువల్ల తీసుకు రాలేకపోయాను" అన్నాడు రామచంద్రం తప్పు తనది కాదన్నట్లు.

"అసలు అనుమానాల్ని యింతవరకు పెంచింది దేనికే? మొదట్లోనే తుంచేయవద్దా? అది రెండు కాపరాల్ని నాశనం చేసింది. కుటుంబ గౌరవాన్ని మంటగలిపింది. పెద్దల గౌరవ మర్యాదల్ని బజారుపాలు చేసింది. చిన్నవాళ్ళకి మీకివన్నీ ఏం తెలుస్తాయి? ఇటువంటి విషయాలు పెద్దలతో సంప్రదించి వాళ్ళ సలహాలు పాటించవద్దా? మా అనుభవం దేనికి, మీ కుపయోగపడని తర్వాత?" అంటూ వెంకటాచారి విసుక్కున్నాడు.

"అటువంటి పరిస్థితుల్లో ఎవరైనా అలాగే ప్రవర్తిస్తారు నాన్నారూ. మీరైనా అంతే" అన్నాడు రామ చంద్రం.

"అఘోరించావ్. అయినా ఆ పిల్ల పుట్టింటి కెడితే మాత్రం? ఆపిల్ల తల్లిదండ్రులకి బుద్దెలా లేదు? ఇంట్లో పెట్టుకొని ఏంచేద్దామని" అన్నాడు వెంకటాచారి.

"ఆవిడ అక్కడ లేదట. పట్నంలో చదువుకుంటున్న దని విన్నాను" అన్నాడు రామచంద్రం.

"అఘోరించక పోయిందీ. మొగవాళ్ళు చదివి ఉద్ధ రించారు. ఇక ఆడవాళ్ళు చదివి ఉద్ధరిస్తారు. మొగుడ్ని తన

వాడ్ని చేసుకోని కాపురం చెయ్యలేని ఆడది ఊళ్ళేలుతుందా ? ఎవర్ని సంతోషపెట్టను. ఏం ఘనత సంపాదించటానికి" అన్నాడు వెంకటాచారి.

"చదువుకోవటం తప్పంటే నేను ఒప్పుకోను. చదువుకోవటంలోనూ, చదువుకోక పోవటంలోనూ లేదండీ నాన్నగారు. పువ్వు పుట్టంగానే పరిమళిస్తుందని, మనిషి పుట్టినప్పటి నుంచీ వాళ్ళ వ్యక్తిత్వం బట్టబయలవుతుంది. అందుకు పరిస్థితులు కూడా తోడైతే అది మరీ విస్పష్టంగా తెలుస్తుంది" అన్నాడు రామచంద్రం.

చదువు సంధ్యలు మనిషికి మంచిచెడ్డలు తెలుసుకోవటానికి ఉపయోగపడటానికేనా ? మరెందుకైనానా ?" అన్నాడు వెంకటాచారి.

"ఈ చదువులు చదివి మంచి చెడ్డలు నేర్చుకున్నవారెవరూ లేరు నాన్నా. కేవలం పొట్ట కూటికొరకే—" అన్నాడు రామచంద్రం.

అలా అయితే ఆడవాళ్ళకెందుకు చదువులు ? సంపాయించేవాడు మగవాడు. తిని యింట్లో కూర్చోలేక వేలు వేలు తగలేసి చదవటం దేనికీ" అన్నాడు వెంకటాచారి.

ఈ రోజుల్లో ఒక్కళ్ళు సంపాయిస్తే కుటుంబ పోషణ జరగటం కష్టంగా ఉంది. అందువల్ల యిద్దరూ చదువుకొని ఉద్యోగాలు చేస్తే మంచిది. ఏనాటికెలా ఉంటాయో పరిస్థితులు ఎవరికి తెలును ? కుటుంబ పోషణ

భారం ఒక్కొక్కసారి స్త్రీ నెత్తిన పడవచ్చు. అలాంటి పరిస్థితుల్లో ఉపయోగ పడుతుంది" అన్నాడు రామచంద్రం.

అలివేలుకి చిరాకుగా ఉంది. ఒక ప్రక్క కొడుకూ, కోడలూ కనిపించక అలమటిస్తుంటే, తండ్రీ కొడుకులు అసలు విషయం మరచి తర్కంలోకి దిగేరు.

"బాగుందిరా అబ్బాయ్. ప్రస్తుత కర్తవ్యం ఏమిటో ఆలోచించక చదువుతే మంచా చెడా అంటూ వాదన వేసుకు కూర్చున్నారేం. పెద్దాడూ, చంద్రా ఏమైనా రంటూరు" అంటూ విసుక్కుంది.

"ఏమవుతారమ్మా. పరారైనారు. అంతవరకు మనకు తెలుసు. ఎటు వెళ్ళిందీ మనకు తెలియదు. కనుక్కోవటం అనవసరం ఇక్కడవుండటం యిష్టంలేక, ఉండలేక ఈ పరిస్థితులకి తట్టుకోలేక వెళ్ళిపోయిన వారిని, వెంటాడి, శోధించి బలవంతాన తిరిగి ఈ బంధిఖానాలో బంధించి బాధించటం దేనికి? ఎవరికెక్కడ బాగుంటుందో అక్కడ ఉంటారు. వాళ్ళకి ఆమాత్రం స్వాతంత్ర్యంకూడా లేకపోతే బ్రతికి దేనికి? బ్రతికి నన్నాళ్ళూ సుఖంగా బ్రతక మన్నారు ఒకళ్ళని బాధించి మనం బాధపడి చేసే నిర్వాకం ఏముందమ్మా" అన్నాడు రామచంద్రం.

"బాగుందిరా నాయనా నీ వేదాంతం. అయితే ఎవరిదారి వారిదే నంటావ్. మంచీ చెడూ, గౌరవం మర్యాద, పేరు, ప్రఖ్యాతులూ, కీర్తి అపకీర్తులూ, పాపం, పుణ్యం యిలాంటివేమీ పట్టించుకో నక్కర్లేదంటావు. మనిషికి నీతి,

నియమం అక్కర్లేదంటావు. చదవేస్తే ఉన్నమతి పోయిందని తెలివితేటలు నా నాటికీ యిలా వృద్ధవుతున్నాయే" అంది అలివేలు కోపంతో.

"అమ్మా. నేనో మాట చెప్పనా. కోపగించుకోకు మంచీ, చెడూ అన్నీ మనం అనుకోవటంలో ఉంది. నలుగు రేది మంచి అంటే అది మంచి. ఈవేళ మంచిగా అనిపించింది రేపు చెడుగా అనిపించవచ్చు. కాల గమనం మంచి చెడుల్ని నిర్ణయిస్తుంది. క్షణం, క్షణం మారే ఈ ప్రపంచంలో మంచేదో చెడేదో నిర్ణయించటం కష్టం. పెద్దలే చెప్పలేరు ఒకొక్కప్పుడు" అన్నాడు రామచంద్రం.

"ఏమో నాయనా నేనేమీ చదువుకోలేదు. మీ మాటలు నాకర్థంకావు. మా కాలంలో ప్రాణంకంటే మానం ముఖ్యం. సుఖ, విలాసాలకంటే నీతి, నియమం, న్యాయం, ధర్మం ముఖ్యంగా భావించే వాళ్ళంగా నాయనా. పిదపకాలం వచ్చింది. అన్నీ పిదప బుద్ధులు పుడుతున్నాయి" అన్నది అలివేలు.

"అదేమీ కాదమ్మా కాలం. ఎప్పుడూ ఒకటి గానే ఉంది. మారేవి మనబుద్ధులే. పరిస్థితుల్ని బట్టి మారుతుం టాయి. మారటం సహజం. మారలేక, మారితే యిత్లరేమను కుంటారోనని భయపడి వెనకటి భావాల్ని పట్టుకొని, ఆచా రాల్ని అమలు పరుస్తూ లోలోపల అలమటించే వాళ్ళ అస మర్థులు, పిరికిపందలు. మనకింకా ఆ ధైర్యం రాలేదమ్మా. అది వచ్చిననాడు ఈ దుఃఖమూ ఉండదు. ఇదంతా భ్రమ అని తెలుసు కుంటావు" అన్నాడు రామచంద్రం.

"ఏం భ్రమోరా నాయనా, అన్నీ భ్రమ అయితే యింక దేనికొరకు సంతోషించాలి? దేనికొరకు విచారించాలి. నాకంతా అయోమయంగా ఉందిరా బాబూ" అన్నది అలివేలు.

"అదే తెలుస్తుందమ్మా. అన్నీ భ్రమలు కాబట్టి దేనికొరకూ విచారించ నవసరంలేదు. దేనికొరకూ సంతోషించ నవసరం లేదు. అన్నిటినీ సమానంగా చూడటమే మనపని. జాతస్యమరణం ధృవం అన్నారు పెద్దలు. ఎక్కడో పుడతాం, పెరుగుతాం, రాలిపోతాం. పుట్టినపుడు సంతోషించనూ వద్దు. చనిపోతే విచారించనూ వద్దు. కర్మాను సారం మనిషి తిరిగి తిరిగి జన్మలెత్తుతుంటాడమ్మా. అతని కర్మ పరిపక్వం చెందాక ఆ మనిషి పునర్జన్మ ఎత్తకుండా పరబ్రహ్మంలో కలిసిపోతాడు" అన్నాడు రామచంద్రం.

"అయ్యో రామ, నీకీ పిచ్చివేదాంతం తలకెక్కించింది ఎవర్రా? ఒకడు వెళ్ళాడని ఏడుస్తుంటే, రెండోవాడివి నీవు కూడా వెళ్ళిపోతా వేమిటి? మా గతేంకాను? ఇందుకే నట్రా మిమ్మల్ని, కని, పెంచీ, పెద్దచేసింది, అష్టకష్టాలు పడింది, శ్రమకోర్చి రాత్రింబవళ్ళు కష్టపడి కూడబెట్టింది, ఇదంతా ఎవరికోసం?" అన్నది అలివేలు.

"నిజమేనమ్మా, కేవలం నీవు కన్నది ఈ ఉద్దేశ్యంతో నేనా? మేము చేస్తామనీ, నీ ఋణం తీరుస్తామనీ నీ వెలా నమ్మావు? ఒకవేళ చెయ్యకపోతే ఏం చేద్దామని నిశ్చ

యించావు? పిచ్చి తల్లీ! సృష్టి సృష్టికొరకే జరుగుతోంది. కొరకూ, నా కొరకూ కాదు. ఒకరికొరకు ఒకరు జీవించన లేరు - చావనూ లేరు - కేవలం భ్రమ - ఎవరు లేకపోయినా ఎలాంటి జీవైనా బ్రతకాలనే వాంఛిస్తాడు. కుంటీ, కు మూగ, చెవిటీ, అవిటీ, కుష్టురోగి, క్షయరోగిలాంటి దీ రోగ పీడితులుకూడా బ్రతకాలనే వాంఛిస్తారు. భగవంతుడ సమస్త చరాచరాల్లోనూ, నదీ, నదములలోను, ఈ అనం విశ్వమంతటా నిండి ఉన్నాడు. మన పురాణాలు, యి హాసాలూ చెప్పే సత్యం అదొక్కటే. అటువంటప్పుడు మంచివాళ్ళనీ, చెడువాళ్ళనీ నేసుపరచటం దేనికి? ఉచ్చ నీచ కులాల్ని సృష్టించటం దేనికి? అందరితోనూ పరబ్రహ్మం అంటే నీవు ఉన్నావని ఎప్పుడైతే తెలుసుకుంటావో అప్పుడు నిందలూ లేవు, అపనిందలూలేవు - గౌరవాలూ లేవు, మర్యాదలూ లేవమ్మా" అన్నాడు రామచంద్రం. వెంకటా చారి తెల్లబోయాడు. ఇంతవరకూ ఈ జీవితమే సత్యమనీ, అందులో చేతనైనంత మేరకు సుఖాన్ని అనుభవించి పోవా లనీ మనిషి చచ్చిన తర్వాత జరిగేది ఎవరికీ తెలియదు కనుక బ్రతికుండగానే సర్వమూ - సమకూరినంతవరకు అనుభవించా లనీ భావించేవాడు. కానీ... నేటితో...ఆ మిథ్యావాదం సమూలం కూలిపోయింది-"అయితే శాశ్వతమైన దేదీ..." అనుకున్నాడు వెంకటాచారి.

"అందరూ అలా నిబ్బరంగా ఉంటే యింక విషాద మనేదీ, బాధనేదీ, దుఃఖమనేదీ ఎక్కడుంటుంది?" అన్నాడు వెంకటాచారి.

"ఎక్కడా ఉండదు నాన్నా. ఈ విషయాలు నిజానికి ప్రతి ప్రాణికోటికీ తెలుసు. కానీ, తెలిసే భ్రమలో పడి పోతుంటాడు" అన్నారు రామచంద్రం.

"ఏందువల్ల నంటావు?" అన్నాడు వెంకటాచారి.

"అజ్ఞానంవల్ల, చిత్త చాంచల్యంవల్ల" అన్నాడు రామచంద్రం.

"అసలు మనిషికి చిత్తచాంచల్యం దేనికుండాలి? అన్నీ తెలిసినప్పుడు, భగవంతుడి రూపం తనలో ఉన్నప్పు డీ భ్రమలకి లోనుగావలసిన అవసరమేముందిరా అబ్బాయ్" అన్నాడు వెంకటాచారి.

"నాన్నా, ఒకటి చెప్పనా? నీవు శ్రమపడకుండా అన్నంవస్తే నీ వెందుకు పనిచేస్తావు? నీవు కోరినవన్నీ నీ పక్కమీదికే అందిస్తే నీవు లేచి నిలబడి ఎందుకు సంచరిస్తావూ? అందులో నీ ప్రయోజకత్వమేముంది? అందరూ సమానమే. అప్పుడు సృష్టి ఏముంది? రేపీ పాటికి నశిస్తుంది. లోకం నిస్తేజం అయిపోతుంది. అందులోని జీవశక్తి తగ్గిపోతుంది. నీ నిత్యావసరాలన్నీ నీవు కూర్చున్నచోటనే అమరితే నీవు అక్కడినుండి లేవవు. దానితో నీ అవయవాలు నీ జీర్ణమండలం, నీ దృష్టి, అన్నీ మందగిస్తాయి. తుప్పుపట్టి పనికిరాకుండా పోతాయి. చివరికి శిథిలమై త్వరలో నశిస్తావు. అందువల్ల జీవశక్తికి మూలం చైతన్యం. ప్రపంచంలోని ఎక్కువ తక్కువలే మానవుడిలో చైతన్యాన్ని పెంపొందించి

మానవ వికాసానికీ, అభ్యుదయానికీ అవకాశాన్ని కల్పిస్తున్నై. భావనాశక్తిని యినుమడింప జేస్తాయి. అందువల్ల మనకు ఉన్న శక్తి సామర్థ్యాలని సన్మార్గంలో ఉపయోగిస్తే, సత్కార్యాలకి వినియోగిస్తే దానివల్ల మనకూ లోకానికీ మేలు చేకూరుతుంది. ఎంత పదునైన కత్తినైనా వాడకుండా మూల పెట్టి ఉంచితే అది త్వరలో తుప్పుపట్టి పోతుంది. వాడిన కొద్దీ పదును తేలుతుంది. జీవితమూ అంతే. దాన్ని వీలైనంతగా ఉపయోగిస్తే దానివల్ల మనకీ యితరులకీ ఉపయోగపడుతుంది" అన్నాడు రామచంద్రం.

"అంటే ... నీ వుద్దేశ్యమేమిటి" అన్నాడు వెంకటాచారి.

"అదే నేను చెప్పేది. నీలో భగవత్ అంశ ఉన్నదని ధీమాగా ఉంటే లాభంలేదు. దాన్ని ఎవరైనా సంగ్రహిస్తారేమోనని మూలన దాచి ఉంచితే లాభంలేదు. తృప్పుపట్టి చెడిపోతుంది. దాని రూపంమారిపోయి వికృతరూపం ఏర్పడుతుంది. అందువల్ల ఆ భగవత్ అంశను వెలికితీసి దాన్ని ఉపయోగంలో పెడితే దాని కాంతి ఎంతో నీకు తెలుస్తుంది. దానివల్ల భగవత్ అంశ పెరుగుతుందేకాని తరగదు" అన్నాడు రామచంద్రం.

"అయితే ఈ దుఃఖాలూ, అవమానాలూ, అనుమానాలూ దేనికి కల్పించుకుంటున్నాడంటావు మానవుడు?" అన్నాడు వెంకటాచారి.

"అజ్ఞానంవల్ల, తనను తాను నమ్మకపోవటంవల్లనే యితరులమీద అనుమానం ఏర్పడుతుంది. తనను తాను గౌరవించుకోవటం తెలుసుకోకనే యితర్లు అవమానించారనీ, అవమానిస్తారనీ భయపడటం" అన్నాడు రామచంద్రం.

"తనని తాను నమ్మకపోవటంవల్ల అనుమానం ఎలా ఏర్పడుతుందంటావు?" అన్నాడు వెంకటాచారి.

అందరిలోనూ పరబ్రహ్మ ఉన్నాడన్నప్పుడు నీలోనూ ఎదుటివాడిలోనూ ఒకడే ఉన్నాడుకదా! అంటే నీ ఎదుటి వాడిలోకూడా ఉన్నాడు. అప్పుడు నీవు మంచివాడివి, ఎదుటివాడు చెడ్డవాడూ ఎలా అవుతాడు? ఎదుటి వాడు చెడ్డవాడని నీవు నమ్మేటట్లయితే నీవు చెడ్డవాడి వన్నమాట. నీవు చెడ్డవాడివైనప్పుడు ఎదుటివాడుకూడా చెడ్డవాడైనప్పుడు వాడిని నీవు అనుమానించేందుకూ అవ మానించేందుకూ అవకాశం ఎక్కువుంది నాన్నా. నీవు మంచి వాడివి కాకుండా యితరుల్ని చెడ్డవాళ్ళని అడిపోసుకుంటే లాభం ఏముంది?" అన్నాడు రామచంద్రం.

"ఏమోరా బాబూ, నీకున్న తెలివి తేటలు నాకు లేవు. నీవు చెప్పేది నా కర్థంకావటంలేదు" అన్నాడు వెంకటాచారి.

"ఇప్పుడు కాకపోతే మరొకప్పుడు అదే అర్థం అవు తుందిలెండి నాన్నా. అమ్మా, అలాగే కూర్చున్నావేం. లేచి పనులు కానివ్వు" అన్నాడు. రామచంద్రం ముఖం కడుక్కోవటానికి వెడుతూ.

"ఏమోరా నాకేమీ మనసు బాగాలేదు. ఏపనీ చెయ్యబుద్ధి కావటంలేదు" అన్నది అలివేలు.

"ఇవేళ అట్లాగే అనిపిస్తుందమ్మా. నాలుగు రోజులు పోయాక నీకంత బాధ అనిపించదు. మామూలు విషయమై పోతుంది. ఇంకా కొన్నాళ్ళు పోయాక మనసులో లీలగా మాత్రమే ఉంటుంది. అందువల్ల ఈ రోజే మనస్సు దిటవు చేసుకుంటే నీ కా దుఃఖం తప్పుతుంది" అన్నాడు రామచంద్రం.

"ఇస్సు-రామచంద్ర ప్రభూ-ఎటువంటి పాట్లు తెచ్చి పెట్టావురా నాయనా ఎన్ని పాపాలు చేశానో, నేడిలా అనుభవిస్తున్నాను" అన్నది అలివేలు లేస్తూ. భారంగా నిట్టూర్చి బలవంతంగా శరీరాన్ని వంటింట్లోకి చేరవేసింది.

తప్పనిసరై గృహ కృత్యాల్లో మునిగి పోయింది. మనసు పీకుతూనే ఉంది. వెనకటి సంఘటనలు ఒకొక్కటే మనస్సుల్లో మేఘ మాలికల్లా కనిపించి మాయమవు తున్నాయి. పనిచేస్తూనే ఉంది. మనస్సు మాత్రం ఎక్కడో విహరిస్తున్నది.

"అమ్మా, పొయ్యిమీద పాలు పొంగుతున్నాయి. ఎదురుగా కూర్చొనే అలా పొంగ పెడ్తున్నావేం? త్వరగా కాఫీ యివ్వు" అన్నాడు రామచంద్రం.

"అలాగేరా బాబూ. ఇదిగో కలిపిస్తా" అంటూ కాఫీ కలుపుతున్నది అలివేలు.

కాఫీ త్రాగి రామచంద్రం వెడుతూ "అమ్మా టైమయి పోయింది. భోజనం మళ్ళీ వచ్చి చేస్తాలే" అని చెప్పాడు.

"అదేవిట్రా, భోజనం చెయ్యకుండా వెడతావా. ఉండు అన్నం ఒక్కటే వండుతాను. ఆవగాయతో రెండు ముద్దలు తిని వెడుదువు గాని..." అన్నది బాధపడుతూ అలివేలు.

"మరేమీ బెంగ పెట్టుకోకమ్మా మళ్ళీ వస్తానన్నా నుగా. నీవు వంట నెమ్మదిగా పూర్తిచెయ్యి. ఈ రోజు సాయం చెయ్యటానికి ఎవరూ లేరుగా. ఎవరైనా పనిమనిషిని మాట్లాడదాంలే" అన్నాడు రామచంద్రం.

"ఛా-ఛా-- పని వాళ్ళు దేనికిరా. ఎడ్డీ మడ్డీగా ఉంటారు. స్నానం లేదు, సంధ్య లేదు. డోకొస్తుంది. అయినా శూద్రుల చేత్తో ముట్టుకున్న గిన్నెల్తో ఎలా వంటచేసుకు తినాలిరా. అది నావల్ల కాదబ్బాయ్. ఈ జన్మ యిలా పోనివ్వు" అన్నది అలివేలు

"సరే. ఆ విషయం తర్వాత ఆలోచిద్దాం. ప్రస్తుతం నేను వెడుతున్నా" అంటూ రామచంద్రం వెళ్ళిపోయాడు.

"ఏమేవ్. ఈరోజు వేరే ఊరికి వెళ్ళాలి. స్నానం చేసి వెడతాను" అన్నాడు వెంకటాచారి వస్తూ.

"ఈ రోజు కూడా వెళ్ళాలా? అంత కొంపలంటుకు పొయ్యే పను లేమున్నాయి?" అన్నది అలివేలు రోషంతో.

"ఈ రోజు పెళ్ళికి వంటకి వస్తానని మాట యిచ్చాను. వెళ్ళకపోతే యిబ్బంది పడిపోతారు" అన్నాడు వెంకటాచారి.

"ఇక్కడ పిల్లవాడు కనిపించక నేను అఘోరిస్తుంటే. నా దుఃఖం మీకు పట్టలేదు! ఊళ్ళో వాళ్ళు కష్టపడి పోతారట. సరే వెళ్ళండి. మీకేరోజున ఈ యింటి గొడవ పట్టింది కనుక. అందుకే యిలా పాడైంది పండంటి సంసారం" అంటూ సణుక్కుంది.

"బాగున్నదిలే, నేను వాళ్ళని వెళ్ళిపొమ్మన్నానా? ఏం లోటు జరిగిందని వాళ్ళు వెళ్ళిపోవాల్సి వచ్చింది? అంతా కర్మ అంతకు తప్పితే మరేమీ లేదు" అన్నాడు వెంకటాచారి.

"కూటికీ, గుడ్డకూ పనికి రాని కబుర్లు నేర్చార్లేండి" అంటూ" ఎందు కీ రొష్టు. వెళ్ళండి" అంటూ విసుక్కుంది.

"నీ వెలా చెప్పినా నేను వెళ్ళేమాట ఖాయం" అంటూ వెంకటాచారి ప్రయాణానికి సిద్ధమైనాడు.

చెప్పులు తొడుక్కొని వాకిట్లోకి వెళ్ళాడు.

ఎదురుగా నారాయణాచారి వచ్చాడు.

"ఓ! బావగారా ఏమిటిలా వచ్చారు? అన్నాడు వెంకటాచారి లేని సంతోషం కనబరుస్తూ.

అవును. ముఖ్యమైన పని ఉండే వచ్చాను. మీ చెల్లెలికి హఠాత్తుగా గుండెజబ్బు పట్టుకొని మంచ మెక్కింది.

అల్లుణ్ణి, కూతుర్ని తీసుకు రమ్మన్నది" అన్నాడు నారాయణాచారి.

వెంకటాచారి గుండెల్లో గాలం పడింది. ఏమని చెప్తాడు? ఎలా చెప్తాడు?.

"అబ్బాయిని పంపక నీ వెందు కిలా వచ్చావు?" అన్నాడు వెంకటాచారి.

"అబ్బాయి యిక్కడ లేడుగా. వాడికి చాలా దూరంలో ఉద్యోగం దొరికింది. వెళ్ళిపోయాడు. తల్లికిలా జబ్బుగా ఉందని రాస్తే నిన్ననే వచ్చాడు. నిన్నవచ్చినవాణ్ణి శ్రమ పెట్టటం దేనికని నేనిలా వచ్చాను" అన్నాడు నారాయణాచారి.

"కొడుకూ, కోడలూ, పిల్లలూ బాగున్నారా" అన్నాడు వెంకటాచారి.

"ఆ బాగానే ఉన్నారు. వాడూ చెల్లాయిని చూసి చాలా రోజులైంది చూడాలంటున్నాడు" అన్నాడు నారాయణాచారి.

"లోపలికి పద. ఏమేవ్. మీ అన్నగారొచ్చాడు. కాళ్ళకి నీళ్ళు తీసుకురా" అన్నాడు వెంకటాచారి.

"ఎవరూ" అంటూ నీళ్ళ చెంబుతో ప్రత్యక్షమైన అలివేలు నారాయణాచారిని చూడంగానే తెల తెల పోయింది. స్పృహ తప్పి పడిపోయేలా ఉంది.

"ఏమిటమ్మా అలా ఉన్నావ్? ఒంట్లో కులాసా లేదా" అన్నాడు నారాయణాచారి.

"ఆ... అవును అన్నయ్యా... ఏదోలే" అంది అలివేలు.

"అమ్మాయ్ ఏదీ? వాళ్ళమ్మకి ఒంట్లో బాగాలేదు. మంచం పట్టింది. కూతుర్ని చూడాలంటున్నది. అమ్మాయినీ, అల్లుడ్నీ పంపితే కొన్నిరోజు లుంచుకొని పంపుతాను" అన్నాడు నారాయణాచారి.

"అంత అదృష్టం ఉంటే యింక కావల్సిందేముందీ" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది అలివేలు.

"ఏం? ఏమిటీ నీవనేది? నాకేమీ అర్థం కావటం లేదు. అంతా అయోమయంగా ఉంది" అన్నాడు నారాయణాచారి తెల్లబోతూ.

"అర్థం అయ్యేట్లుగా లేదు అన్నయ్యా మా పరిస్థితి" అన్నది అలివేలు ముఖాన చెంగు అడ్డంపెట్టుకొని.

"అంటే ..." అన్నాడు నారాయణాచారి అయోమయంగా చూస్తూ.

"కొడుకూ, కోడలూ ప్రొద్దుటినుంచీ కనిపించటం లేదు. మేమూ అదే విచారంలో ఉన్నాం. ఇంతలోకి యిదో వార్త" అన్నాడు వెంకటాచారి.

"ఆ! అమ్మాయ్, అల్లుడూ కనిపించటం లేదా? ఎందువల్ల? ఏమైనా ఆచూకీ తెలిసిందా. బహుశా తోడికోడళ్ళమధ్య తగాదాలేమైనా వచ్చాయేమో? మీ రెండో

కోడల్ని పిలుస్తారా? అడుగుతాను" అన్నాడు నారాయణాచారి.

"సరే, ఆ భాగ్యంకూడా లేదు. ఆవిడ అలిగి పుట్టింటికెళ్ళి చాలా కాలమైంది" అన్నాడు వెంకటాచారి.

"దేని కలిగి వెళ్ళింది?" అన్నాడు నారాయణాచారి.

"అవన్నీ మనకేం తెలుస్తాయి. ఏమీ చెప్పలేదుట. తల్లినీ, తండ్రినీ చూస్తానని వెళ్ళిందట, అంతే! తిరిగి రాలేదు" అన్నాడు వెంకటాచారి.

"తిరిగిరాకపోతే అలాగే చూస్తూ ఊరుకున్నారా? మీవాడు వెళ్ళలేదు?" అన్నాడు నారాయణాచారి.

"వాడు వెళ్ళనన్నాడు. స్వయంగా వాడేవెళ్ళి, దిగబెట్టివచ్చాడు. వచ్చేదైతే ఆవిడే వసుందిలే అంటాడువాడు. వాళ్ళకేమో - వాడ్ని యిల్లరికం ఉంచుకోవాలని ఉంది. వాడికది యిష్టంలేదు. ఇలావున్నాయి పరిస్థితులు" అన్నాడు వెంకటాచారి.

"చిత్రంగా ఉందే. మాకింతవరకూ తెలియదు. అంతా బాగున్నారులే అనుకున్నాం. ఏదైనా విశేషముంటే వ్రాయక పోతారా అని ఊరుకున్నాం" అన్నాడు నారాయణాచారి విచారిస్తూ.

"ఏమని వ్రాయాలి? అందుకని ఏమీ వ్రాయలేదు" అన్నాడు వెంకటాచారి.

"అసలే మంచం ఎక్కింది. ఈ వార్తవింటే అదింక బ్రతకదు" అన్నాడు నారాయణాచారి విచారంతో.

"అవును, నాకలాగే అనిపిస్తున్నది" అన్నాడు వెంకటాచారి.

"అయితే వస్తామరి, వెళ్ళనా" అన్నాడు నారాయణాచారి లేస్తూ.

"అప్పుడే వెడతావా? భోజనం చేసి వెడుదువుగాని" అన్నాడు వెంకటాచారి.

"ఇంకేం భోజనంలే, అదెట్లా ఉందో వెడతానమ్మాయ్" అన్నాడు నారాయణాచారి.

"ఈపూట ఉండిపో అన్నయ్యా. సాయంత్రం వెళ్ళ వచ్చులే. ఇప్పుడే వస్తిరి. అప్పుడే వెడతానంటుంటివి" అన్నది అలిమేలు.

"ఇక్కడ ఉండి చేసేదేముంది అమ్మాయ్. అక్కడ దానికి బాగాలేదు" అన్నాడు నారాయణాచారి.

"అలాగే బావా. ఉత్తరం వ్రాయి ఎలా ఉందీ" అన్నాడు వెంకటాచారి.

"ఉత్తరం వెంటనే వ్రాయి అన్నయ్యా. వచ్చిచూద్దామంటే మా పరిస్థితి యిలావుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఎల్లా వచ్చేది. వదినని అడిగానని చెప్పు" అన్నది అలివేలు విచారంగా.

నారాయణాచారితో బాటు వెంకటాచారి బయటికి వచ్చాడు.

"నీ వెక్కడికోయి. వస్తావా? చెల్లెల్ని చూద్దువు గాని" అన్నాడు నారాయణాచారి.

"ఈ పరిస్థితిలో చెల్లెలికి ముఖం ఎలా చూపించమన్నావ్ బావా? దాని కూతుర్ని దానికి చూపించలేక పొయ్యా, దక్కించుకోలేకపొయ్యా. పాపిష్టివాడ్ని ఇదంతా నా వల్ల నేవచ్చింది. అమ్మాయి నామాట వినే నోరులేనివాడికి ఒక్కగానొక్క పిల్లనీ యిచ్చిచేసింది. దాని అనురాగానికి తగినట్లు నడుచుకోలేక పోయాను. దాని అభిమానాన్ని అవమానించాను. నాకు దాని ముఖం చూపే అదృష్టం అర్హత లేవు బావా" అంటూ వెళ్ళిపోయాడు వెంకటాచారి దుఃఖంతో.

నారాయణాచారి స్తబ్ధుగా నిలబడి, ఆ తర్వాత తెలివి తెచ్చుకొని గృహోన్ముఖుడైనాడు.

# 14

నారాయణాచారి ఒక్కడే అడుగుబెట్టాడు యింట్లోకి.

గోవిందాచారి తల్లి దగ్గర కూర్చొని విసనకర్రతో విసురుతున్నాడు. గోవిందాచారి భార్య అచ్యుతవల్లి బత్తాయి రసం తీస్తున్నది. పెద్ద పిల్ల రమ బత్తాయి డిప్పలు చీకు తున్నది. చంటివాడు చాపమీద బోర్లపడి బోసి నవ్వులు ఒలకబోస్తూ ప్రాకటానికి పాటుపడుతున్నాడు. ప్రాకటం రాక ముందుకీ వెనక్కీ ఊగుతూ నవ్వుతున్నాడు. చేతులతో చాపమీద తపతప కొడ్తున్నాడు. ఎదురుగా ఉన్న గిలక్కా యని అందుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

చెప్పుల చప్పుడు విని గోవిందాచారి ఉలిక్కిపడి ద్వారం వంక చూశాడు. ఎదురుగా తండ్రి కనిపించాడు. ముఖంలో విచార రేఖలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. తండ్రితోకూడ చెల్లి రాలేదు. తండ్రి వంటరిగా వచ్చాడు. అక్కని పంపమన్నారేమో. ఛా! అలా ఎందుకు జరుగుతుంది. చెల్లి అత్తగారూ వాళ్లూ పరాయివాళ్ళు కాదే! స్వంత మేనత్త, మేనమామలు. తల్లి జబ్బుతో ఉందని తెలిసికూడా కోడల్ని పుట్టింటికి పంపనంత కఠినాత్ములు కారే మరి.

ఏమైందో. గోవిందాచారి ఆందోళన వదనంతో "నాన్నా-చెల్లి రాలేదేం" అన్నాడు.

"రాదురా" అన్నాడు నారాయణాచారి.

అచ్యుతవల్లి లోపలికివెళ్ళి కాళ్ళకి నీళ్ళు తెచ్చి యిచ్చింది.

నారాయణాచారి కాళ్ళు కడుక్కొని వచ్చాడు.

"ఎందుకని నాన్నా? అత్తయ్య వాళ్ళు పంప నన్నారా?" అన్నాడు గోవిందాచారి.

"అది కాదురా బాబూ. కథ చాలా ఉంది. తర్వాత చెప్తాలే." అన్నాడు నారాయణాచారి.

"భోజనం చేస్తారా మామయ్యా. స్నానంచేసి రండి ముందు" అన్నది అచ్యుతవల్లి.

"ఇప్పుడేం భోజనంలే తల్లీ. వేళ మించిపోయింది. రాత్రికి చేస్తాలే. కాసిని మజ్జిగ ఉంటే యివ్వు" అన్నాడు నారాయణాచారి చాపమీద పిల్లవాడి కెదురుగా కూర్చుంటూ.

"అదేమిటి? అంతదూరం వెళ్ళి వచ్చారు. రెండు మెతుకులు ఎంగిలి పడితే కొంత ఆధరువుగా ఉంటుంది. లేక పోతే నీరసం వస్తుంది" అన్నది అచ్యుతవల్లి.

"అవేమీ రావులే తల్లీ. ఏరా తాతా. ఎందుకలా కష్టపడుతున్నావు. ప్రాకుతావా, ఛీ. ఛీ...పో" అంటూ చేతులు చాచాడు.

పిల్లవాడు తన బోసి నోటితో నవ్వుల వెన్నెలని నలు దిక్కులా వెదజల్లాడు.

"ఛీ....పో వెధవా. ఇలా రారా అంటే అక్కడే ఉండి నవ్వుతావేం" అన్నాడు నారాయణాచారి చేతులు చాస్తూ. పిల్లవాడు వెల్లికిలా పడ్డాడు. పడి నడుమెత్తి ఎగురుతున్నాడు తాతని ఎత్తుకోమని సంజ్ఞ చేస్తూ.

"రా. రా భడవా" అంటూ చేతుల్లోకి ఎత్తుకున్నాడు.

పిల్లవాడు ఊరుకుంటేగా. స్ప్రింగ్‌లాగా కిందికీ పైకి ఎగిరి తాతని త్రొక్కుతున్నాడు. కిలకిల నవ్వుతున్నాడు.

ఒక్కసారి ఉచ్చపోసి తాతగారి ధోవతి తడిపేశాడు. చేసింది ఘన కార్యమన్నట్లు గలగల నవ్వేశాడు.

"ఛీ - భడవా ... చేసింది తప్పు. పైగా నవ్వుతున్నావా" అన్నాడు నారాయణాచారి నవ్వుతూ.

గోవిందాచార్లు తాతా మనుమళ్ళ కేరింతలు చూస్తున్నాడు.

"ఒసే, అచ్యుతాబాబు నాన్న బట్టలన్నీ తడిపేశాడు" అంటూ కేక వేశాడు.

వంటింట్లో బత్తాయి రసంలో పంచదార కలుపుతున్న అచ్యుతవల్లి పరుగెత్తు కొచ్చింది.

"ఛీ... వెధవా. భయం భక్తి లేవు. ఇలాంటి పనులేనా చేసేది" అంటూ అందుకోబోయింది.

"పుర్" మంటూ తాతగారి బట్టలమీద వొడ్డికి కూర్చున్నాడు.

"ఛీ వెధవా... ఉట్టి అల్లరివాడి వైనావు" అంటూ అత్యూతవల్లి వాడ్ని తీసుకెళ్ళి వాడ్ని శుభ్రపరిచింది. మళ్ళీ తెచ్చి చాపమీద పడుకోబెట్టింది. మామగారికి వేరే ధోవతి తెచ్చి యిచ్చింది.

"ఫరవాలేదమ్మా. చెఱువుకి వెళ్ళి స్నానం చేసి వస్తాను. వాడు చేసిన పని మంచిదే. తాతకి బుద్ధిచెప్పాడు రాగానే స్నానం చేసి బట్టలు విడువవలసింది. చెయ్యలేదు. బద్ధకించి అలాగే కూర్చుండి పోయాను. తప్పని చెప్పాడు" అంటూ అంగవస్త్రం అందుకొని స్నానానికి వెళ్ళబోయాడు.

"నాన్నా చెల్లి సంగతి చెప్పలేదేం" అన్నాడు గోవిందాచారి ఉండబట్టలేక.

"మీ చెల్లీ, బావమరదీ ప్రొద్దుటి నుంచీ కనిపించటం లేదట. ఎక్కడికి వెళ్లారో ఏమైనారో నని బాధ పడుతున్నారు" అన్నాడు నారాయణాచారి

"ఎందుకు వెళ్ళారో పిళ్ళకి తెలియకుండా ఉందా? అంత హఠాత్తుగా ఎలా వెడతారు? బావేమో ... మూగ వాడుకదా. ఇక చెల్లెలి ప్రోద్బలం మీదే వెళ్ళి ఉంటారు... అంటే చెల్లికి ఎంతో కష్టం వేస్తేగాని ... అలా వెళ్ళి ఉండదు. పైగా యిక్కడికికూడా రాకుండా వెళ్ళారంటే అందులో ఏదో రహస్యం యిమిడి ఉంటుంది. కష్టంగాఉంటే ఎవరైనా పుట్టింటికి వెడతారు. కాని చెల్లి అలా చెయ్యలేదు.

అందువల్ల నాకలా తోస్తున్నది. మీరేమంటారు?'' అన్నాడు గోవిందాచారి.

"అవును నాకూ అదే అనిపిస్తున్నది. చంద్ర అల్లాంటిది కాదు ఎంత కష్టాన్నయినా ఓర్చుకోగలదు. పల్లెత్తి ఎవర్నీ ఏమీ అనలేదు. చివరికి తన కష్టం చెప్పుకునే రకం కాదు మరి ఏమైందో ... దానికెంత బాధగా ఉందో ... అలా ఎవరికీ తెలియకుండా కూడా మొగుడ్ని తోడు తీసుకెళ్ళింది ... బహుశా తోడు కోడళ్ళమధ్య ఏదో తగాదావచ్చి ఉంటుంది. చిన్నకోడలు యిక్కడ లేదట. పుట్టింటికి వెళ్ళి చాలాకాలమైందిట. నాకీ విషయాలన్నీ యింతవరకు తెలియవు. ఏదో ... దాని కాపరం అది చేసుకుంటున్నది. మాటిమాటికీ వెళ్ళి వాళ్ళని బాధపెట్టటం దేనికని నేనా వైపు వెళ్ళలేదు. అందుకిలా జరిగింది!'' అన్నాడు అన్నాడు నారాయణాచారి నిట్టూర్చి.

"చెల్లి ఆచూకీ తెలుసుకోవాలి నాన్నా. అదేమో ఆడపిల్ల. బావేమో అసమర్థుడు. ఎలా కష్టపడుతున్నారో నని నాకు దిగులుగా ఉంది'' అన్నాడు గోవిందాచారి.

"దిగులుపడి చేసేదేమీ లేదురా బాబూ. భగవంతుడి దయ. ఆయనెలా కోరితే అలా జరుగుతుంది. ఎవరి కర్మలో ఎలా ఉందో అలా జరిగి తీరుతుంది. అమ్మాయికీ పెళ్ళి చెయ్యటం నాకిష్టంలేదు. ఎంతో ప్రయత్నించాను. కానీ మీ అమ్మ మీ మామ కలిసి పట్టుపట్టి ఈ పెళ్ళి జరిపించారు. 'అది ఎంతో తెలివి కలది. మంచి గాత్రం ఉంది.

పిల్లని చెడగొట్టవద్దు. సంగీతం నేర్పి విద్వాంసురాల్ని చేయండి' అంటూ వేణుగోపాలాచారి ఎంతో దూరం చెప్పాడు. కానీ ... మీ అమ్మ పోరుపడలేక అలాచేశాను. దాని ఫలితం యిప్పుడది అనుభవిస్తున్నది. ఆ పాపానికి నాకీ శిక్ష విధించాడు భగవంతుడు. దైవలిఖితం ఎలా ఉంటే అలా జరుగుతుంది. మంచయినా, చెడయినా, ఆ వేళల్లో అల్లాగే బుద్ధిపుట్టి, విధి మనచేత బలవంతంగా ఆ పని చేయించి తీరుతుంది. ఇదంతా కర్మఫలం. నే నిలా చెయ్యకపోతే బాగుండేదని యిప్పుడనుకుంటున్నాను. కానీ అప్పటి పరిస్థితులనుబట్టి అలా నడవకతప్పలేదు. మనిషి, విధిచేతిలోని కీలుబొమ్మ. అది ఆడించినట్లా ఆడుతాడు. ఎగరమంటే ఎగురుతాడు. పడమంటే పడతాడు. విధికి ఎదురుతిరిగి లాభంలేదు. బలవంతంగానైనా ఆపని నీచేత చేయించి తీరుతాడురా **బాబూ. ఆ విషయం** తెలియక మనం అదిచేస్తే బాగుండేదీ, ఇదిచెయ్యకపోతే బాగుండేదని అనుకుంటాము. కానీ విధి ననుసరించి బుద్ధి సంచరిస్తుంది. విధి ఆజ్ఞల్ని తూ చా తప్పకుండ పాలిస్తుంది. అజ్ఞానులంకాబట్టి మంచి జరిగినప్పుడు నేనే చేశానని గుండెలు బాదుకొని విర్రవీగుతుంటాం. చెడు జరిగినప్పుడు విధిని దూషిస్తుంటాం. మంచిని మనకీ, చెడును విధికీ అన్వయిస్తాం. కానీ మంచీ, చెడూ, రెండూ మన పూర్వకర్మానుసారం మనచేత విధి చేయిస్తుంది" అన్నాడు నారాయణాచారి.

గోవిందాచారికి వేదాంతం సరిపడదు. చేసేవన్నీ చేజేతులా చేసి చెడుకల్గినప్పుడు నాదేంలేదు. భగవంతుడే

చేయించాడని నేరం భగవంతుడిమీద రుద్దటం అతని మతం కాదు. మంచీ, చెడూ, అన్నీ మానవుడే తన బుద్ధి కుశలత ననుసరించి చేస్తుంటాడని అతని నమ్మకం. తాను చేసిన పని యొక్క ఫలితమే చివరికి మంచీ, చెడూ, కష్టం, సుఖం రూపంలో అందుతాయని అతని నమ్మకం.

"మీరు చెప్పేది నేను నమ్మను నాన్నా. మంచీ, చెడూ, మనమే చేస్తున్నాం అంటాను. మీ కానాడు చెల్లి పెళ్ళి అలా చెయ్యటం యిష్టంలేదని చెబుతూనే ఉన్నారు. ఆ వివాహ ఫలితాలు చెడుగానే ఉంటాయని మీ రానాడే ఊహించారు. అలాంటప్పుడు అమ్మమాటకి విలువ యివ్వ వలసిన అవసరం ఏముంది? ఆమె అజ్ఞానురాలు. తన తల్లీ, తోడబుట్టిన వాళ్ళన్న మమకారం తప్పితే తన కూతురి భవిష్యత్తు యిలా బూడిదపాలవుతుందని ఆమెకేం తెలుసు? తెలిస్తే అలా చేయనిస్తుందా? చూస్తూ, చూస్తూ తన కూతురి గొంతు నులుమేటంతటి పాపాత్మురాలు కాదు ఆమె. కనీ, పెంచీ, పెద్దచేసిన తల్లి తనకూతురి భవిష్యత్తు ఆనందమయంగా, నందనవనంగా, పూలబాటగా ఉండాలని ఉవ్విళ్లూరుతుందే కానీ చూస్తూ, చూస్తూ ముళ్ళ డొంకలో పడేద్దామని అనుకోదుగా. తెలియని వాళ్ళకి తెలియజెప్పి ఒప్పించాల్సిన బాధ్యత తెలివిఉన్న వారిపైన ఉంది" అన్నాడు గోవిందాచారి.

సుభద్ర కళ్ళు తెరిచింది. "ఏమిటన్నట్లు" ప్రశ్నించింది కళ్ళతో.

"చెల్లి సంగతేలే" అన్నాడు గోవిందాచారి.

"ఏదీ" అన్నట్లు చుట్టూ కలయచూచింది సుభద్ర. చంద్ర కనిపించలేదు.

"ఏమైన దన్నట్లు" గోవిందాచారివంక చూసింది.

"ఇప్పుడు పంపటానికి వీలుకాదన్నారట. తర్వాత వస్తుందిట. అత్తయ్యకి ఒంట్లో బాగాలేదుట" అన్నాడు గోవిందాచారి కల్పించి చెప్తూ.

"అదేమిట్రా. అబద్ధాలతో అడియాసలు కల్పిస్తావు. చంద్రిక యింక మన కళ్ళబడే మాట కల్ల" అన్నాడు నారాయణాచారి.

"ఏమిటన్నట్లు" నారాయణాచారి వంక చూసింది సుభద్ర.

"చంద్ర ... ఇంకరాదు ఎక్కడికో వెళ్ళిపోయిందట" అన్నాడు నారాయణాచారి.

సుభద్ర కళ్ళల్లోని ఆశారేఖ ఒక్కమారు అదృశ్యమైంది. కళ్ళుగాజు కళ్ళ లాగ ఉన్నాయి. దృక్కులో వెలుగు లేదు. అందరివంక దీనంగాచూచింది. కళ్ళు మెల్లగా మూతలు పడ్డాయి. ఎత్తినచేయి ప్రక్కకి వాలిపోయింది.

గోవిందాచారి ఆత్రతగా తల్లివంక చూచాడు" "అమ్మా" అంటూ బిగ్గరగా కేకవేశాడు. దానికి సమాధానంలేదు.

"సుభద్రా" అన్నాడు నారాయణాచారి. సుభద్ర కళ్ళు విప్పలేదు. మూతపడిన కళ్ళు అలాగే ఉన్నాయి.

నారాయణాచారి ఆతృతగా చెయ్యిచూశాడు. నాడి చాల బలహీనంగా కొట్టుకుంటున్నది. "ప్చ" అన్నాడు నారాయణాచారి పెదవులు విరుస్తూ.

"ఏమిటి నాన్నా" అన్నాడు గోవిందాచారి.

"మీ అన్న ... బ్రతకదురా బాబూ" అంటూ మంచంమీద కూర్చొని హరినామ స్మరణ చెయ్యటం ఆరంభించాడు.

"ఏం పని చేశావు నాన్నా. అసలే బలహీనంగాఉంది. ఇప్పుడామాట చెప్పకపోతేనేం. అనవసరంగా నిజం చెప్పి ఒక నిండు ప్రాణాన్ని బలియిచ్చావు. ఈ సత్యసంధత ఎవర్ని ఉద్ధరించను" అన్నాడు గోవిందాచారి ఆవేశంతో.

"నాయనా, సత్యం చేదుమాత్ర వంటిది. నిజం పల్కితే నిష్ఠూరం తప్పదన్నారు. అసత్యంతో జీవితాన్ని దుఃఖభాజనం చేసుకోకు. అందువల్ల నిన్ను నీవే మోసగించి నట్లవుతుంది ఒకర్ని మోసగించిన నాడు నిన్ను నీవు మోసగించటం కష్టంకాదు. క్షణభంగురమైన ఈ జీవితాన్ని అబద్ధాలతో యింకా పొడిగించి ఏం చేయాలి బాబూ. జాతస్య మరణం ధృవమ్" అన్నాడు నారాయణాచారి నారాయణ నామస్మరణచేస్తూ.

"మేము మానవులం నాన్నా. మీలాగ పాషాణ హృదయులం కాము. చూస్తూ చూస్తూ ఒక ప్రాణిని మృత్యు గృహానికి అతిథులుగా పంపలేము. కన్నకూతురి జాడ తెలియకపోయినా నిశ్చింతగా మీరు కాబట్టి ఉన్నారు. నే నలా ఉండలేను నాన్నా" అన్నాడు ఆవేశంలో.

"ఆవేశ పడకు బాబూ. కొన్నాళ్ళు పోయాక నీకే తెలుస్తుంది. సుఖ దుఃఖాలు సహజం. వాటికి అతీతులం కాలేకపోతే ఆ దుఃఖ భారంలో కృంగి కృశించి నశించి పోతాం ఇది సహజమైన వేమనిషి పుట్టినప్పుడే మృత్యువు నిశ్చితమైంది ఈ జీవితం నీవంటిన చిన్న బట్ట వంటిది. క్రొత్తది కట్టు కున్నప్పుడు సంతోషిస్తావు. కాలక్రమాణ అది చుట్టూ ఉన్న ధూళికి మాసి పాతబడి అసహ్యాకరంగా తయారవుతుంది. దాన్ని ఎప్పటి కప్పుడు సబ్బనే ఆత్మ పరిశీలన, అనే సబ్బుతో ఉతికి శుభ్రం చేసి పశ్చాత్తాప మనే యినుప పెట్టెతో సుద్ది సరిచేసి మడతలు పెడితే మళ్ళీ యథా ప్రకారం తెల్లగా ఉంటుంది. కాని అనేక ఉతుకులకి పడ్డ తర్వాత అది చిరిగి జీర్ణమై పీలికలై పోతుంది. అప్పుడింక దాన్ని ఉపయోగించ లేవు. అతుకులు వేసి కట్టుకుందామన్నా నీ ప్రయత్నం వృథానే. ఒకచోట అతుకు వేస్తే మరోచోట చిరిగిపోతుంది. దాన్ని విసర్జించి మరో క్రొత్త వస్త్రాన్ని ధరించాల్సిందే. అలా చిరిగిన వస్త్రాన్ని విసర్జించేటప్పుడు నీవు విచారిస్తున్నావా? లేదు. క్రొత్త బట్టలు కొని కట్టుకుంటానని సంతోష పడుతున్నావు. జీవితంలో కూడా అదే పద్ధతి అసలు జరుపు. ఈ జీవితం కష్ట నిష్ఠూరాలనే గతుకుల బాటలో పయనించి అనేక దెబ్బలు తిని' అనేక గాయాలు తగిలి మందు మాకులతో మాని—చివరికి నుచ్చ రూపంలో నిల్చిన గాయాలతో చివికి జీర్ణమై శిథిలావస్థలో ఉంటుంది. అటువంటి ఈ జీవితాన్ని విడిచి క్రొత్త జన్మ ఎత్తటానికి దిగులెందుకు? విచారమెందుకు? భయమెందుకు?

క్రొత్త బట్టమీద ఉన్న మమకారం క్రొత్త జీవితం మీద లేదెందుచేత? మొదటిది విజ్ఞానమైనచో రెండవది అజ్ఞానం కాదా బాబూ—నీవే ఆలోచించి చూడు. నీకేబోధపడుతుంది." అన్నాడు నారాయణాచారి ఆయాసంతో గాలి బరువుగా పీలుస్తూ.

"కష్టానికి బాధపడకుండా, సుఖానికి సంతోషించకుండా అన్నిటికీ చలనం లేని రాయివలె ఉండటంలో ఆనందమేముంది నాన్నా. ఏ అనుభూతులూ లేకపోతే భగవంతుడిన్ని, రకాల అనుభవాల్ని కల్పించటం దేనికీ ?" అన్నాడు గోవిందాచారి.

"అనేక అనుభూతులూ, ఆలోచనా శక్తి, బుద్ధి కుశలత, తార్కిక శక్తి, విచక్షణా శక్తి భగవంతుడు మనకి ప్రసాదించటంలో గల అర్థం—మన భవిష్యత్తుకి మనల్ని కర్తలుగా చెయ్యటమే—ఇదే ఆయన ఉద్దేశ్యం. అందర్నీ మంచివాళ్ళగా ఒకే మూసలో రూపొందిస్తే మనం చేసే యత్నమేముంది ? మనకి స్వేచ్ఛేముంది ? కానీ మానవుడు సదా తపించి, తాపత్రయ పడి పరిశ్రమించేది స్వాతంత్ర్య సిద్ధి కొరకే—ఆ స్వాతంత్ర్యమే భగవంతుడు మనకిచ్చాడు. భగవంతుడు అనేక బాటలు సృష్టించాడు. నీ చేతికి దివ్వె యిచ్చాడు. దాని వెలుగు సాయంతో మంచి త్రోవ నీ అంతట నీవే కనుగొనమని నిన్నీ అనంత ప్రపంచంలో నిలబెట్టాడు. నీబుద్ధి కుశలత నుపయోగించి నీ కనువైనట్టి, సులభమైనట్టి బాటని ఎన్నుకోనమని సంపూర్ణ స్వతంత్ర్యం అనుగ్రహించాడు. నీవు కనుగొనే బాటని పట్టి నీ గమ్యా

స్థానం ఉంటుంది. నీమార్గం సుగమ మైంది. అయితే నీవు నిరాఘాటంగా సులువుగా ముందుకి సాగిపోగలవు. నీ బాటని పట్టి అవతల ఊరో, పల్లో, పట్టణమో కనిపిస్తుంది. నీవు ముళ్ళ డొంకల బాటలో నడిచి వెడితే నీ గమ్యస్థానం అరణ్యమో, క్రూరారణ్యమో, ఎడారో—ఏదో అయి వుంటుంది. కాబట్టి బాట వెతుక్కోవటం కష్టమనుకోక, శ్రమ అనుకోక ఓర్పుతో కనిపెట్టితే నీ జీవితం సాఫీగా సంతోషంగా గడిచి పోతుంది" అన్నాడు నారాయణాచారి.

"కర్మానుసారం జరుగుతుందనికొందరంటే మీరేమో మనమే చేసుకుంటున్నా మంటారేం" అన్నాడు గోవిందాచారి.

"అవును. మనకి స్వాతంత్ర్యం యిచ్చినపుడు మనం సరైన బాట కనుగొనలేక కనిపించిన తోవ వెంట వెడితే దానికి తగ్గ ఫలితం అందుతుంది. నీ వొక పనిని యిప్పుడు చేశావు. దాని ఫలితం అప్పుడే రాదు. కొన్ని విషయాల్లో ఫలితాలు చాలా ఆలశ్యంగా వస్తాయి. ఈ లోపల జీవితం పరిసమాప్తి పొందవచ్చు. ఆ కర్మ ఫలాన్ని అనుభవించటానికి గాను పునర్జన్మ ఎత్తుతావు" అన్నాడు నారాయణాచారి.

"అయితే జన్మ రాహిత్యం పొందాలంటే ఏం చెయ్యాలంటారు ?" అన్నాడు గోవిందాచారి.

"జన్మరాహిత్యం చెయ్యాలంటే వెనకటి కర్మ ఫలం అనుభవిస్తూ మరే కర్మనీ చెయ్యకుండా బ్రతకటం" అన్నాడు నారాయణాచారి.

"మర లా కర్మ చెయ్యకుండా ఎలా ఉండగలం నాన్నా" సత్కర్మో దుష్కర్మో చేస్తూనే ఉంటాం కదా" అన్నాడు గోవిందాచారి.

"అదే చెప్తాను. కర్మ చెయ్యకుండా ఉండటం అంటే ఎలాగో చెప్తాను. దానినే నిష్కామ కర్మ అంటారు. అంటే కర్మ చేస్తూ ఫలాన్ని ఆశించక పోవటం—అంటే ఫలాన్ని భగవదర్పితం చెయ్యటం" అన్నాడు నారాయణాచారి.

"అదెలా సాధ్యం నాన్నా. ఫలితాన్ని ఆశించకుండా మన మేపనీ చెయ్యలేం కదా" అన్నాడు గోవిందాచారి.

"నిజమే.అందుకే చెప్పటం.అదంతసులభసాధ్యంకాదు. కేవలం కర్మ చేస్తూ పోవటం మాత్రమే మన కర్తవ్యం. ఫలాఫలాలు దైవాధీనాలు. ఆ ఫలం ఎటువంటిదైనా దైవానికి అర్పించు అప్పుడే నీకు జీవన్ముక్తి కల్గుతుంది" అన్నాడు నారాయణాచారి.

సుభద్ర నోరు తెరుచుకుంది. గురక ఆరంభ మైనది. కొంత సేపటికి, ఉండి, ఉండి పిల్లికూతల వలె శ్వాస తీస్తున్నది సుభద్ర.

నారాయణాచారికి సుభద్ర అంతిమ గడియలు సమీపించినట్లు అవగాహనైంది.

"అమ్మాయ్ అచ్యుతా, తులసితీర్థం తీసుకురా తల్లీ" అన్నాడు.

అచ్యుతవల్లి గ్లాసులో తులసి నీళ్ళు పట్టు కొచ్చింది.

"నాయనా - మీ అమ్మ గొంతులో తులసి తీర్థం రెండు ఉద్ధరిణాలు వెయ్యి బాబూ" అన్నాడు నారాయణాచారి.

గోవిందాచారి తులసి తీర్థం తల్లి నోట్లో పోశాడు. నీళ్ళు గుటక పడక బయటికి వచ్చేశాయి.

పిల్లి కూతలు ఆగిపోయాయి. సుభద్ర యిహ లోక యాత్రకి స్వస్తి చెప్పింది.

నారాయణాచారి, గోవిందాచారి సుభద్రని భూశయనం చేశారు.

సుభద్రకి అంత్యక్రియలు జరిపించి గోవిందాచార్లు మాతృఋణం తీర్చుకున్నాడు.

గోవిందాచారి శలవులు పూర్తిఅయిపోయాయి. ఇంక వెళ్ళవలసిన రోజు దగ్గరపడింది.

"నాన్నా, ఇంక వెడదాం" అన్నాడు గోవిందాచారి.

"ఎక్కడికి బాబూ" అన్నాడు నారాయణాచారి.

"నే నుద్యోగంచేసే ఊరికి నాన్నా" అన్నాడు గోవిందాచారి.

"మీరు వెళ్ళండిరా. నేనిక్కడే ఉంటాను" అన్నాడు నారాయణాచారి.

"నీ వొక్కడివే యిక్కడ ఉండి ఏం చేస్తావు ఎవరున్నారని ?" అన్నాడు గోవిందాచారి.

"మీ అమ్మ ఉన్నదిరా బాబూ" అన్నాడు నారాయణాచారి.

"అమ్మపోయి అప్పుడే యిరవై రోజులైందిగా నాన్నా ఇంకెక్కడి అమ్మ" అన్నాడు గోవిందాచారి విచారంతో.

"మీ అమ్మ యిక్కడే బూడిదైందిగా బాబూ. నేను పుట్టిపెరిగిన ఊరు. ఈ శరీరాన్ని యిక్కడనే వదలనీ బాబూ. ఈ పరిసరాల్ని వదిలి రాలేను. మీ అమ్మ జ్ఞాపకాలతో మిగతా జీవితం వెళ్ళదీస్తాను" అన్నాడు నారాయణాచారి.

"అందుకే వద్దంటున్నాను. మీ రిక్కడ ఒక్కరూ ఉండలేరు. అమ్మ జ్ఞాపకాలతో మీ మనస్సు మరీ కలత బారిపోతుంది" అన్నాడు గోవిందాచారి.

"నేనీ పరిస్థితులకూ, పరిసరాలకూ అలవాటు పడి పోయాను బాబూ. ఇంకెన్ని రోజులో గడువులేదు. ఉన్న నాలుగురోజులూ నిశ్చింతగా భగవన్నామ స్మరణచేసి చని పోవాలనుంది. నన్ను బలవంతం చెయ్యకు" అన్నాడు నారాయణాచారి.

గోవిందాచారి తండ్రి నింక బలవంతపెట్ట దలచుకో లేదు.

మౌనంగా వెళ్ళిపోయాడు.

గోవిందాచారి వెళ్ళవలసిన రోజు వచ్చేసింది. అచ్యుత వల్లి తమ సామాన్లన్నీ సర్దేసింది.

నారాయణాచారి అంతవరకూ పిల్లలతో బాగాఆడు తున్నాడు. వాళ్ళిద్దరూ మాలిమైనారు.

గోవిందాచారి రిక్షా పిలిచాడు. "అచ్యుతా ... రిక్షా వచ్చింది పద" అన్నాడు గోవిందాచారి,

"మామయ్యా - మీ రొక్కరూ యిక్కడ ఉండక పోతే మాతో రాకూడదూ? మీ అబ్బాయి మరీ మరీ అడుగుతున్నారుకదా? అది మాత్రం పరాయి యిల్లు కాదుగా" అన్నది అచ్యుత మామగారితో.

"ఇప్పుడెందుకులే తల్లీ, వాడు సంపాయించేది మీకే చాలదు. పైగా నేనెందుకు బరువు? ఇప్పుడొద్దులే" అన్నాడు నారాయణాచారి.

"ఉన్నదాంట్లోనే కలో, గంజో నలుగురం త్రాగుదాము. అందరం ఒక్కచోట ఉంటే ఏ చింతా ఉండదు. మీ రిక్క డొక్కరూ ఉంటే మాకెలా ఉంటుంది చెప్పండి? తండ్రిని పోషించటం భారమా?" అన్నది అచ్యుత కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"కాదులేతల్లీ, ఊరికే అన్నాను. ఈ ముసలివాడ్ని మరచి పోబోకు" అన్నాడు నారాయణాచారి.

"మిమ్మల్ని మరుస్తామా?" అన్నది అచ్యుత.

"ఇక పదమ్మా, రిక్షావాడికి కోపంవస్తుంది. రైలుకి వేళయి నట్లుంది. ఇడుగో బాబు. ఏరా తాతా? మీ తాతని మర్చిపోతావా?" అంటూ అంతవరకు చంకలో ఉన్న పసివాడ్ని అచ్యుత చేతికిచ్చాడు.

గోవిందాచారి, అచ్యుతా, పిల్లలూ రిక్షాలో యిరుక్కొని కూర్చున్నారు.

"వస్తాం నాన్నా. తరుచు మీ క్షేమం తెలియ జేయండి. చెల్లి జాడ కనుక్కోటానికి ప్రయత్నిస్తాను" అన్నాడు గోవిందాచారి.

"మంచిది బాబూ. ఉంటా తల్లీ" అంటూ కళ్ళనీళ్ళు పైనున్న అంగవస్త్రంతో తుడుచుకున్నాడు.

ఇల్లు బోసిగా ఉంది. మూగవోయిన వీణలా నిశ్శబ్దంగా ఉంది. ఇల్లు జీర్ణావస్థలో ఉంది. ఇంట్లో విలువగల సామానేదీ లేదు.

సుభద్ర చావుబరువు నారాయణాచారి కింతవరకు తెలియలేదు. కానీ గోవిందాచారి కుటుంబ సహితంగా వెళ్ళిపోయాక యిల్లు బావురు మంటున్నది. సుభద్ర లేనిలోటు కనిపిస్తున్నది. ఇంట్లో ఉండబుద్ధికాలేదు. ఊరి సత్రంవైపు వెళ్ళాడు.

సత్రం దగ్గర ఉన్న బావి గట్టుమీద కూర్చొని చెఱువు వైపు చూస్తూ కూర్చున్నాడు.

"ఏం బాబూ. ఈడ కూకుండారేం" అంటూ సాంబయ్యవచ్చాడు గొడ్లని మళ్ళగొడుతూ.

"ఏమీలేదు సాంబయ్యా. ఊరికేనే" అన్నాడు నారాయణాచారి.

"సుబద్రమ్మగారి సావుతో బాగా తెసిపొయ్యారు. అయితే అబ్బాయిగారు ఉన్నారా? ఎల్లారా?" అన్నాడు సాంబయ్య.

"వెళ్ళిపోయాడు సాంబయ్యా" అన్నాడు నారాయణాచారి.

"పాపం, అయితే మీరిప్పుడొక్కళ్లేనన్నమాట ఈడ ఉండేది - మీరుకూడా అబ్బాయిగారితో ఎల్లిపోక పోయారా బాబూ, ఈడ ఒక్కరికీ ఏం తోసుబాటవుద్ది" అన్నాడు సాంబయ్య.

పుట్టి పెరిగిన ఊరు వదలి ఎలా పోయ్యేది సాంబయ్యా. క్రొత్తఊళ్ళోకి వెళ్ళి వాళ్ళని బాధపెట్టి నేను బాధ పడటం దేనికి. గాలికీ, వెలుతురుకీ నోచుకోని ఆ పట్నాల్లో నేనుండ లేను సాంబయ్యా. సూర్య నమస్కారం చెయ్యాలన్నా ఆమడ దూరం వెళ్ళాలేమో! సూర్యదర్శనం చంద్రదర్శనం చెయ్య కుండా దేవుడిచ్చిన గాలీ, వెలుతురూ, నీరూ అనుభవించ కుండా కృత్రిమంగా బ్రతకటం నాకు చేతకాదు. సూర్యు డెప్పుడు ఉదయించాడో, ఎప్పుడు అస్తమించాడో కూడా తెలుసుకోకుండా బ్రతుకుతారు వాళ్ళు" అన్నాడు నారాయణాచారి.

"అయినా ఈడ ఓరుండారు బాబూ. ఒక్కరికీ బిక్కు బిక్కు మంటూంటుంది. కాలు నొచ్చినా సెయ్యి నొచ్చినా చూసే దిక్కేదీ బాబూ అబ్బాయి కాడ ఉంటే మీకూ, ఆరికీ అందరికీ సింత ఉండదు. అన్నట్టు అమ్మాయి గోరు సుభద్రమ్మ సావుకి వచ్చినట్టు లేదే ఎక్కడా ఆపళ్ళేదు" అన్నాడు సాంబయ్య.

రాలేదు. సాంబయ్యా. ఏవో తగాదాలు వచ్చి అమ్మాయీ, అల్లుడూ వేరే ఊరు వెళ్ళారట.'' అన్నాడు నారాణాచారి.

''ఏడకెల్లారో ఆజావు కనుక్కో పొయ్యారా. ఒక్క ఉత్తరం ముక్క రాత్తే వచ్చేదిగందా'' అన్నాడు సాంబయ్య.

''అదే తెలియదు సాంబయ్యా. వాళ్ళ అత్తవారేమీ చెప్పలేదు.'' అన్నాడు నారాయణాచారి.

''పేపర్లో ఏయించక పోయ్యారా? దబ్బున తెల్సొద్ది'' అన్నాడు సాంబయ్య.

''ఏమో సాంబయ్యా, ఆశ్రమ ఎవరు పడ్తారు. ఎక్కడ ఋణముంటే అక్కడ ఉంటారు. అంతా ఋణాను బంధం సాంబయ్యా. ఋణం తీరపోగానే వెళ్ళిపోతారు'' అన్నాడు నారాయణాచారి.

''నేనెల్తుండాను బాబయ్యా. సాయింతరం రచ్చబండ కాడ పురానంకాడ కలుత్తా'' అంటూ సాంబయ్య వెళ్ళి పోయాడు.

ప్రొద్దుకూకేదాకా అలా నిశ్చలంగా కూర్చున్నాడు. ఏ పనీ చెయ్య బుద్ధి కాలేదు.

పురాణం వేళ అయిందని రంగయ్య వచ్చి పిలుస్తే వెళ్ళాడు.

పురాణ పఠనంతో నారాయణాచారి మనస్సు కొంత తేలిక పడింది. మనస్సు నిర్మలంగా ఉంది.

పురాణం చెప్పటంలో లీనమై తనని తానే మరిచాడు. అలా చెప్పుకు పోతున్నాడు.

"ఈ రోజు కింక చాలు బాబూ తమరు వంట సేసుకోవాలి గదా" అంటూ రంగయ్య గుర్తుచేశాడు.

నారాయణాచారికి స్పృహ కల్గింది. పుస్తకం మూసి లేచాడు.

రంగయ్య, సాంబయ్య నారాయణాచారి యింటివరకు వచ్చి దిగబెట్టి "ఇంక ఎల్తాం. బాబూ. పొద్దోయింది" అంటూ దణ్ణాపెట్టి వెళ్ళిపోయారు.

నారాయణాచారి పురాణం దగ్గర తెచ్చి యిచ్చిన పళ్ళు పుచ్చుకొని మంచి నీళ్లు త్రాగేడు.

నులకమంచం వాకిట్లో వేసుకొని వెల్లకిలా పడుకొని ఆకాశం వంక చూస్తున్నాడు.

చల్లటి వెన్నెలతో ప్రకృతి ఆహ్లాదంగా ఉంది. గాలి తాకిడికి ఆకులు అల్లలాడుతూ ఒకదానికి ఒకటి రాచుకొని శబ్దం చేస్తున్నాయి. చెఱువులోని కప్పలు బెకబెక మంటున్నాయి. కీచురాళ్ళు అరుస్తున్నాయి, చెట్లమీద పిట్టలు రెక్కలు తటతట కొట్టుకుంటున్నాయి. చంద్రుడు మబ్బులతో దోబూచులాడుతున్నాడు. చుక్క కన్నెలు మబ్బుల చాటునుంచి చంద్రుడి వంక ఓరగా చూచి మళ్ళీ సిగ్గుతో మబ్బుల వెనక దాగుంటున్నాయి.

ఆ చల్లగాలికి నారాయణాచారి కళ్లు మూసుకున్నాడు. నిద్రలో మునిగిపోయాడు.

ప్రకృతి నక్షత్రాలనే దీపాలతోనూ చంద్రుడనే భటుడ్ని నియోగించి ప్రపంచాని కంతా పహారా యిప్పిస్తున్నది. దొంగతనాలూ, దోపిడీలు జరగకుండా చంద్రుడు కాపలా కాస్తున్నాడు. ప్రకృతి రాజ్యంలోని ప్రజలంతా నిద్రాదేవి ఒడిలో నిశ్చింతగా నిద్రిస్తుంటే ప్రకృతి మాత్రం అజాగ్రత్తగా ఉండక తన ప్రజల వస్తు వాహనాల్ని, ప్రాణాల్ని కాపాడుతున్నది.

# 15

లక్ష్మి శ్రద్ధగా చదవటం ప్రారంభించింది. దాని ఫలితంగా క్లాసులో మంచి మార్కులు వచ్చేవి. ఆడ పిల్లల్లో లక్ష్మిదే పై చెయ్యి. ఆటలూ పాటల్లో ఉత్సాహంగా పాల్గొనటంవల్ల అందరికీ ఆమె నాయకురాలైంది. పోటీల్లో గెలవటంవల్ల ఆటల్లో ఛాంపియన్ లక్ష్మి. లక్ష్మికి కెప్టెన్ హోదా లభించింది.

ఆ రోజున మొగపిల్లలకీ, ఆడపిల్లలకీ కలిపి పోటీ ఏర్పాటైంది.

ఆడపిల్లల జట్టుకి లక్ష్మి కెప్టెన్. బాడ్మింటన్, త్రోబాల్, రింగ్ టెన్నిస్ ఆడారు.

బాడ్మింటన్‌లో లక్ష్మి వాళ్ళ జట్టుకి విన్నర్ ప్రైజ్ వచ్చింది. రింగ్ టెన్నిస్‌లో రన్నర్స్ ప్రైజ్ వచ్చింది.

ఆడపిల్లలంతా లక్ష్మిని ఎత్తేసినంత పనిచేశారు. షేక్ హాండ్లు యిచ్చీ, యిచ్చీ లక్ష్మి చెయ్యి నొప్పిపుట్టింది.

“ఇంక చాలర్రా బాబూ” అన్నా వినకుండా లక్ష్మి చేయి పుచ్చుకొని ఊపేస్తున్నారు.

ఇంతలో ఆడపిల్లల మధ్యనుంచి దూసుకొని చంద్ర మోహన్ వచ్చాడు. లక్ష్మి చేయి పట్టుకొని షేక్ హేండు యివ్వబోయాడు. లక్ష్మి అప్రమత్తతగా ఉందేమో, ఎదుటి మనిషి మొగో, ఆడో గమనించలేదు. చేయి ఊపాక తెలివి తెచ్చుకొని చూస్తే చంద్రమోహన్ !

లక్ష్మికి సిగ్గేసింది. కోపం వచ్చింది. సంతోషమూ కలిగింది. అన్నీ ఒక్కుమ్మడిగా లక్ష్మి మనస్సుని ఆక్రమించి అల్లకల్లోలం చేసేశాయి.

ఇందరు ఆడపిల్లల మధ్య యితనా? అందరూ ఏమను కుంటారు ? ఇతనెందు కిలా చేశాడు ? తనని అవమానించ టానికా ? చెయ్యి చటుక్కున లాక్కొని రెండు చేతులెత్తి నమస్కరించింది.

"మీరింత అద్భుతంగా ఆడతారని అనుకోలేదు." అన్నాడు చంద్ర మోహన్ నవ్వుతూ.

"అద్భుతం ఏమీ లేదు. నాకు చేతనైనట్లు ఆడాను. అంతే. ఏదో అదృష్టం కొద్దీ గెలిచాము" అన్నది లక్ష్మి.

"ఎవరే యితను" అన్నది వనజ.

"నీకు తెలీదుటే—జాబిల్లి" అన్నది సుందరి.

"అంటే రేరాజా? మరి పగలే ప్రత్యక్షమైనాడే" అన్నది లత ఫక్కున నవ్వి.

"అదే మరి విచిత్రం, ఏమే లక్ష్మి ... ఎలాంటి ఫ్రెండేవ్" అన్నది శోభ.

"ఏమీ కాదు. మా క్లాసు మేటు" అన్నది లక్ష్మి మూతి ముడిచి.

"పేరేమిటో—" అన్నది శకుంతల.

"దుష్యంతుడు కాదులే" అన్నది వసంత.

"మరేమిటో..." అన్నది కనకం.

"పేరా, చంద్రమోహన్" అన్నది సుందరి.

"చాలా సుందరమైన పేరు కదూ" అన్నది సుమిత్ర.

"పేరు కాదు సుమిత్రా, మనిషి కూడా" అన్నది సుందరి సిగ్గుపడుతూ.

"అంతేనా మనసు కూడానా" అన్నది కనకం.

"మొత్తానికి అందానికి తగ్గ పేరు... పేరుకు తగ్గ అందం" అన్నది వసంత.

"ఏమిటే కాకి గోల. పదండర్రా కాఫీ త్రాగుదాం" అన్నది లక్ష్మి విసుగుతో.

చంద్రమోహన్‌కు ముచ్చెమటలు పోశాయి. ముదితల ముద్దు మాటలు విన్న తర్వాత జేబురుమాలుతో తుడుచుకుంటూ "వస్తానండీ-నమస్తే" అంటూ వెళ్ళిపోయాడు.

"అదేమిటే లక్ష్మి, అతన్ని మాకు పరిచయం చెయ్యకుండా పంపేశావు! కొరుక్కు తింటామని భయమా?" అన్నారు అంతా ముక్తకంఠంతో.

"అతన్ని తా రెత్తించి పంపేసింది మీరే. అలా పేర్లు పెడుతూంటే అతనికి ఊపిరాడక వెళ్ళిపోయాడు పాపం" అన్నది లక్ష్మి నవ్వుతూ.

"ఇంతకీ... గ్రంథం...ఎంతవరకూ నడిచిందేమిటి ?" అన్నది సుందరి అసూయతో బాధపడుతూ.

"గ్రంథాలు లేవు. సుగంధాలు లేవు. పదడంగ్రా— కేవలం పరిచయం మాత్రమే" అన్నది లక్ష్మి మూతిముడిచి,

"పాపం. పిల్ల డిజపాయింటైన ట్లుందర్రా. సాయం చేద్దాం పట్టండి" అన్నారు అంతా.

"సాయం అక్కర్లేదు, గాయం అక్కర్లేదు. నన్నిలా విడిస్తే సంతోషిస్తాను" అన్నది లక్ష్మి.

"ఓహో ! అదా సంగతి. నిన్నెవరూ పట్టి ఉంచలేదు. వెళ్ళరాదా" అన్నది సుందరి.

"ఎక్కడకో" అన్నది కనకం.

"ఏట్లోకి" అన్నది లక్ష్మి మండి పడుతూ.

"అమ్మాయిగారికి అలక వచ్చిందే. పాపం పానకంలో పుడకల్లా అడ్డం వద్దాం గాబోలు" అన్నది శకుంతల.

"ఛీ... పోండర్రా. ఎవరైనా ఆడది మగాడితో మాట్లాడితే సరి... పేర్లు పెట్టేస్తారు— బుద్ధి తక్కువ పిల్లలు— మళ్ళీ—అంతా చదువుకున్న వారు—విశాల హృదయులు ...నవనాగరీకులు" అన్నది లక్ష్మి.

"ఓహో—బాగుందిలే. మేము మాత్రం ఏమన్నాం. సిగ్గూ, ఎగ్గూ లేకుండా, ఆడా మగా విచక్షణ లేకుండా అత

గాడు షేక్‌హేండు యిస్తే బాగుండి. ఊరికే వేళాకోళానికి అంటే కోపం వచ్చింది అమ్మగారికి” అన్నది సుమిత్రి.

“మరి రాదూ, దొంగని దొంగ అంటే ఊరుకుంటా డుటే పిచ్చిదానా” అన్నది వనజ.

“సరే బాబూ. మీ యిష్టం వచ్చినట్లు అనుకోండి. నేను వెడుతున్నా. నాకు అలుపుగా ఉంది” అన్నది లక్ష్మి వెళ్ళటానికి కుద్యుక్తురాలై.

“వెళ్ళవే—ఎంత తొందర పడుతోందో చూడండి. పైగా శ్రీరంగ నీతులు చెబుతోంది” అన్నది సుందరి.

లక్ష్మి తన పుస్తకాలు తీసుకొని వెళ్ళిపోయింది. చాల అలసటగా ఉంది. హాయిగా కాసేపు చల్ల గాలికి తిరిగి వస్తే బాగుండు ననిపించింది.

హాస్టలుకి వెళ్ళి స్నానం చేసి బట్టలు మార్చి తల దువ్వుకొని, పూలు ముడుచుకొని బయలుదేరింది.

“ఎక్కడికే లక్ష్మీ” అన్నది సావిత్రి. సావిత్రి లక్ష్మి రూమ్ మేటు.

“అలా చల్లగాలికి తిరిగి వద్దాం వస్తారా?” అన్నది లక్ష్మి.

“ఉహూ నేను రాను బాబూ. చదువుకోవాలి” అన్నది సావిత్రి.

“అస్తమానం ఏం చదువువే. బుర్ర పాడైపోతుంది” అన్నది లక్ష్మి.

"అవునే. ఫస్టు మార్కులు కొట్టేవారికి అలాగే ఉంటుంది. అందరూ నీ అంత తెలివి కలవాళ్ళు కాదుగా మరి, కష్టపడి చదివితేగాని పాసు మార్కులురావు" అన్నది సుమిత్ర చిన్న బుచ్చుకొని ముఖం మాడ్చుకుంటూ.

"నేనే మన్నానే. తెలివి తేటల్లో అందరూ సమానమే. వాటిని ఉపయోగించటంలోనే ఉంది కిటుకంతా" అన్నది లక్ష్మి.

"ఏమోబాబూ. నాకు మాత్రం ఎంత చదివినా సబ్జెక్టు బుర్ర కెక్కదు. వీక్లీలు—నావల్సు చదవమంటే—కంఠతా వచ్చేట్లు చదువుతాను" అన్నది సుమిత్ర.

"అదే. నీ తెలివి తక్కువ అక్కడే ఉంది. నీవు యితర పుస్తకాలమీద చూపే శ్రద్ధ క్లాసు పుస్తకాలమీద చూపితే ఫస్టు మార్కులు కాదు—యూనివర్సిటీ ఫస్టు వస్తావు. శ్రద్ధలేదని చెప్పు. ఒప్పుకుంటాను" అన్నది లక్ష్మి.

"ఏమోబాబూ. అసలు యింటరెస్టింగ్ సబ్జెక్టు ఒక్కటి ఉందా. అంతా వ్యాకరణం లాగ ఉంటుంది. అందులో—చవీ—సారం—రెండూ లేవు. బలవంతాన—చేదు మాత్రలు మింగినట్లు చదవటమే—అదైనా మావాళ్ళ కోసం—తప్పితే చదివించరని—చదవకపోతే స్వేచ్ఛ పోతుందని నా భయం—" అన్నది సుమిత్ర.

"అయితే పెళ్ళాడ వన్నమాట" అన్నది లక్ష్మి నవ్వుతూ.

"మరే-ఆ మాటంటేనే నాకు వణుకు పుట్టుకొస్తుంది. ఈ మొగవాళ్ళని చూస్తే నమిలి మింగెయ్యాలన్నంత కోపం వస్తుంది" అన్నది. సుమిత్ర.

"అంత పనిచెయ్యకు. చీకటి పడింది. త్వరగా వెళ్ళి వస్తా. నీ యిష్టం. వస్తే రా. చదువుకుంటే చదువుకో—మళ్ళీ చదువు చెడగొట్టానని ఏడుస్తావు" అన్నది లక్ష్మి.

"వెళ్ళి రద్దూ. త్వరగా రా. గేటు వేసేస్తే మళ్ళీ కష్టం" అన్నది సుమిత్ర.

"అలాగే" అంటూ గేటు దాటి వచ్చింది లక్ష్మి.

పార్కువైపు నడిచింది.

అప్పుడే వీధి దీపాలు వెలుగుతున్నాయి.

లక్ష్మివెళ్ళి పార్కులో ఓ చెట్టు క్రింద వచ్చికమీద కూలబడింది. రేడియోలోనుంచి వార్త లొస్తున్నాయి. లక్ష్మికి వార్తలు వినటం అలవాటు లేదు. ఏదో ఆలోచిస్తూ కూర్చుంది.

"రామచంద్రం ఏం చేస్తున్నాడో..." అనుకుంది లక్ష్మి.

"పాపం—స్కూలునించి వచ్చి ఉంటాడు. బట్టలు మార్చి టిఫిన్‌చేసి తనలాగే చల్లగాలికి బయలుదేరటానికి సిద్ధపడుతుంటాడు. 'చంద్రికో'...'ఛీ...ఛీ' చంద్రిక అక్కడ లేదట. ఎక్కడికోవెళ్ళి పోయిందట. తండ్రి వ్రాసిన ఉత్తరం సారాంశం అది. తను వెడితే" అనుకుంది లక్ష్మి.

"ఇంతవరకూ వెళ్ళకుండా యిప్పుడు వెడితే ఏమను కుంటారు? అయినా తనకా యింటిమీద చూపు పోలేదేం. దృషి అక్కడే ఉందేం?" అనుకుంది లక్ష్మి.

బుజంమీద చల్లగా ఏదో పడింది. ఉలిక్కిపడింది. రెండు చేతులు బలంగా తనని వాటిలో యిముడ్చుకోవాలని ప్రయత్నిస్తున్నాయి. లక్ష్మికి మైకం కమ్మినట్లైంది. అలా తనని రెండు చేతులు బంధించి ఎంత కాలమైంది? అవి ఎవరి చేతులు? తన భర్తా? ఇక్కడికెలా వచ్చాడు? లక్ష్మి కళ్ళుమూసుకొని ఆలోచిస్తోంది. అది కలో, నిజమో తెలియటంలేదు. తనెక్కడ ఉందో గుర్తుకు రావటంలేదు. ఆ రెండు చేతులూ, తనని బలంగా లాక్కుని తనలో యిముడ్చుకున్నాయి. లక్ష్మి నలిగిపోయింది. ఎక్కడివా చేతులు? కళ్లు విప్పి చూడాలనుకుంది. కానీ—కల చెదిరి పోతుందేమోనన్న భయంతో కళ్ళని తెరవలేకపోయింది. గట్టిగా అరవాలనుకుంది. కానీ, గొంతు మూగపోయింది. నోటినుంచి శబ్దం రాలేదు.

లక్ష్మికి హఠాత్తుగా మెళకువ కలిగినట్లైంది. ఎవరూ? తనెక్కడున్నదీ? బలమంతా ఉపయోగించి ఆ చేతుల్ని విడదీసి అవతల పడింది.

"లక్ష్మి — ఏమిటలా పారిపోతున్నావు. నేనే" అన్నాడు చంద్రమోహన్.

"ఆ! నీవా... ఛీ... ఛీ... ఎంత పనిచేశావు... ...నా జీవితం... ...సర్వనాశనం చేశావు కదా" అంటూ కూల

బడి వెక్కి వెక్కి ఏడుస్తున్నది. చేతుల మధ్య తల యిరికిం చింది. వెక్కిళ్ళు వినవస్తున్నాయి.

"ఏమిటి లక్ష్మి... నన్ను... నన్ను అర్థం చేసుకో... నేను... నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నిన్ను పెళ్ళిచేసు కుంటాను. అన్యాయం చెయ్యను. మోసగించను. నన్ను నమ్మలేవా" అన్నాడు చంద్రమోహన్ జాలిగా చూస్తూ.

"ఛీ... ఛీ... నన్నెలా వివాహం చేసుకుంటావు? మనిద్దరి మధ్యా పెద్ద అగాధం ఉంది... అది నీవు దాటలేవు. చేసుకుంటావా చెప్పు... స్త్రీకి... విలువైంది... ఏదో... అది కాస్తా... హరించావు. చెప్పు... చేసుకుంటావా" అన్నది లక్ష్మి ఆవేశ పడుతూ.

"చెప్తున్నానుగా లక్ష్మీ. ఈ చంద్రుడి సాక్షిగా, ఈ ప్రకృతిసాక్షిగా నిన్ను నేను వివాహం ఆడతాను... ఎన్ని అవాంతరాలనైనా దాటుతాను" అన్నాడు చంద్రమోహన్ లక్ష్మికి దగ్గరగా జరిగి లక్ష్మి చెయ్యి తన చేతిలోకి తీసుకుంటూ.

"చేసుకుంటావా? నేను... నేను..." అంటూ ఆగి పోయింది లక్ష్మి. మళ్ళీ ఏడ్పు వినిపించింది.

"లక్ష్మి... ఏడవకు... ...నీకు—నా మీద నమ్మకం లేదూ" అన్నాడు చంద్రమోహన్.

"లేదు... చెప్పు... నిజం చెప్పు... చేసుకుంటావా" అన్నది లక్ష్మి.

"ఊ... దైవసాక్షిగా" అన్నాడు చంద్రమోహన్.

"నేను... నేను... వివాహితను" అన్నది లక్ష్మి బిగ్గరగా ఏడుస్తూ.

"ఆ... వివాహితవా ... అంటే... అంటే... నీకు... ముందే పెళ్ళయిందా... ... మరి... భర్త... ... పోయాడా" అన్నాడు చంద్రమోహన్.

"ఛీ... లేదు... ఆయన సజీవంగానే... ఉన్నారు... " అన్నది లక్ష్మి. బెక్కుతూ.

"అయితే... ... నీవిలా... ... చదవటానికి కారణం" అన్నాడు చంద్రమోహన్.

"మాట పట్టింపులు" అన్నది లక్ష్మి.

"పెద్దలవా" అన్నాడు చంద్రమోహన్.

"కాదు... మాకే... తప్పునాదే... నేనిలా పట్టు పట్టి రాకుండా ఉంటే... ఉంటే... నాకీ గతి... పట్టేది కాదు" అన్నది లక్ష్మి ఏడుస్తూనే.

"నీ వొక్కసారైనా... వివాహితలా ప్రవర్తించలేదు ... చెప్పనూలేదు... ఎవరూ నిన్ను చూచి వివాహితగా... గుర్తించలేదు... ... అది నా దౌర్భాగ్యం. నేను... ... మహాపరాధం చేశాను—దానికి నిష్కృతిలేదు. నే నింక యిక్కడ ఉండలేను... లక్ష్మి... క్షమించు సోదరీ... నేను వెడుతున్నా ...నా కడసారి నమస్కారం అందుకో" అంటూ వెళ్ళిపోయాడు చంద్రమోహన్.

"మోహన్" అంటూ పిలిచింది. లక్ష్మి. ఆ మాట లామె పెదవులు దాటి రాలేదు. ఆమె మాటలు చంద్ర మోహన్ చెవి దాకా వెళ్ళలేదు.

లక్ష్మి అలా ఎంత సేపు కూర్చుందో......పార్కు నిర్మానుష్యం అయింది. గూర్ఖావాడు వచ్చి 'చాలా ప్రొద్దు పోయిందమ్మా—పదండి' అనే దాకా అలాగే కూర్చుంది.

మెల్లిగా లేచి నడిచింది. కనిపించిన రిక్షాలో ఎక్కి హాస్టలు చేరింది.

గేటు మూసి ఉంది. గూర్ఖా చేతిలో రూపాయి ఉంచి లోపలికి వెళ్ళిపోయింది.

సుమిత్ర యింకా చదువుతూ ఉంది.

"లక్ష్మి" అన్నది సుమిత్ర.

లక్ష్మి వినిపించుకోకుండా మంచం మీద వాలింది.

సుమిత్ర పిలుపు వినిపించుకోలేదు. సుమిత్ర ఆశ్చర్య పోయింది. లక్ష్మి వెళ్లేటప్పుడు అలాలేదు. ఇంతలో ఏమైంది? వెళ్ళింది పార్కుకి కదా? ఏమి జరిగి ఉంటుంది! చీకట్లో భయపడిందా? ఎవరైనా కుర్రవాడు హేళన చేశాడా? అవమానించాడా? వెంటబడ్డాడా? ఏమైంది?

"లక్ష్మి—అసలు సంగతి నాకు చెప్పవూ" అన్నది సుమిత్ర మృదువుగా లక్ష్మి ముంగురులు సరిచేస్తూ.

లక్ష్మినుంచి మాటలేదు. వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

"లక్ష్మీ" అంటూ బలవంతాన లక్ష్మిముఖాన్ని తన వైపు త్రిప్పుకొంది. లక్ష్మి కళ్ళు వాల్చింది. కన్నీళ్ళు చెక్కిళ్ళమీదనుంచి కారి వక్షస్థలం తడుపుతున్నాయి.

"ఏమిటో చెప్పవూ? ఏం జరిగిందసలు? వెళ్ళేటప్పుడు కులాసాగా ఉన్నావుగా" అన్నది సుమిత్ర కన్నీళ్ళుతుడుస్తూ.

"ఏమీలేదు" అన్నది లక్ష్మి ఏడుపు ఆపి.

"చెప్పవూ? ఇదేనా మన స్నేహం? నీ కష్టంలో పాలుపంచుకోలేని నేను నీకెలా స్నేహితురాల్ని అవుతాను" అన్నది సుమిత్ర అనునయిస్తూ.

లక్ష్మి ఏమని చెప్తుంది? ఎలా చెప్తుంది? ఎక్కడి నుండి మొదలెట్టాలి? ఇంతవరకు పూర్తి నిజాన్ని ఎవరికీ చెప్పలేదు. తను వివాహిత అని ఎవరికీ తెలియనివ్వలేదు. హావభావాల్లో, కట్టుబొట్టు తీరులో, మాటల సందర్భంలో - ఎక్కడా తను వివాహిత అన్న విషయాన్ని వెల్లడించేలా ప్రవర్తించలేదు. అందరు అవివాహితల్లా - ఆడింది-పాడింది-మొగవాళ్ళని వెక్కిరించి-వేళాకోళంచేసి-ఉసిగొల్పి-ఊరంతా త్రిప్పి - కిలకిల నవ్వింది. అందుకు ఫలితం - ఇప్పుడను భవిస్తోంది. రెండికీ చెడ్డ రేవడిగా తయారైంది బ్రతుకు. అటు భర్తనీ చేరలేక - ఇటు ప్రేమించిన వాడికీ పనికి రాక-త్రిశంకు స్వర్గంలో వ్రేలాడుతోంది. ఈ బాధతో తనింక చదవలేదు. ఈ వాతావరణంలో తనింక నిశ్చింతగా బ్రతకలేదు. బాధల్ని - గాధల్ని - అగాధాల్ని - మించి - గడిచి - వచ్చాననుకుంది. ఉల్లాసంగా ఉందామనుకుంది.

ఉత్సాహంగా ఉరుకు లెత్తుదామనుకుంది. కానీ - వెనకటి బాధ మరపుకొచ్చే బదులు మరింత రంగులు తాల్చి భీకరంగా తన ఎదుట నిల్చి ఉంది. తను చెప్పిన నీతులు-తన బాసలు-తన ఆశలు - తన ఆశయాలు - అడియాసలై, గగన కుసుమాలై, ఎండమావులై పోయాయి. ఇంక మిగిలింది పాపమూ, పశ్చాత్తాపమూ-లక్ష్మి దీర్ఘంగా నిట్టూర్చింది.

"ఏమిటో చెప్పవూ ? ఇంత బ్రతిమిలాడుతున్నాను. ఎవరితోటీ చెప్పనని ఒట్టుపెట్టుకుంటున్నాను" అన్నది సుమిత్ర లక్ష్మివంకచూస్తూ. లక్ష్మి కన్నీళ్ళు ఆగిపోయాయి. పెదవులపై విషాధ భరితమైన చిరునవ్వు మబ్బుల మధ్య మెరుపులాగ ఒక్కసారి మెరిసి మాయమైంది.

"చెప్పాలక్ష్మి - నన్ను చంపకు" అన్నది సుమిత్ర కాస్త విసుగ్గా.

"మా అమ్మకి జబ్బుగా ఉందట. మా వూరి మనిషి కనిపించి చెప్పాడు. ఉత్తరం అందలేదా అని అడిగేడు" అన్నది లక్ష్మి అబద్ధం ఆడుతూ.

"ఓస్ - ఈ పాటి దానికేనా ? అయినా మీ అమ్మకి జబ్బుగా ఉంటే మీ నాన్న టెలిగ్రాం యివ్వకపోయారా ? అతనేదో ఉత్ప్రేక్షించాడు. ఏదో మామూలు జ్వరమో - ఏదో - అయి ఉంటుంది. రేపు వెడుదువుగానిలే" అన్నది సుమిత్ర తేలిక పడిన మనస్సుతో.

"కాదు - బాగా సీరియస్‌గానే వుందన్నాడు. సరే ఏది ఏమైనా - నేనింటికి వెడతాను రేపు" అన్నది లక్ష్మి.

"వెళ్ళిరావోయ్ పిచ్చి పిల్లా - ఆటల్లో కాప్టెన్‌వి. ఛాంపియన్ షిప్ సంపాదించావు. అయినా అబలలా ఏడుస్తావు - సబలలా కబుర్లు చెబుతావు - ప్చ్ - పనికిరావోయ్ నీవు." అన్నది సుమిత్ర నవ్వుతూ.

"ఊఁ - నాకు తలనొప్పిగావుంది. నేను పడుకుంటాను. లైటు తీసెయ్యి" అన్నది లక్ష్మి మంచం మీదకి వెడుతూ.

"అలాగేలే - నాకూ నిద్రవస్తున్నది. తెల్లవారు ఝామున లేస్తాలే. పడుకో - లైటు తీసేస్తా" అంటూ వెళ్ళి లైటు తీసేసింది సుమిత్ర.

ఇద్దరూ ఎవరి ప్రక్క మీదికి వారు చేరారు.

సుమిత్ర నిశ్చింతగా నిద్రపోతున్నది. లక్ష్మి మెల్లిగా లేచి కిటికీ తెరిచి బయటికి చూస్తూ కూర్చుంది తెల్లవారే దాక. అప్పుడు వెళ్ళి ప్రక్కమీద పడుకుంది.

సుమిత్ర వచ్చి లేపింది. 'లక్ష్మి' 'లక్ష్మి' అంటూ.

లక్ష్మి లేవలేదు.

"ఎంత మొద్దు నిద్దరే బాబూ, లే - లే - ఊరికి వెడతానంటివే" అంటూ చెయ్యిపట్టి లేవదీసి కూర్చోబెట్టింది.

లక్ష్మి బద్ధకంగా ఆవులిస్తూ కూర్చుంది. "అదేమిటే-రాత్రంతా నిద్ర పోనట్టుంది—ఏడుస్తూ కూర్చున్నావా? పిచ్చి పిల్లా—త్వరగా తెములు—రైలుకు టైమ్ అయిపోయింది" అన్నది సుమిత్ర.

లక్ష్మి లేచి కాలకృత్యాలు తీర్చుకుంది. సామాన్లన్నీ సర్దేసింది. కాఫీ త్రాగింది. పని మనిషితో రిక్షా పిలవమని చెప్పింది.

రిక్షా వచ్చి ఆగింది. లక్ష్మి సామానంతనీ పని మనిషి రిక్షాలో పెట్టింది. లక్ష్మి రిక్షా ఎక్కి కూర్చుంది.

"లక్ష్మి - మీ అమ్మగారి ఆరోగ్యం ఎలా ఉందీ రాస్తావు కదూ—మరిచి పోకు—అజాగ్రత్త చేయకుండా—మంచి మందు యిప్పించండి" అన్నది సుమిత్ర.

"అలాగేనే సుమిత్రా - వస్తాను - మరిచి పోకు - ఉత్తరాలు వ్రాస్తుండు" అన్నది లక్ష్మి చెయ్యి ఊపుతూ.

"ఉంటా నింక-" అంటూ చెయ్యి ఊపింది సుమిత్ర.

రిక్షా కదిలి వెళ్ళేదాకా చూస్తూ నిలబడ్డది సుమిత్ర! రిక్షా మలుపు తిరిగి మాయమవటంతో నిట్టూర్చి తన గదికి వెళ్ళిపోయింది.

లక్ష్మి టిక్కెట్టు తీసుకొని రైలెక్కి కూర్చుంది.

ఆలోచనలు అలలవలె లేచి మానస సముద్రాన్ని అల్లకల్లోలం చేసేస్తున్నాయి.

తనెందుకు యింటికి వెడుతున్నట్లు? వెళ్ళి చేసేదేమిటి?

అమ్మావాళ్ళు 'అర్థాంతరంగా యిలా వచ్చావేం? చదువెందుకు మానేశావు' అంటే తనేం సమాధానం చెప్తుంది? అక్కడ కాలమెల్లా గడుస్తుంది?

లక్ష్మి ఇలా ఆలోచిస్తూ రైలు ఊపుకి నిద్రలోకి జారింది. రాత్రంతా మేలుకొని ఉండటంతో నిద్రముంచు కొచ్చింది.

బెర్తుమీద హోల్డాల్ పరిచి పడుకున్నది. రైలు తనంత తాను ఆడుతూ, నడుస్తూ దిగేవారిని దింపుతూ, ఎక్కే వారిని ఎక్కించుకుంటూ తన శక్తికి మించిన బరువుని తనలోనే యిముడ్చుకొని బాధగా మూలుగుతూ ముందుకి పోతున్నది.

లక్ష్మి గమ్యస్థానంచేరే ముందే హఠాత్తుగా మేల్కొంది. కొంప తీసి రైలు కాస్తా-తన వూరిని దాటిపోలేదు కదా-అని గాబరా పడుతూ అటు నిటు చూచింది.

ప్రక్కవాళ్ళని 'ఏమండీ-ఇదే స్టేషన్' అంటూ అడిగి యింకా తమ వూరు రాలేదని విని ధైర్యం కూడదీసుకొని దిగటానికి సిద్ధపడుతూ వుంది.

రైలు లక్ష్మిని గమ్యస్థానానికి చేర్చింది. లక్ష్మికి రైలు నుంచి దిగటానికి కాళ్ళాడలేదు.

ఎలాగో దిగి రిక్షా ఎక్కింది.

---

# 16

"ఏమండీ - అమ్మాయి వెళ్ళి చాలా కాలమైంది." అన్నది అన్నపూర్ణమ్మ మధ్యాహ్నం టిఫిన్ తెచ్చి శేషాచారి ముందుంచుతూ.

"ఊ" అన్నాడు శేషాచారి పేపరుచూస్తూ.

"అస్తమానం మీ పరధ్యానమే తప్ప మరొకరి మాట చెవిని వేసుకోరు" అన్నది అన్నపూర్ణమ్మ నిష్ఠూరంగా.

"ఏమిటే బాబూ నీ సొద - చెప్పు - ఏంకావాలో" అన్నాడు శేషాచారి తలెత్తి చూస్తూ.

"కాస్త ఈ ఫలాహారం పుచ్చుకోండి - నేను అమ్మాయిమాట అడుగుతున్నాను" అన్నది అన్నపూర్ణ.

"ఏమని అడుగుతున్నావు?" అన్నాడు శేషాచారి పేపరు మడిచి బల్లమీద పెడుతూ.

"అల్లా అడగండి చెప్తాను - అమ్మాయి నొక్క దాన్ని వదిలి మనం - యిక్కడ ఉండటం - నాకు బాగాలేదు. ఒక్కగా నొక్క పిల్ల మనంకూడా అక్కడికి వెడితే" అన్నది అన్నపూర్ణ.

"వెడితే ఏముంది? ఇల్లు పాడుపడుతుంది. తోట ఎండి పోతుంది - ఇంట్లో సామాను బయటి కెళ్ళిపోతుంది - బ్యాంకులో డబ్బు ఖాళీ అవుతుంది" అన్నాడు శేషాచారి నవ్వుతూ.

"మీ కెప్పుడూ నవ్వులే. ఇల్లువదిలి పెట్టి పోవటం దేనికీ" అన్నది అన్నపూర్ణ.

"అయితే మనకూడా తీసుకుపోదా మంటావా? దానికి చక్రాలయినా పెట్టించలేదు మా వాళ్ళు. భూమిలో బలంగా పాతేశారు - నీ ఆలోచన పాపం వాళ్ళకి తెలీదుగా! లేకపోతే చక్రాలు పెట్టించేవారే - సులువుగా ఎటుబడితే అటు - ఎక్కడికి బడితే అక్కడికి వెళ్ళిఉండవచ్చు. ఎలాంటి సమస్యలూ ఉండేవికావు. నేరుగా వెళ్ళి అమ్మాయి అత్తవారింటి దగ్గరే ఎదురుగా ఉండేవాళ్ళం. ఇద్దరూ కనిపిస్తుండేవాళ్ళు" అన్నాడు శేషాచారి.

"చాల్లెద్దురూ - వయస్సు ముదిరిన కొద్దీ బుద్ధి పెడ దారిన పడుతున్నది. ఏదీ తీవ్రంగా ఆలోచించరు. అన్నీ - మామూలుగా తీసుకుంటారు" అన్నది అన్నపూర్ణమ్మ కోపంతో.

ఇంతలో రిక్షా వాకిట్లో ఆగింది. లక్ష్మి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ పిల్లి నడకతో తలవంచుకొని వస్తున్నది.

"అదుగో అమ్మాయి - నూరేళ్ళాయుషు తల్లీ! మీ అమ్మ నిన్ను గూర్చే విచారిస్తున్నది" అంటూ లేచి కూతురికి ఎదురుపోయాడు.

"ఇప్పుడొచ్చావేమే అమ్మాయ్! పరీక్షలు కాలేదు గాబోలు! పరీక్షల ముందు వచ్చావే" అన్నది అన్నపూర్ణమ్మ కూతురిని చూస్తూ.

"ఒసే - అనూ - నీతో అన్నీ చెప్పలేనే - అదిరాక పోతే గాలేదని యింతవరకూ వేధిస్తుంటివి. అది కళ్ళబడ గానే - సాధింపులు మొదలెడితివి -" అన్నాడు శేషాచారి.

లక్ష్మి మాట్లాడకుండా తనగదివైపు కెళ్ళబోతున్నది.

"అదేమే - మాటాపలుకీ లేకుండా వెడుతున్నా వెక్కడికి? అలాకూర్చో - టిఫిన్ తీసుకుంటే - కొంత ఆకలి తీరుతుంది - స్నానంచేసి భోజనం చేద్దువుగాని" అన్నది అన్నపూర్ణమ్మ.

"అవునమ్మా - మీ అమ్మ సాధిస్తుందన్న మాటే గానీ మళ్ళీ నీమీద వల్లమాలిన ప్రేమ. క్షణం నిన్ను తలుచుకోకుండా ఉండలేదు - పిచ్చిది" అంటూ నవ్వాడు శేషాచారి.

"అమ్మా - నాకు వంట్లో బాగాలేదు - తలనొప్పిగా ఉంది - కాసేపు పడుకొంటాను" అన్నది లక్ష్మి.

"ముందు కాళ్ళూ, చేతుల్లూ కడుక్కొని టిఫిన్ చేసి వేడి వేడి కాఫీ త్రాగావంటే తలనొప్పి అదేపోతుంది.

కాకపోతే - ఆస్ప్రి వేసుకో - తక్కున తగ్గుతుంది" అన్నది అన్నపూర్ణమ్మ యింట్లోకి వెడుతూ.

అన్నపూర్ణమ్మ అటు వెళ్ళగానే లక్ష్మి యిటు మేడ మీదికి వెళ్ళిపోయింది.

కాఫీ, టిఫిన్ ట్రేలో పట్టుకొనివచ్చి చూసింది అన్నపూర్ణమ్మ. లక్ష్మి అక్కడలేదు. ఆవిడ ఆశ్చర్యానికి అంతు లేదు.

"అమ్మాయేదండీ" అన్నది భర్త నుద్దేశించి.

"మేడమీదికి పోయినట్లుంది" అన్నాడు శేషాచారి మామూలుగానే.

"ఏం జరిగిందంటారు? పరీక్షలింకా చాలా రోజులున్నాయిగా - అప్పుడే వచ్చింది దేనికీ" అన్నది అన్నపూర్ణమ్మ భర్తతో.

"ఏమో - వచ్చి చూసిపోదామని వచ్చిందిగాబోలు - నీకు అన్నీ అనుమానాలే - పిల్ల రానంత కాలం రాలేదంటావు. వచ్చాక - అన్నీ అనుమానాలే" అన్నాడు శేషాచారి.

అది కాదండీ - చూసిపోవటానికి వచ్చేదైతే సామానంతా పట్టుకు రావటం దేనికీ? ఇక్కడ మాత్రం దానికి చీరెలు లేవా? సామాను పట్టుకు రావలసిన అవసరమేమీ లేదే" అంటూ తన సందేహం వెలిబుచ్చింది అన్నపూర్ణమ్మ ట్రే బల్లమీదపెట్టి.

"పోనిద్దూ. దానికి చదువు పడలేదేమో - ఇష్టంలేక మానేద్దా మనుకుందేమో" అన్నాడు శేషాచారి.

"ఇంతకాలం చదివి తీరా పరీక్షలు దగ్గరపడ్డ తర్వాత మానేద్దా మనుకుంటుందిటండీ - మీ కేమీ బుర్రకెక్కదు" అన్నది అన్నపూర్ణమ్మ విసుక్కుంటూ.

మరేం చెయ్యమన్నావు - బ్రహ్మదేవుడిచ్చింది ఆ మట్టిబుర్రే - తొందరెందుకు - ఇంటికి వచ్చిందో రాలేదో అప్పుడే ఈ ఆలోచన్లు దేనికీ? అమ్మాయే చెపుతుంది. తొందరెందుకూ" అన్నాడు శేషాచారి.

"మీ కన్నీ తాపీగా జరగాలంటారు - అవతల కొంప లంటుకుంటున్నయ్యి అన్నా లేవరు" అన్నది అన్నపూర్ణమ్మ విసుగుతో.

"సరే - నీ యిష్టం. కాసేపు నడుము వాలుస్తాను వెళ్ళు" అంటూ తన గదివైపు వెళ్ళిపోయాడు శేషాచారి.

అన్నపూర్ణమ్మ చేసేదేమీలేక చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయింది.

---

# 17

లక్ష్మి వచ్చి రెండురోజులైంది. వెనకటిలా విరగబాటుగా మాట్లాడటంకానీ, ఎదురు సమాధానాలు చెప్పటంకానీ, ప్రతివిషయానికీ వాదించటంకానీ-చెయ్యటంలేదు.

అన్నపూర్ణమ్మ మనస్సులో గాలం పడింది. లక్ష్మిలోని ఈ విపరీతపు మార్పుని అన్నపూర్ణమ్మ ఒక్కతే గమనించింది. శేషాగారికి ఎలాంటి అనుమానాలూ లేవు. మామూలుగా కులాసాగా మాట్లాడు తున్నాడు.

"అమ్మాయ్, ఇలా చెప్పా, పెట్టకుండా వచ్చావేమే! పరీక్షలముందు యిలా రావచ్చా" అన్నది అన్నపూర్ణమ్మ ఒకరోజు మధ్యాహ్నం తీరిగ్గాకూర్చున్న సమయంలో.

"ఏమోనమ్మా - నాకింక చదవబుద్ధికాలేదు - వచ్చేశాను" అన్నది లక్ష్మి.

"అయితే ఏమిచేద్దామనుకుంటున్నావే-" అన్నది అన్నపూర్ణమ్మ. కూతురి చపల బుద్ధికి విస్తుబోయింది. నిలకడగా ఒక్కపనీ చెయ్యలేని పిల్ల. ఒంటరిగా ఎలా బ్రతుకుతుందోనని బెంగపడింది.

"ఏమీ లేదమ్మా - ఎన్నాళ్ళిలా ఉన్నా లాభ మేమిటి ?" అన్నది లక్ష్మి తలవంచుకొని.

"మరెలా ఉందాం అనుకుంటున్నావు? కొంపతీసి విడాకులు పుచ్చుకొని మళ్ళీ పెళ్ళిచేసుకుందా మనుకుంటు న్నావా? నీ వన్నీ పిదపకాలం బుద్ధులు - వెధవ చదువులు చదివి వెధవ బుద్ధులు నేర్చుకుంటున్నావు. నలుగుర్లో తలెత్తు కుని తిరగాలా నేము" అన్నది అన్నపూర్ణమ్మ మండి పడుతూ.

"అది కాదమ్మా..." అంటూ చెప్పబోయి ఎలా చెప్పాలో తెలీక ఆగిపోయింది.

"ఏదికాదే - నీ ముఖం. ఒకరు చెప్పినట్లు వినవు. స్వంతంగా నీకు తోచదు" అన్నది అన్నపూర్ణమ్మ,

"ఏంచెయ్య మంటావో చెప్పమ్మా! నీవు చెప్పి నట్లే చేస్తాను" అంది - తన మనోగతాన్ని తల్లిద్వారానే చెప్పించాలన్న ఉద్దేశ్యంతో.

"ఏమిటా - లక్షణంగా అత్తవారింటికెళ్ళి కాపరం చెయ్యమంటాను" అన్నది అన్నపూర్ణమ్మ.

"అయితే వెడతానమ్మా - నీవుకూడావచ్చి దిగ బెట్టివెళ్ళు" అన్నది లక్ష్మి కాలిగోటితో నేలమీద రాస్తూ.

"అయితే పద - నేనే కాదు-మీ నాన్నగారుకూడా వస్తారు" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఎప్పుడు మంచిదో నాన్నగార్ని అడగమ్మా" అన్నది లక్ష్మి తనగదిలోకి వెళ్ళిపోతూ.

"ఏమండోయ్-ఈ మాట విన్నారా" సంతోషంతో భర్త దగ్గరికెళ్ళింది.

"ఏ వార్తే బాబూ, నీవు చెప్పకుండానే విన్నారా అంటావు" అన్నాడు శేషాచారి విసుగ్గా.

'అది కాదండీ - మన అమ్మాయి విషయమే" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఇనకేం - సర్వం విన్నాను - అమ్మాయి చదువు వదిలి వచ్చేసింది - అదేకదూ నీవు చెప్పబోయేది - మళ్ళీ వెళ్ళనంటున్నదని ఫిర్యాదు చెయ్యటానికి వచ్చావా"అన్నాడు శేషాచారి.

"అది కాదండీ బాబూ - అమ్మాయి - అత్తవారింటికి వెడతానని అంటున్నది" అన్నది అన్నపూర్ణమ్మ నవ్వుతూ.

"అమ్మాయి అంటున్నదా - దాన్ని వేధించి, సాధించి బలవంతాన అనిపించావా? ఇదివరకు వెళ్ళనని అదే గదూ అంటా" అన్నాడు శేషాచారి.

"అవునండీ-ఇదివరకు వెళ్ళనని అదే అన్నది - ఇప్పుడు వెడతానని అదే అంటున్నది. మధ్య నా జోక్యం ఏమీలేదు" అన్నది అన్నపూర్ణమ్మ.

"సరే అయితే - ఇంకేం - వెళ్ళమను - నీవుకూడా వెళ్లు" అన్నాడు శేషాచారి.

అంతేకాదు - మీరుకూడా రావాలి. అమ్మాయిని వాళ్ళేమీ అనకుండా నచ్చచెప్పాలి"అన్నది అన్నపూర్ణమ్మ.

"నేను దేనికి – పెళ్ళికివెడుతూ – పిల్లిని చంక నెట్టు కెళ్ళినట్లు" అంటూ నవ్వాడు.

"చాల్లెండి మీ హాస్యం వింటే ఎవరైనా నవ్వగలరు. మంచిరోజుచూచి చెప్పండి. అన్నీ సిద్ధంచెయ్యాలి" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఎప్పుడోనా ? రేపే మంచిరోజు – దశమీ బుధ వారం అన్నాడు శేషాచారి.

"అయితే మరింకేమిటి ? టైములేదే – పిండివంటలు చేయించటానికి ? సరే మీరు ఆర్డరిచ్చిరండి – కావాల్సిన సరుకులు చెప్తాను" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఒక లిష్టు రాసియివ్వు. ఆ ప్రకారం పట్టుకొస్తాను" అన్నాడు శేషాచారి.

"మరు – నిముషంలో తెస్తాను" అంటూ వెళ్ళింది అన్నపూర్ణమ్మ.

మరుసటిరోజు తెల్లవారు ఝామునే లేచింది అన్న పూర్ణమ్మ.

లక్ష్మికి తలంటి నీళ్ళుపోసింది. ఊరికి తీసుకెళ్ళ వలసిన సరంజామా సిద్ధంచెయ్యటంలో నిమగ్నురాలైంది. అల్లుడికి విలువైన బట్టలు తెప్పించింది.

మధ్యాహ్నం బండివేళకి అన్నీ సిద్ధం చేసింది.

"ఏమండోయ్ – జట్కా పిలిపిస్తారా" అన్నది అన్న పూర్ణమ్మ.

"అలాగేలే - అంతా సిద్ధమయినట్లేనా" అన్నాడు శేషాచారి.

"ఆ సామానంతా బయట పెట్టించి తాళాలు వెయ్యటమే" అంటూ వెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ.

"అమ్మాయ్, లక్ష్మి - తయారైనావుటే" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఊఁ" అంటూ వచ్చింది లక్ష్మి.

చాలా సాదా చీరకట్టింది. అటువంటిదే జాకెట్టు, చేతిన రెండు జతల బంగారు గాజులు. ముఖాన పెద్దబొట్టు. తల నున్నగా దువ్వి జడ వేసి చివర రిబ్బన్ గట్టింది.

"అదేమిటే - అత్తారింటికిపోతూ ఇలా తయారైనావు. వాళ్ళేమనుకుంటారు? పద - ఆ కంచిపట్టుచీరె కట్టుకో. వెల్వెట్ జాకెట్టు వేసుకో. రవ్వల నెక్లెసు పెట్టుకో. రాళ్ళగాజులు వేసుకో. రవ్వల దుద్దులుపెట్టుకో. జడలో చామంతి పువ్వుపెట్టుకో. తలలో పూలుపెట్టుకో - కళ్ళకి కాటుక - కాళ్ళకి పారాణి ఉండాలి. ఇలా పెళ్ళికాని పిల్లలా తయారైతే అంతా నన్నుచూచి నవ్వుతారు" అంటూ కూతుర్ని చేయిపట్టుకొని తీసుకెళ్ళింది.

"దేనికమ్మా - ఇవన్నీ - పెళ్ళికెడుతున్నానా? పేరంటాని కెడుతున్నానా" అన్నది లక్ష్మి.

కానీ అన్నపూర్ణమ్మ వినిపించుకునే స్థితిలో లేదు. బీరువా తెరిచి తను చెప్పిన వస్తువులన్నీ తీసింది. లక్ష్మికి తానే అలంకరించి చీరె కట్టుకోమని చెప్పివెళ్ళింది. పూలమాలతెచ్చి లక్ష్మి జడలో తురిమింది. కాళ్ళకి పారాణి

పెట్టింది. చెంపల దగ్గర మెటికలు విరుస్తూ "నా తల్లీ - అచ్చు లక్ష్మీదేవిలా ఉన్నావు" అంటూ మురిసిపోయింది.

"ఏమే - సవరింపులు కాలేదూ - బండివచ్చింది - పదండి" అంటూ శేషాచారి కేక వేశాడు.

అన్నపూర్ణమ్మ, లక్ష్మి బయటికి వచ్చారు. బండి వాడు సామానంతా బండిలో వేసి నిలబడ్డాడు.

"అమ్మాయ్, ముందు నీ వెక్కమ్మా" అంటూ కూతుర్ని ఎక్కనిచ్చి ఆ పైన తను ఎక్కింది.

"ఏమండీ - రండీ" అంటూ భర్తని పిలిచింది.

శేషాచారి బండి చివర ఎక్కికూర్చున్నాడు. బండి వాడు అడ్డు కడ్డీని అడ్డం వేశాడు.

"త్వరగా పోనివ్వు - టైమయింది" అన్నాడు శేషాచారి.

రైలు ఎక్కారు అంతా - లక్ష్మి అత్తవారి వూరు వచ్చింది. శేషాచారి ముందు దిగి సామాను లైసెన్సు కూలికి యిచ్చి బండి పిలిచాడు.

ముగ్గురూ బండెక్కి లక్ష్మి అత్తవారింటి ముందుకి వచ్చారు. బండి ఆగింది.

అప్పటికి సాయంత్రమైంది.

శేషాచారి బండిదిగి మెట్లు ఎక్కుతున్నాడు. ఎదురుగా రామచంద్రం వచ్చాడు. "అరే - మామగారా! రండి రండి" అంటూ ఆశ్చర్యపోయాడు రామచంద్రం. బయటికి వెళ్ళే బదులు యింట్లోకి నడిచేడు.

శేషాచారి వెనక అన్నపూర్ణమ్మా, లక్ష్మి దిగి యింట్లోకి అడుగుబెట్టారు. లక్ష్మి తలవంచుకొని సంశయంగా లోపలికి ఒక్కొక్క అడుగే వేస్తున్నది.

"అమ్మా - లక్ష్మి వచ్చిందేవ్" అంటూ రామ చంద్రం కేక వేశాడు.

"ఆ ! ఎవరూ" అంటూ అలివేలు వచ్చింది. అలి వేలు బాగా చిక్కిపోయి ఉంది కళ్ళు గుంటలు పడ్డాయి. జుట్టంతా నెరిసి పోయింది. మాసిన చీరె కట్టుకొని ఉంది. కానీ అలివేలు కళ్ళల్లో వెయ్యి జ్యోతులు వెలిగాయి. ఆనందంతో ముఖం తళతళ లాడింది.

"అమ్మాయ్ - లక్ష్మీ" అంటూ వచ్చింది అలివేలు.

"అత్తయ్యా నన్ను క్షమించండి - పాపాత్మురాల్ని" అంటూ కాళ్ళమీద పడ్డది లక్ష్మి.

ఇరువురి కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి. అలివేలు కళ్ళ నీళ్ళమధ్య నవ్వింది. నవ్వుతూ లక్ష్మి కన్నీళ్ళు తుడిచి. "పిచ్చి పిల్లా - లేనిపోని పంతాలతో పండంటి కాపరాన్ని-వదు లుకు వెళ్ళావు" అన్నది అలివేలు.

లక్ష్మి కళ్ళవెంట నీళ్లు కారుతూనే ఉన్నాయి.

రామచంద్రం కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. కన్నీళ్ళ మధ్యనుంచి సంతోషం తొంగిచూచింది.

రామచంద్రం మామగారి అవసరాలు చూడటానికని వెళ్ళబోతున్నాడు.

"ఏమండీ - నన్ను క్షమించరూ" అంటూ లక్ష్మి రామచంద్రం కాళ్ళమీద పడింది.

ఛీ, ఛీ - ఏమిటా పని! నీ తప్పేంలేదు. తప్పంతా నాది. పద - అందరూ నవ్వుతారు" అన్నాడు రామచంద్రం నవ్వుతూ. లక్ష్మి మనస్సులోని బరువు మాత్రం దిగలేదు. అది మరింత బరువుగా తోచింది లక్ష్మికి.

ఆ బరువు భారాన్ని దింపే ఉపాయంలేదు.

అన్నపూర్ణమ్మ, శేషాచారి నాల్గురోజు లున్నారు. వెంకటాచారి చాలా మర్యాదచేశాడు. అలివేలు ఎలాంటి లోటూ రాకుండా చూచింది.

వదినా, పిల్లని మళ్ళీ రెండోసారి మీ చేతుల్లో పెడు తున్నాను. దాన్ని కడుపులో పెట్టుకునే భారంమీది. ఇది మీపిల్లకాని - మాపిల్లకాదు" అన్నది అన్నపూర్ణమ్మ వెళ్లేటప్పుడు అలివేలుతో.

"అప్పుడే ఏం తొందరొచ్చిందని వెడుతున్నారు? పదిరోజు లుండకూడదూ" అంటూ ప్రాధేయపడింది అలి వేలు.

"మళ్ళీవస్తాంలే వదినా. ఇంటిదగ్గ రెవరూలేరు" అంటూ సర్ది చెప్పింది అన్నపూర్ణమ్మ.

అన్నపూర్ణమ్మా, శేషాచారి తమవూరికి వెళ్ళి పోయారు.

లక్ష్మి వంటరిగా మిగిలింది.

అలివేలు లక్ష్మిని కన్నబిడ్డకన్నా మిన్నగా చూస్తున్నది. ఏపనీ చెయ్యనివ్వటంలేదు. కాని లక్ష్మిలో సంతోషం, ఉత్సాహం నానాటికీ సన్నగిల్లి పోతున్నాయి. రామచంద్రం లక్ష్మిని పువ్వుల్లోపెట్టి పూజిస్తున్నాడు. లక్ష్మి అందరి ఆజ్ఞల్ని అమలు పరుస్తున్నది. కానీ అందులో ఉత్సాహంలేదు - ఆనందంలేదు - కేవలం ధర్మాన్ని నిర్వర్తిస్తున్నట్లుంది. అయితే లక్ష్మియొక్క - ఈ పరిస్థితి ఎవరూ గమనించలేదు మొదట. గమనించే సరికి సంతోషంతో ఉబ్బిపోయారు. లక్ష్మికి గర్భిణి.

అలివేలు లక్ష్మిని కాలుకదప నివ్వకుండా అన్నీ తనే చేస్తున్నది. రామచంద్రం లక్ష్మి ఏమీ అడగకుండానే అన్నీ తెచ్చి పెడ్తున్నాడు. వేటికీ లోటులేదు. కానీ లక్ష్మి రోజు రోజుకి పెరిగే బదులు - క్షీణిస్తున్నది. కారణం ఎవ్వరికీ తెలీదు. అలివేలు ఆందోళన చెందింది. రామచంద్రం గాభరా పడ్డాడు. వెంకటాచారి దిగులు పడ్డాడు.

డాక్టరు మందులు వ్రాసిస్తున్నాడు. రామచంద్రం తెస్తున్నాడు. లక్ష్మి ఎవరికీ తెలియకుండా పారబోస్తున్నది.

ఐదో నెలలో సీమంతం పెద్దఎత్తున జరిపించింది అలివేలు.

అన్నపూర్ణమ్మ 'చీర, సారె' తెచ్చింది. పుట్టింటికి తీసుకెళ్ళి సీమంతం చేస్తానంది. కానీ లక్ష్మి వెళ్ళటానికి ఒప్పుకోలేదు. అన్నపూర్ణమ్మ దిగులు చెందింది, కళ్ళనీళ్ళతో వెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ.

లక్ష్మి పురిటికి పుట్టింటికి వెళ్ళలేదు. రామచంద్రం విచారించలేదు. అలివేలు సంతోషించింది.

లక్ష్మికి ఏడో నెల గడుస్తున్నది. లక్ష్మి చాలా బలహీనంగా ఉంది, తిండి ఏమాత్రం తినదు. తిన్నా యిమడదు. అంటే - మందులు మాత్రం కొంటున్నారు. అందువల్ల ఫలితం శూన్యం. లక్ష్మి తప్ప యింట్లో అందరూ లక్ష్మి పరిస్థితికి దిగులు పడుతున్నారు.

లక్ష్మి అనారోగ్యానికి కారణం లక్ష్మికీ, ఆ సర్వేశ్వరుడికి తప్ప అన్యులకు తెలియదు.

---

# 18

వెంకటాచారి యింట్లో లేడు. అలివేలు వంటింట్లో లక్ష్మికి అన్నం వడ్డిస్తున్నది. రామచంద్రం తయారై స్కూలుకి వెళ్ళబోతున్నాడు.

'టెలిగ్రాం సార్' అంటూ టెలిగ్రాం రామచంద్రం చేతికిచ్చి సంతకం పెట్టించుకొని పోస్టుమన్ వెళ్ళిపోయాడు.

రామచంద్రానికి చేతులు వణికాయి. టెలిగ్రాం ఎక్కడినుంచి వస్తుంది? ఎవరున్నారు టెలిగ్రాం యివ్వటానికి? అంతా అయోమయంగా ఉంది. వణికే చేతుల్తో కవరు విప్పి చూచాడు.

“సుబ్రమణ్యం - డైడ్ - ఇన్ ఏక్సిడెంట్ - కమ్ ఇమ్మీడియట్ లీ—” అంటూ 'చంద్రశేఖరం' అని సంతకం ఉంది.

ఎవరీ చంద్రశేఖరం? ఏమో! హైదరాబాదు అడ్రసు మాత్రం యిచ్చి ఉంది. అయితే అన్నయ్యా వాళ్ళు అక్కడికివెళ్ళి బహుశా ఆ చంద్రశేఖరం యింట్లో ఉన్నారు కాబోలు. విధి. విలాసం ఎంత చిత్రమైంది! పుట్టిన పెరిగి వూరువదిలి అంతదూరంవెళ్ళి అక్కడ ప్రమాదానికి గురై

మరణించాడు. ఆయనకి మరణం అక్కడ రాసిపెట్టి వుంది కాబోలు. అందుకే ఏవో కారణాలు కల్పించి భగవంతుడు వాళ్ళిద్దర్నీ అక్కడి దాకా లాక్కుపోయాడు. పాపం - అన్నయ్యను తాను ఒక్కసారికూడా మర్యాదగా, గౌరవంగా ప్రేమగా పిలిచి ఎరుగడు. పలుకరించి ఎరుగడు. ఎప్పుడూ 'మూగీ' అంటూ హేళనచేసి అపహాస్యం చేసేవాడు. అయినా అన్నయ్య ఎప్పుడూ చిన్న పుచ్చుకోలేదు. మాటలు విని అర్థం చేసుకోగలడు. మాటలు వినబడవు కానీ - పెదవుల కదలికల్ని బట్టి మాటల్ని ఊహించుకో గలడు. కానీ తిరిగి సమాధానం చెప్పలేడు. రామచంద్రానికి కన్నీళ్ళాగలేదు. గొంతు బొంగురు పోయింది. "అమ్మా" అంటూ కేక వేశాడు.

"ఏమైందిరా - వెళ్ళలేదూ—ఏం చేస్తున్నావు" అంటూ అలివేలు వచ్చింది.

రామచంద్రాన్నిచూచి "దేనికిరా అలావున్నావు" అన్నది అలివేలు.

"అమ్మా - అన్నయ్య—" అన్నాడు రామచంద్రం- ఆ పైన చెప్పటానికి గొంతు పెగిలి మాట రాలేదు.

"ఏ...ఏమైనాడురా? ఎక్కడ ఉన్నారుట? ఏమైనా ఉత్తరంగాని వచ్చిందా ? పిచ్చి వెధవ - మాటలుకూడా రావు. ఆ పొరుగూరిలో ఎలా అవస్థ పడుతున్నారో" అలివేలుకి యిప్పుడు కోడలిమీద ఎలాంటి కోపమూ లేదు. పైగా కొడుకూ, కోడల్నీ గురించి రోజూ వాపోతుండేది. పైకి అన్నా అనకపోయినా ఆ దుఃఖం అలివేలుని పీడిస్తూనే ఉంది.

"అవునమ్మా-అన్నయ్య..." అంటూ ఆగిపోయాడు రామచంద్రం.

"ఆ - ఎల్లా ఉన్నారుట? ఎప్పుడొస్తున్నారుట! ఇంత వరకూ ఎలా బ్రతుకుతున్నారట. చేతిలో డబ్బైనా తీసుకోకుండా వెళ్ళారు - టిక్కెట్టుకైనా తీసుకెళ్లారో లేదో - పిచ్చివాళ్ళు" అన్నది అలివేలు. ఆనంద బాష్పాలు అలివేలి కళ్ళనించి కారుతున్నాయి. కళ్ళు నవ్వుతున్నాయి. ఎండా వానా కలిసి వచ్చినట్లుంది.

"అది కాదమ్మా-అన్నయ్య-ప్రమాదంలో" అంటూ యిక చెప్ప లేకపోయాడు. కంఠం - రుద్ధమైంది.

"ఆ - ప్రమాదమా! ఎలా ఉందిట?" అన్నది అలివేలు స్తంభించిపోయి.

"అన్నయ్య - పో - యా - డు" అన్నాడు రామచంద్రం కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ.

అలివేలు విరుచుకు పడిపోయింది.

అన్నం వడ్డిస్తూ, వడ్డిస్తూ అత్తగారు బయటికి వెళ్ళింది. ఎందువల్ల రాలేదో? ఎంతో సేపు అలా కూర్చోలేక చెయ్యి కడుక్కొని వసారాలోకి వచ్చిందిలక్ష్మి. అత్తగారు నేలమీద పడివుంది. భర్త ఆదుర్దాగా నేలమీద కూర్చొని తల్లి వంక చూస్తున్నాడు.

"ఏమండీ - అత్తయ్య కేమయింది?" అన్నది లక్ష్మి.

"నీళ్ళు తీసుకురా - విసనకర్ర తీసుకురా" అన్నాడు రామచంద్రం, తల్లి తలని తన తొడమీదికి చేర్చి.

లక్ష్మి నీళ్ళు తెచ్చి అత్తగారి ముఖాన చల్లి విసన కర్రతో విసురుతూ నిలబడింది.

కాసేపటికి అలివేలు తెప్పరిల్లింది. కానీ మనిషి నీరస పడిపోయింది. లక్ష్మి, రామచంద్రం - కలిసి ఆమెని మెల్లగా మంచం మీదికి చేర్చారు.

రాత్రికి వెంకటాచారి వచ్చి కొడుకు మరణవార్త విన్నాడు. అంతా కలిసి బయలుదేరారు.

వీరంతా జెలిగ్రామములోని అడ్రసు ననుసరించి చంద్రిక వాళ్ళ ఆచూకీ కనుక్కున్నారు వారికి చంద్ర శేఖరం ఎదురైనాడు. లోపలికి తీసుకెళ్ళి మర్యాద చేశాడు.

అంతా ఏడ్పులూ, పెడ బొబ్బలతో ఇల్లంతా మారోమ్రోగుతున్నది.

ఇంతలో నారాయణాచారి వచ్చాడు.

శవదహనానికి కావల్సిన ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి.

చంద్రిక తండ్రితో వెళ్ళటానికి సిద్ధపడింది.

అంతా మూటా, ముల్లె సర్ది ప్రయాణానికి సన్నద్ధులౌతున్నారు.

ముసలాయనకి దుఃఖం ఆగింది కాదు.

"అమ్మా - చంద్రికా - ఇన్నాళ్ళూ కన్న కూతురు లేని లోటు తీర్చావు. వెళ్ళిపోతావా తల్లీ" అంటూ బావురు మన్నాడు

"వెళ్ళొస్తాను బాబయ్యగారూ. మీరింతవరకూ చూపిన దయను నేనెన్నటికీ మరిచిపోను. మరిదిగారి పెండ్లి జరిపించండి. అప్పుడు వస్తాను. అన్నది చంద్రిక.

"నీవూ, మీ నాన్న యిక్కడే ఉండి పోకూడదూ-అక్కడా ఎవరూ లేరని అంటున్నావుగా" అన్నాడు ముసలాయన.

"నాన్న తత్వం వేరు బాబయ్యా. ఆయన పరుల యింట్లో ఎప్పుడూ ఉండరు. అయినా మిమ్మల్ని యింకా బాధ పెట్టటం దేనికి? నాన్న పోషణలో ఉండి, ఆయన కింత ఉడకేసి పెట్టటం కంటే నా కింకే కావలసిన దేముంది బాబయ్యా — అంతా ఆయనతోనే పోయింది" అన్నది చంద్రిక. చంద్రిక ఏడ్చినట్లు గుర్తులేమీ లేవు. కానీ ముఖం పాలిపోయింది. వెనకటి కళా కాంతులు లేవు. కళ్ళల్లో ఉత్సాహం, సంతోషం లేవు. నిస్తేజమైన గాజు కళ్ళు మాత్రమే అక్కడున్నాయి. ఆశా నిరాశల కతీతమైన భావ మేదో కళ్ళల్లో కన్పిస్తున్నది.

చంద్రిక పాదాభివందనంచేసి కళ్ళకద్దుకున్నది. "వెళ్ళి వస్తాను బాబయ్యా" అంటూ శలవు తీసుకుంది.

చంద్రిక కన్న ఈ దుఃఖం రాజయ్యాని ముంచెత్తింది.

"అమ్మడూ—చంద్రమ్మ తల్లీ—వెళ్ళి పోతావా ఇన్నాళ్లూ—లోటులేని—వెలితిలేని జీవితం గడిపాను తల్లీ. నిన్ను చూచాక నా జడత్వం వదిలిపోయింది. నిన్నే కన్న కూతురిగా చూచుకున్నాను — కానీ — ఈ దౌర్భాగ్యుడి జీవితంలో ఈ ఘోరం చూడవలసివచ్చింది తల్లీ—వెడతావా —నీవు వెళ్ళాక నేను యిక్కడ ఉండలేనమ్మా — మా వూరెళ్ళి పోదామనుకుంటున్నాను" అన్నాడు రాజయ్య.

"అదేంటి రాజయ్య బాబాయ్. బాబుగారి సేవలో ఇన్నేళ్ళు గడిపావు. ఇంకా కొద్ది రోజులకొరకు పారి పోతావా—ఆయనన్నే కనిపెట్టి ఉండు. మరిదికి పెళ్ళి చేయించు" అన్నది చంద్రిక.

"ఆయన ఒకరి మాట వినే రకం కాదమ్మా — నీకు తెలీందేముంది? వాళ్ళ నాన్ననీ, నన్నూ లక్ష్యం చెయ్యడు. అటువంటివాడు — నీ మాట — ఎప్పుడూ జవదాటి ఎరు గడు అయ్యగారు కూడా చాల ఆశ్చర్యపోతుండేవారు" అన్నాడు రాజయ్య.

చంద్రశేఖరం అటు వెడుతున్నవాడల్లా చంద్రికను చూచి ఆగిపోయాడు.

"అప్పుడు బాబూ - నీవు ఎవరి మాటా వినటంలేదని అందరంటున్నారు. నాన్న - నిన్ను గురించి ఎంత బాధ పడు తున్నారో నీ కేమైనా తెల్సా? నాన్న మాట విని త్వరలో పెళ్ళిచేసుకో బాబూ. మా చెల్లెల్ని త్వరగా తీసుకొచ్చి నాన్న గారి సేవచేసి ఋణం తీర్చుకో బాబూ" అన్నది చంద్రిక తలవంచుకొని.

"ఇంకేమైనా చెప్పేదున్నదా వదినా" అన్నాడు చంద్రశేఖరం.

"ఇంకేమీ లేదు బాబూ - అయితే - నామాటకి ఒప్పుకున్నట్లేనా" అన్నది చంద్రిక.

"నీమాట నేనెప్పుడు కాదన్నాను వదినా! అలానే చేస్తాను. కానీ ఆ పెళ్ళి తతంగ మేదో నీవే జరిపించి వెళ్ళ రాదు వదినా" అన్నాడు చంద్రశేఖరం.

"లేదు బాబూ - నాన్నని చూచేవారెవరూ లేరు. ఈ వృద్ధాప్యంలో - ఆయన్ని వంటరిగా వదలి పెట్టటం నా కిష్టంలేదు. ఆయన ఋణం తీర్చుకోవలసిన అదును యిదే బాబూ! పెళ్ళి నిశ్చయమైన తర్వాత వస్తాలే" అన్నది చంద్రిక.

"సరే వదినా - వెళ్లేటప్పుడు ఆశీర్వదించి వెళ్ళు" అన్నాడు చంద్రశేఖరం.

"పిచ్చిబాబూ! ఇంత చదివేకకూడా ఈ పిచ్చివదిన గారి పిచ్చి దీవన్లు కావల్సివచ్చాయా" అంటూ శుష్క మందహాసం చేసింది.

"ఇంక వెడతాము బాబూ - మీ అందరి దయకు కృతజ్ఞురాల్ని" అంటూ చేతులు జోడించి నమస్కారం పెట్టింది.

తప్పు వదినా - పెద్దవాళ్ళు, చిన్నవాళ్ళని ఆశీర్వదించాలే కానీ, నమస్కారం చెయ్యకూడదు. పద-కారులో దింపి వస్తా" అన్నాడు చంద్రశేఖరం.

అందరూ కారులో ఎక్కి రైలు స్టేషనుకి చేరారు.

అందరూ రైలు ఎక్కారు. ఎవరూ ఎవరితోటీ మాట్లాడటం లేదు.

నారాయణాచారి స్వగ్రామం వచ్చింది. చంద్రికా, నారాయణాచారీ దిగబోయారు. లక్ష్మి అంతవరకూ మౌనం వహించినదల్లా హఠాత్తుగా చంద్రిక రెండుచేతులూ పట్టుకొని "అక్కయ్యా - అజ్ఞానంతో నేను చేసిన తప్పులు క్షమించు" అని గొణిగింది.

"పిచ్చిదానా - ఎవరుచేసిన తప్పులూ లేవు. విధి బల వత్తరమైంది. అదే కొందర్ని విడదీస్తుంది, మళ్ళీకలుపుతుంది, వేరుచేస్తుంది. దాని ప్రభావమే యిదికూడా" అన్నది చంద్రిక తన వట్టిచేతుల్తో లక్ష్మి చేతుల్ని రాస్తూ.

చంద్రికా, నారాయణాచారీ దిగిపోయారు. లక్ష్మి చంద్రికవంకే చూస్తున్నది రైలు కదిలిపోయింది.

"అమ్మాయ్ - పదమ్మా" అంటూ నారాయణాచారి ముందు నడువగా చంద్రిక తలవంచుకొని, నెత్తిమీదిముసుగు మరింత క్రిందికి లాక్కొని వడివడిగా అడుగులేస్తున్నది.

పూర్వ పరిచితమైన ఊరు వచ్చేసింది. తను మారింది. ఊరూ మారింది కొద్దిగా. తన జీవితం సమాప్తి అయినట్లే. కానీ వూరు వినూత్నంగా తయారైంది. క్రొత్త క్రొత్త మేడలూ, మిద్దెలూ. సిమెంటు రోడ్లు - పెద్ద పెద్ద అంగళ్ళు, బట్టల దుకాణాలు - హోటళ్ళతో క్రొత్తగా కనిపించింది చంద్రికకు.

దార్లో వేణుగోపాలాచారి తటస్థ పడ్డాడు. బాగా ముసలి తనం వచ్చేసింది. మనిషి వణుకుతున్నాడు. తడబడే అడుగుల్తో ఓపికలేక పోయినా కర్ర సాయంతో నడుస్తున్నాడు. అప్పటికీ - ఇప్పటికీ - ఎంత తేడా ?

"మాస్టారూ . బాగున్నారా ! ఈ మధ్య కనిపించనే లేదు" అంటూ పలకరించాడు నారాయణాచారి.

"అవును నారాయణాచారీ ! అయితే - నీ వెనక నడుస్తున్నదెవరూ ? మనిషా; నీడా" అన్నాడు వేణుగోపాలాచారి.

"మనిషో, నీడో పోల్చుకోలేనివారు నడిచి పోతున్నా రేం మాష్టారూ? ఏదైనా ప్రమాదం సంభవిస్తే" అన్నాడు నారాయణాచారి.

"ఆ - ప్రమాదాలకేం! శివుడి ఆజ్ఞ లేందే చీమైనా కుట్టదని - ప్రమాదాలు లేవు - ప్రయాణాలులేవు" అన్నాడు వేణుగోపాలాచారి వణికే కంఠంతో.

"సరేలెండి - అమ్మాయిని గుర్తుపట్టలేదూ చంద్రిక - మీ దగ్గర కొన్నాళ్ళు వీణ నేర్చుకున్నదే" అన్నాడు నారాయణాచారి.

"ఓహో - గుర్తొచ్చింది - దీని దుంపతెగ - జ్ఞాపకం బొత్తిగా ఉండటంలేదోయ్. అయితే అమ్మాయిని ఎందుకు తీసుకొస్తున్నావు" అన్నాడు వేణుగోపాలాచారి.

"అమ్మాయినా - అల్లుడు ప్రమాదంలో మరణిస్తేను తీసుకొస్తున్నా" అన్నాడు నారాయణాచారి బిగ్గరగా.

"ఓహో - అలాగా - అయితే మంచిదే" అన్నాడు వేణుగోపాలాచారి.

"మంచిదేమిటి మాష్టారూ - అల్లుడు పోయాడంటుం టేను" అన్నాడు నారాయణాచారి.

"ఓస్ - పాపం చంద్రికకి ఎంత కష్టం వచ్చిందయ్యా - అప్పుడు నామాట విన్నావూ? విన్నట్లయితే - అమ్మాయి సంగీతంలో నిధి అయ్యేది." అన్నాడు వేణుగోపాలాచారి.

"పరిస్థితులకి మనుషులు బానిసలు కదండి మాష్టారూ! అప్పటి పరిస్థితుల్లో పెళ్ళి అనివార్యమైంది. చేశాము - దాని ఫలితం అది అనుభవిస్తున్నది. దాన్ని చూస్తూ నే ననుభ

విస్తున్నాను - ఇంక వెడతాం మాస్టారూ" అన్నాడు నారాయణాచారి.

"మంచిది - వెళ్ళిరండి" అంటూ వెళ్ళిపోయాడు వేణుగోపాలాచారి.

ఇంటికి చేరా రిద్దరూ. అక్కడి పరిసరాల్లో మాత్రం మార్పేమీ లేదు. అదే చెఱువు - అవే చెట్లు - ఇల్లు పడిపోయే స్థితిలో ఉంది. చంద్రిక ఒక్కక్షణం చుట్టుప్రక్కల పరికించిచూచి నిట్టూర్చింది. లోపలి కెళ్ళింది. స్నానంచేసి బట్టలు పిండుకొచ్చింది. ఒక బిందెతో చెఱువు గట్టుమీది బావి నీళ్ళు పట్టుకొచ్చింది. వంట ప్రారంభించింది.

నారాయణాచారి అంగవస్త్రం బుజాన వేసుకొని చెఱువుకు వెళ్ళిపోయాడు.

చంద్రిక గతాన్ని నెమరు వేసుకుంటున్నది. ఆ ఇల్లూ ఆ పరిసరాలూ వదిలి ఎక్కడెక్కడో తిరిగి మళ్ళీ యథాస్థానానికి వచ్చింది.

అప్పటికీ- యిప్పటికీ తనలో ఎంతమార్పు? ఇంట్లో ఎంత మార్పు? ఆ యింట్లో మెలిగి పనులన్నీ చక్క బెట్టి యింటికి అలంకారంగా ఉండే తల్లి మరణించింది తాను చూడకుండానే. మళ్ళీ ఆ అందం యింటి కిక రాదు.

నారాయణాచారి స్నానం ముగించివచ్చాడు. చంద్రిక వడ్డించింది. ఇద్దరూ తిన్నారు.

చంద్రిక జీవితం భారంగా గడుస్తున్నది. నారాయణాచారి, చంద్రిక ఎప్పుడో కాని మాట్లాడుకోరు.—మామూలుగా ముక్తసరిగా మాట్లాడు కొంటారు.

నారాయణాచారి తన మామూలు వృత్తి-భిక్షాటనం మానలేదు- కొడుకు కొద్దిగా డబ్బు పంపించుతాడు. కానీ నారాయణాచారి త్రిప్పి కొట్టాడు. అప్పటి నుంచీ గోవిందాచారి డబ్బు పంపటం మానుకున్నాడు.

చంద్రికకి పెద్ద పనేమీ లేదు. తోమిందే తోముతూ అలికిన చోటే అలుకుతూ ప్రొద్దు పుచ్చుతుంటుంది.

# 19

అలా రోజులు నెలలుగా మారి పోతున్నాయి. ఒక రోజున ఉత్తరం వచ్చింది అత్తగారి వూరునుంచి.

లక్ష్మికి ప్రసవించే రోజులట. లక్ష్మి తల్లి దండ్రులు యిక్కడికే వచ్చారట. లక్ష్మి చంద్రికను చూడగోరు తున్నదని జాబు వచ్చింది.

చంద్రిక పట్టుదల మీద నారాయణాచారి చంద్రికను వెంట బెట్టుకొని బయలు దేరాడు.

లక్ష్మి పరిస్థితి చాల దయనీయంగా ఉంది. చంద్రికను చూసి బావురుమంది.

"దేనికమ్మా- అలా బెంగపడి పోతావు? దేవుడున్నాడు చెల్లీ" అన్నది చంద్రిక.

చంద్రికకు దేవుడి మీద నమ్మకం పోయి చాలాకాలమైంది. దేవుడే ఉంటే యిన్ని కష్టాలు దేనికి కల్పిస్తాడని. దేవుడు కల్పించే దేమి ఉంది? అంతా మానవుల కర్మ ఫలితాలనే నమ్మిక నారాయణాచారిది. కష్ట సుఖాలు కావడి కుండలు. ఈ శరీరం అశాస్వతమైంది. దాని కొర కిన్ని పాట్లు

దేనికీ? అని నారాయణాచారి ఉద్దేశం. కానీ-సామాన్య మానవుల కా నమ్మకం ఎక్కడిది ? సుఖం వస్తే పొంగి పోతారు. ఎగిరి గంతులేస్తారు. కష్టం వస్తే కుప్పగా నేల కూలి పోతారు. దేవుడ్ని దూషిస్తారు. తమ కష్టాల కంతా దైవమే మూల మన్నట్లు!.

"దేనికక్కా- నేనింక బ్రతకటం అనవసరం. నేను వెళ్ళేటప్పుడు- నా బిడ్డని- నీ చేతుల్లో వదిలి కళ్ళు మూయాలని పిలిపించానక్కా" అన్నది లక్ష్మి.

లక్ష్మి తలని ఒడిలోకి తీసుకొని నిమురుతూ "ఛీ-తప్పు చెల్లీ-అలాంటి మాటలనకు ఉట్టిగానే దేనికలా భయపడతావు" అన్నది చంద్రిక.

"కాదక్కా- నాకలా అనిపిస్తున్నది- నిజంగా బ్రతకాలని లేదు- నేను మహాపరాధం చేశాను. నిన్ను అవమానించాను. దానికి భగవంతుడు నాకు శాస్తి చేశాడు" అన్నది లక్ష్మి జాలిగా చూస్తూ.

"తప్పులు చెయ్యని వారెవరు చెల్లీ. తెలిసో, తెలియకో చేస్తుంటాము. దాని ఫలితాల్ని అనుభవిస్తుంటాము. భగవంతుడు మనల్ని అన్యాయం చేశాడని భ్రమలో పడి భగవంతుడ్ని దూషిస్తాము. కానీ నిజంగా మన కర్మ ఫలాన్నే మనం అనుభ విస్తున్నాం చెల్లీ" అన్నది చంద్రిక.

"అక్కా! నీవూ ఏదైనా అపరాధం చేశావా?" అన్నది లక్ష్మి కుతూహలంతో చంద్రిక వంక చూస్తూ.

రుగా? అయినా- మంచేది-చెడేది అక్కా! అంతా భగవత స్వరూపం అంటారు కదా-అప్పుడు మంచి వాళ్ళనీ చెడ్డవాళ్ళనీ మంచి పనులనీ చెడు పనులనీ ఎలా నిర్ణయించగలం?" అన్నది లక్ష్మి.

"అది కష్టమే చెల్లీ. మనబోటి సామాన్యులకు తెలిసే విషయాలు కావు. అవును. అంతా భగవత్ స్వరూప మనే చెప్తారు. అయితే మంచీ, చెడూ అన్నవి ఎక్కడ వస్తున్నా యంటే-మనలో ఉన్న దైవత్వాన్ని గుర్తించలేక అంధులుగా ప్రవర్తించటంలో మంచీ చెడూ కలుగుతున్నాయి. నీలోనూ యితర్లలోనూ దైవం ఉన్నాడనుకుంటే, నీవు యితర్లని నిందించలేవు- దూషించ లేవు బాధించ లేవు-హింసించలేవు. కానీ అలా చెయ్యగలవా? చెయ్యవు. కాబట్టి ఈ మంచీ చెడులు కల్గుతున్నాయి. అయినా యిటువంటి విషయాలన్నీ యిపుడు నీకు దేనికి చెల్లీ? సుఖంగా ప్రసవిస్తావు. పండంటి పాపాయి కల్గుతాడు. వాడ్ని గురించి ఊహించుకో! ఎలాంటి బాధ కూడా క్షణంలో మరుస్తావు. జీవించే పద్ధతి యిదే చెల్లీ! పోయిన దానికి విచారిస్తూ వున్న దాన్ని కాలదన్ను కోకు. రెండూ పోతాయి. సుఖం, దుఃఖం అనేవి మనలో

నొప్పు లారంభ మయ్యాయి. అంతా హడా పిడిగా తిరుగు తున్నారు. హాస్పిటల్లో చేర్పుతానని రామచంద్రం అన్నాడు. కానీ లక్ష్మి ఒప్పుకోలేదు. ఇంట్లోనే పురుడు పోసు కుంటానంది.

లక్ష్మికి హఠాత్తుగా నొప్పు లాగిపోయాయి. అందరికీ కాళ్ళాడలేదు—పిండం బయటపడలేదు. స్పెషల్‌గా కారు తీసుకొని హాస్పిటల్‌కి చేరవేశారు. కానీ—అప్పటికే వేళ మించి పోయింది. అతి కష్టంమీద పిండాన్ని బయటికి తీశారు. సజీవుడైన బాలుడు కలిగేడు. కానీ లక్ష్మి చాల బలహీనంగా ఉంది. దానిమీద జ్వరం వచ్చింది. అందులో బాలింత రోగం వచ్చింది. పిచ్చి పిచ్చి మాటలు—బట్టలు చింపటం—దగ్గరి కొచ్చిన వాళ్ళని కొరకటం—పీకటం—రక్కటం చేస్తున్నది. అందరికీ ప్రాణాలు అరచేతుల్లో ఉన్నాయి. అన్నపూర్ణమ్మ తెలిసిన దేవుళ్ళ కందరికీ మొక్కింది. ముడుపులు కట్టింది. నిలువు దోపిడీ యిస్తానని మొక్కింది అయినా రోగం తిరుగు ముఖం పట్టలేదు. లక్ష్మి బ్రతుకు క్షణాలల్లో ఉంది.

ఒకనాటి సాయంత్రం ఆ ఉధృతం తగ్గినట్లైంది. మందులూ, యింజక్షన్లూ ఫలించాయని అంతా అనుకున్నారు—వెయ్యి దేవుళ్ళకి మ్రొక్కారు. అంతవరకూ పిల్లవాడ్ని వేరుగా పడుకో బెడ్తున్నారు.

"అమ్మా—" అంటూ పిలిచింది లక్ష్మి హీన స్వరంతో.

"ఏం - తల్లీ - ఏం కావాలి" అన్నది అన్నపూర్ణమ్మ కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"ఏమీ లేదమ్మా - బాబు - ఏడీ" అన్నది లక్ష్మి.

"బాబా - ఇడుగో-ఉయ్యాల్లో ఉన్నాడులే" అన్నది అన్నపూర్ణమ్మ.

"కాదమ్మా వాడ్నిక్కడ పడుకో బెట్టవూ"-అన్నది లక్ష్మి.

అన్నపూర్ణమ్మ పాపడ్ని లక్ష్మి ప్రక్కన పడుకో బెట్టింది. వాడు కేరు, కేరుమని ఏడుస్తున్నాడు. వాడి పోలికలన్నీ చంద్ర మోహన్ వే - లక్ష్మి తదేకంగా వాడివంకే చూచింది. తల్లి వంక చూచి పిలిచింది

"అమ్మా, అక్కయ్య ఏదీ" అంటూ.

"అక్కయ్య వాళ్ళు సాయంత్రం వస్తారుతల్లీ! ఇంటి దగ్గరున్నారు" అన్నది అన్నపూర్ణమ్మ.

"కాదమ్మా-అక్కయ్యని పిలిపించు" అన్నది లక్ష్మి.

"మీ నాన్నని పంపుతాలే - నీవు పడుకో తల్లీ" అన్నది అన్నపూర్ణమ్మ

ఇంతలో చంద్రికా, అలివేలూ, రామచంద్రం వచ్చారు.

"అక్కా" అన్నది చంద్రికను చూసి లక్ష్మి.

"దేనికి చెల్లీ! బాగయిందిగా - ఇంక రేపు వెళ్ళ వచ్చునేమో! డాక్టర్ని అడుగుదాం - ఏం చెల్లీ" అన్నది చంద్రిక.

"అది కాదక్కా - నేనింక యింటికి రాను. నీకు తెలీదు. తగ్గిందనుకుంటున్నావు కదూ! ఉహూ - తగ్గదు. ఆయన్ని ఒకసారిలా పిలు" అన్నది లక్ష్మి.

రామచంద్రం లక్ష్మి మంచం దగ్గరికి వచ్చి స్టూలు మీద కూచున్నాడు.

"ఏమండీ" అన్నది లక్ష్మి. కళ్ళ నిండా నీళ్ళు నిలిచాయి.

"ఏమిటి లక్ష్మి - ఏం కావాలి" అన్నాడు రామచంద్రం కన్నీళ్ళు తుడుస్తూ.

"అదేమిటీ - అందరూ యిక్కడే ఉన్నారు. చూడండీ నేను ఘోరాపరాధం చేశాను. నాకు నిష్కృతిలేదు - మిమ్మల్ని చాలా అన్యాయం చేశాను - మీరు నన్ను క్షమిస్తారా? చెప్పండి" అన్నది లక్ష్మి.

"క్షమించటం దేనికి లక్ష్మి - నీవు చేసిందేమీ తప్పు కాదు - ఊరికే ఎందుకలా మథన పడతావు? నీ ఆరోగ్యం

పాడు చేసుకుంటున్నావు. ఇలా అయితే బాబు ఆరోగ్యం పాడుచేస్తావు - జాగ్రత్త" అన్నాడు రామచంద్రం.

"ఉహూ. మీరు క్షమిస్తానంటే-చెప్తాను నేనుచేసిన ఘోరపాపం" అన్నది లక్ష్మి.

"ఊరికే భ్రమపడకు. నీవు చేసిన అపరాధమేమీ లేదు. నీవు చెప్ప నక్కర్లేదు. నాకు తెలుసు" అన్నాడు రామచంద్రం.

"కాదండీ - మీకు తెలీదు - నన్ను చెప్పనివ్వండి - నేను - నేను - మీకు ద్రోహం చేశాను. నా - శీలం - చెడి పోయింది - మిమ్మల్ని మోసగించాను - దాని ఫలితమే వీడు_ క్షమిస్తారా - చెప్పండి - నిజం చెప్పండి - ముమ్మాటికీ క్షమి స్తారా" అన్నది లక్ష్మి ఏడుస్తూ.

"ఏడవకు - అంతా వినగలరు. మరెప్పు డిట్లాంటి మాటలు చెప్పకు. నిన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తున్నాను. లక్ష్మీ! మానవుడు తప్పుచేసి నప్పుడే క్షమించాలి. చెయ్య నప్పుడింకా క్షమాగుణం దేనికీ? మానవత్వం అంటే అదే" అన్నాడు రామచంద్రం లక్ష్మి నుదురురాస్తూ.

"ఊ-అయితే నాకింకే దిగులూ లేదు. ఒక కోరిక - బాబుని అక్కయ్య చేతికిచ్చేస్తున్నాను -" అన్నది లక్ష్మి.

"ఛా - అవేం మాటలు? రేపో మాపో బాగవుతుంది. ఇంటికి వెళ్ళిపోతాము" అన్నాడు రామచంద్రం.

"ఊహూ - పూర్తిగా నా మాటలు వినండీ! అడ్డు రాకండి - నా కోర్కెలు తీర్చండి" అన్నది లక్ష్మి.

"సరే చెప్పు -" అన్నాడు రామచంద్రం.

"మీరు - ద్వితీయ వివాహం చేసుకోవాలి. నన్ను మరిచి పోండి" అన్నది లక్ష్మి ఏడుస్తూ.

"ఛా - ఛా - ఎన్నిసార్లు చెప్పినా అవేం మాటలు? నయమవుతుందేను" అన్నాడు రామచంద్రం.

"కాదు - మీరు నా చేతిలో చెయ్యివేసి ప్రమాణం చెయ్యాలి" అన్నది లక్ష్మి.

"ఏం మాటలు లక్ష్మి - నీకు పిచ్చి ఎక్కిందా ఏం" అన్నాడు మందలిస్తూ.

"కాదండీ నేను చెప్పినట్లు చెయ్యండి. ఇప్పటి మాట కాదు. పోనీండి - ఎప్పటికైనా - నా మరణానంతరం మీరు మళ్ళీ పెళ్ళాడి తీరాలి. అప్పుడే నాకు మనశ్శాంతి" అన్నది లక్ష్మి రామచంద్రం చెయ్యి తన గుండెలపై అదుముకొని.

"అలాగే" అన్నాడు రామచంద్రం నిట్టూరుస్తూ.

"ఊహూ - చేతిలో చెయ్యి వెయ్యండి" అన్నది లక్ష్మి.

"చేతిలో చెయ్యి వేశాడు రామచంద్రం. రామ చంద్రం కంటినుంచి రెండు బిందువులు లక్ష్మి చెక్కిళ్ళ మీద పడ్డాయి.

ఉలిక్కి పడింది లక్ష్మి.

విజిటర్స్ టైము అయిపోయింది. విజిటర్సుని పంపిస్తు న్నారు హాస్పిటల్ కాపలావాళ్ళు.

"వస్తాం లక్ష్మి - మరేమీ బెంగపడకు" అన్నారు అందరూ.

"నమస్కారం అత్తయ్యగారూ" అన్నది లక్ష్మి. అంతవరకూ దూరంగా నిలబడి అన్నపూర్ణమ్మతో మాట్లాడుతున్న అలివేలు లక్ష్మి దగ్గరకొచ్చి తలనిమిరి 'మరేమీ భయంలేదు లక్ష్మి - ఉత్తిగా గాభరాపడకు" అన్నది.

"పదండమ్మా - పదండయ్యా" అంటూ కాపలా వాళ్ళు వచ్చారు.

అంతా బయటికి కదిలేరు.

ఆ రాత్రి లక్ష్మి బాగానే నిద్రపోయింది. ఒక అర్ధ రాత్రివేళ మళ్ళీ తెరవచ్చింది. అన్నపూర్ణమ్మ నర్సుని కేక వేసింది. నర్సు కళ్ళు నులుముకుంటూ వచ్చింది విసు క్కుంటూ.

డాక్టరెవరూ లేరు - అంతా యిళ్ళకిపోయారు. ఎవరూ రారని నర్సు చెప్పింది.

అన్నపూర్ణమ్మకి కాళ్ళాడలేదు. డెలివరీ వార్డులో ఉన్న డాక్టర్లు అప్పుడు రావటానికి వీలుకాదన్నారు.

లక్ష్మికి గురక ఎక్కువయ్యింది. మనిషి స్పృహలో లేదు. ఎవరు పలకరించినా పలకటం లేదు.

కొంతసేపటికి గురక తగ్గిపోయింది. ఉండి ఉండి ఎక్కిళ్ళవలె వస్తున్నాయి. అన్నపూర్ణ గొంతులో నీళ్ళు పోద్దామనుకుంది. కానీ గుటక పడలేదు. నీళ్ళు ప్రక్కకి కారి పోయాయి.

ఇంతలో డాక్టరు వచ్చి చూచింది. ఇంజెక్షన్లు ఒకదాని వెంట ఒకటి యిచ్చింది. కానీ ఫలితం శూన్యం.

ప్రాణం పూర్తిగా పోకముందే లక్ష్మి శరీరాన్ని అక్కడినుంచి కదలించి శవాలుంచే గదిలోకి చేర్చారు.

అన్నపూర్ణగోడు యింతంతకాదు. ఉయ్యాల్లో బిడ్డని తీసుకెళ్ళమన్నారు అన్నపూర్ణ పిల్లవాడ్ని తీసుకొని శవం దగ్గర కూర్చొని ఏడుస్తోంది.

అన్నపూర్ణకి భోజనం పట్టుకొని శేషాచారి వచ్చాడు. లక్ష్మి పక్క మీదలేదు. అక్కడ మరో స్త్రీ ఉన్నది. లక్ష్మి ఏమైందని వాకబు చెయ్యగా, లక్ష్మి శవాన్ని శవాల గదిలో ఉంచినట్లు తెలిసింది. గాబరాపడుతూ, తడబడే అడుగుల్తో వారినీ, వీరినీ కనుక్కొని శవాల గదికి చేరాడు.

అన్నపూర్ణ ఏడుస్తోంది. శేషాచారి అక్కడ కూలబడి పోయాడు.

"ఇంటికెళ్ళి ఈ వార్త చెప్పిరండి" అన్నది అన్నపూర్ణ ఏడుస్తూనే.

"ఊ" అన్నాడేకానీ శేషాచారి కదలలేదు.

"అమ్మాయిని తీసికెళ్లే ఏర్పాటు చెయ్యండి" అన్నది అన్నపూర్ణమ్మ.

"ఊఁ" అంటూ అలానే కూర్చున్నాడు. చాల సేప టికి శేషాచారి తడబడే అడుగుల్తో, వణికే కాళ్ళలో మెల్లగా బయటకి వెళ్ళాడు టాక్సీని మాట్లాడి తీసుకొచ్చాడు. ముడుపులు చెల్లించవలసిన వాళ్ళకి చెల్లించి శవాన్ని కారు లోకి చేరవేసి వెనకసీట్లో అన్నపూర్ణమ్మ ముందు సీట్లో శేషా చారీ కూల పడ్డారు. అన్నపూర్ణమ్మ వడిలో పసివాడు నిశ్చింతగా నిద్రపోతున్నాడు. వాడికి కేవీమీ పట్టలేదు - జీవి తంలో - అన్నిటికన్నా విలువైనది - తల్లిప్రేమని పోగొట్టు కున్నానని ఆ పసివాడికేమి తెలుసు?

కారు అలివేలుగారింటి ముందాగింది. శవదహనానికి శేషాచారి డబ్బు ధారాళంగా వెచ్చించాడు. దారమ్మట శవంపైన పూలూ, బుక్కాయి, డబ్బులూ వెదజల్లుకుంటూ తీసుకెళ్ళారు. మంచి గంధపు చెక్కలు పట్నంనుంచి తెప్పించి వాటితో శవదహనం చేయించారు.

లక్ష్మి కోర్కె ప్రకారం పసివాణ్ని చంద్రిక చేతుల్లో పెట్టింది అన్నపూర్ణమ్మ. కానీ-తన సంతానంయొక్క ఏకైక సంతానాన్ని వదిలిఉండటం అన్నపూర్ణకి యిష్టంలేదు.

కర్మ ముగిసింది. ఎవరిండ్లకు వాళ్ళువెళ్ళే ప్రయ త్నంలో ఉన్నారు.

"అమ్మా - చంద్రా - పిల్లవాణ్ని తీసుకొని ఒక్క దానివీ ఎలా సాకగలవు? మీ రిద్దరూ అక్కడికి వచ్చె య్యండి. అమ్మాయిలేని కొంప బావురుమంటుంది. నిన్న

చూచైనా మేము కొంత దుఃఖాన్ని మరుస్తాము" అన్నది అన్నపూర్ణమ్మ.

"నాదేమీ లేదండీ పిన్నిగారు - నాన్న ఏమంటారో మరి! అయన సామాన్యంగా ఎవరింట్లోనూ ఉండడు" అన్నది చంద్రిక.

శేషాచారి ప్రాధేయపడగా నారాయణాచారి అందుకు సమ్మతించాడు. అన్నపూర్ణమ్మ చంద్రికనూ, పిల్లవాడ్నీ తీసుకొని భర్తతో కలిసి తమ వూరికి వెళ్ళిపోయింది.

అలివేలు స్థితి మరీ దుర్భరంగా ఉంది. పెద్దకొడుకు గతి అలా అయింది. చిన్నవాడి ప్రారబ్ధం యిట్లా తెల్లవారింది. ఇంక ఎవర్ని చూచి బ్రతకాలి? రామచంద్రం ఈ మధ్య పూర్తిగా వేదాంతిలా తయారయ్యాడు. లక్ష్మి పోయిందన్న విచారం అతని ముఖంలో నామమాత్రంగానైనా కనిపించటంలేదు. అలివేలుకి ఏమీ తోచటంలేదు. కొడుకు స్థితికి సంతోషించాలో, దుఃఖించాలో - తెలియటం లేదు.

---

## 20

రామచంద్రం మామూలుగా తిని తిరుగుతున్నాడు. మళ్ళీ స్కూలుకి యథాప్రకారం వెడుతున్నాడు.

ఒకనాడు స్కూలికి వెడుతుండగా జిల్లామున్సబుగారి బంట్రోతు కనిపించి పరుగెత్తుకుంటూ వెళ్ళి రామచంద్రాన్ని కలుసుకున్నాడు.

"అయ్యా- తమరిప్పుడు రావటం మానేశారేం" అన్నాడు బంట్రోతు

"అవునోయ్- అమ్మగారి పరిస్థితి బాగాలేదు. అందువల్ల మానేశాను" అన్నాడు రామచంద్రం.

"ఇప్పుడెలా గుండది బాబూ "అన్నాడు బంట్రోతు.

"అమ్మగారు- పోయారు" అన్నాడు రామచంద్రం.

"మ్చ్, ఎంత కష్టం వచ్చి పడింది బాబూ అయితే ఏం జబ్బు బాబుగారు?" అన్నాడు బంట్రోతు.

"బాలింత రోగం"అన్నాడు రామచంద్రం నిర్లిప్తంగా చూస్తూ.

"పాపం, అమ్మగారికి అమ్మా, అయ్యా ఉండారా బాబూ" అన్నాడు బంట్రోతు.

"ఆ-ఆ-ఉన్నారోయ్-" అన్నాడు రామచంద్రం.

"అయితే బాబుగారు! అమ్మగారు పెసవం కాలేక పోయారన్నమాట! మరి పిల్లగాడు బాగుండాడా బాబూ" అన్నాడు ప్యూను.

"బాగానే ఉన్నాడోయ్, అయినా నీ కివన్ని దేనికిరా" అన్నాడు రామచంద్రం.

"ఊరికేనే బాబూ. ఒక రాస్యం ఉందండి బాబూ" అన్నాడు బంట్రోతు రహస్యంగా.

"రహస్య మేంటిరా నీ ముఖం-ఎవర్ని గురించిరా" అన్నాడు రామచంద్రం నవ్వుతూ.

"మున్నబుగారి అమ్మాయిగోరిదే నండీ. ఆరి కీ మద్య మంచి సంబదా లొచ్చి నయ్యాంటయ్యా! కానీ-అమ్మాయి గోరు-ఓర్ని పెళ్ళాడనంటుండా రండీ. ఆమైన అయ్యగారికి కోప మొచ్చినాదండి. కూకలేసింద్రు. అప్పుడమ్మాయిగారు ఏడ్చింద్రు. ఎవర్ని చేసుకుంటావో సెప్పు. ఓర్ని సేసుకోక పోతే ఏం సేద్దామను కుంటుండావు" అన్నారండి బాబూ-ఆ మైన అమ్మాయి గారు మీా పేరు సెప్పినారు. అయ్యగారి తల గిరున తిరిగిందండి. మీాకు యివాహం అయిందని ఓరో సెప్పారంటండి అయ్యగారితో! అంతే అగ్గిలాగై పోయారు. సెడా మడా తిట్టారు. చేసుకుంటే తను తెచ్చిన సంబందం చేసుగో మన్నారు-నేకుంటే అసలు పెళ్ళే సెయ్య నన్నారు. దాంతో అమ్మాయిగోరు పట్టు బట్టింద్రు. పెల్లి చేసుకోకుండా సదువులు చదువుకొని ఉద్దేగం సేస్తానన్నారు. అయ్యగారు

సేసేదేంలేక ఊరుకున్నారండయ్యా! అద్దది సంగతి-అసలు యిసయం- పరమ రహస్యం" అన్నాడు బంట్రోతు కళ్ళింత చేసి చూస్తూ.

"ఊఁ" అన్నాడు రామచంద్రం. మాట్లాడ లేదు. దీర్ఘంగా నిట్టూర్చాడు.

"నేను పోతున్నానోయ్ రావటానికి తీరదు" అన్నాడు రామచంద్రం.

"కాదండీ బాబూ- మీరు కనిపిస్తే ఓ పాలి పిలుసుకు రమ్మని అమ్మాయి నీళమ్మగారు బెతిమి లాడారు" అన్నాడు బంట్రోతు.

"ఊహలా! నీళమ్మతో చెప్పు- నేను రావటానికి వీలు కాదన్నానని" అన్నాడు రామచంద్రం.

"ఒక్కపాలి వచ్చి బేగి ఎల్లి పోదురుగాని బాబూ- నీళమ్మగారు వెనకటిలా లేరండయ్యా- ఎప్పుడూ ఏదో ఆలో సిత్తున్నట్టుంటారు. ఓరితోటీ పలకరు. అయ్యగారు కూడా ఎనకటలా లేరండీ. పరాశకాలే ఆడటం మానేచారు" అంటూ పట్టు పట్టాడు.

రామచంద్రం తప్పించుకోలేక 'సరే' నని బయలు దేరాడు.

వరండాలో మున్సబు గారు కూర్చొని ఉన్నారు. నీళ పూల చెట్ల దగ్గర నిలబడి రంగు రంగుల పూలు తుంచు తున్నది.

రామచంద్రాన్ని చూచి యింట్లోకి పరుగెత్తింది. ఆ గాబరాలో ఒళ్ళో ఉన్న పూలన్నీ వస్తున్న రామచంద్రం కాళ్ళ మీద పడి అటూ యిటూ చెదిరి పోయాయి. పరుగెత్తి పోతున్న నీళ బెదిరిపోయింది. ఒకసారి వెను తిరిగి చూసింది. రామచంద్రం ఒక్కసారి నీళ వంకా, కాళ్ళ దగ్గర పడ్డ పూలవంకా చూశాడు. మళ్ళీ తలెత్తి చూచే సరికి నీళ అక్కడ లేదు. రామచంద్రం వంగి ఒక్క గులాబీని చేతిలోకి తీసుకున్నాడు. ఏమీ ఎరగనట్లు మళ్ళీ నడిచి వెళ్ళాడు. బంట్రోతు అది గమనించలేదు. పూలన్నీ బాట మీద పడి వున్నాయి. ఎవరు పారబోశారా అని చూశాడు. అన్నీ జాగ్రత్తగా తలగుడ్డ తీసి అందులో భద్రం చేశాడు.

రామచంద్రాన్ని చూసి మున్సబుగారు శుష్క మంద హాసం చేశారు "రావోయ్- ఎన్నాళ్ళయింది- నీవు కనిపించక" అన్నాడు పరామర్శిస్తూ.

"అవునండీ- మా ఆడవాళ్ళకి కులాసాగా లేకపోతేను- రావటం మానేశాను" అన్నాడు రామచంద్రం.

"అవును- నేను విన్నాను. పాపం- మీ భార్య- పోయిందటగా" అన్నాడు మున్సబుగారు-

"అవునండీ-" అన్నాడు రామచంద్రం తల వంచుకొని.

"మీరు రావటం మానేశాక యిల్లంతా బోసిగా ఉందండీ - ఏమీ తోచటంలేదు. కాలక్షేపానికి ఎవరూ దొరక లేదు" అన్నాడు మున్సబుగారు.

రామచంద్రం నవ్వి ఊరుకున్నాడు.

"సాయంత్రం యిలా వస్తుండండి. మీకూ తోచు బాటుగా ఉంటుంది. నాకూ కాస్త కాలక్షేప మవుతుంది." అన్నాడు మున్సబుగారు.

నీళ ఒక ట్రేలో, కాఫీలు ఫలాహారాలు పట్టు కొచ్చింది.

మున్సబుగారి ముందు ఒక ప్లేటూ, కాఫీ గ్లాసు ఉంచింది. రామచంద్రం ముందు మరో ప్లేటు, గ్లాసూ ఉంచింది. వెళ్ళబోతున్నది.

"నాకు వద్దండీ - ఇప్పుడు వండిన పదార్థాలు, కాఫీ మానేశాను" అన్నాడు రామచంద్రం తలవంచుకొని.

"తీసుకుందురూ - ఇంతలో యింత మార్పా-నే నెప్ప టికీ - కాఫీ, టిఫిన్ మానలేను-" అన్నాడు మున్సబుగారు నవ్వుతూ.

"ఆ! మానేసి కొన్నాళ్ళయింది. ఇప్పుడి వేవీ ముట్టటంలేదు" అన్నాడు రామచంద్రం.

"పోనీ పాలు - పండ్లు తీసుకుంటారా" అన్నది నీళ నేల చూపులు చూస్తూ.

"పాలుకూడా మానేశాను. నిమ్మకాయ రసం అయితే యివ్వండి - పండ్లు అక్కర్లేదు" అన్నాడు రామ చంద్రం.

నీళ ఒక పళ్ళెంలో సగం కోసిన దానిమ్మ చెక్కా, ఏపిల్ పండొకటీ, అరటి పండ్లు రెండూ ఉంచింది. ఒక గ్లాసు నిండా నిమ్మకాయ రసం తెచ్చి బల్లమీద పెట్టింది.

"ఇన్ని దేనికండీ. ఒద్దని చెపుతున్నాగా" అన్నాడు రామచంద్రం నిమ్మరసం గ్లాసు చేతిలోకి తీసుకుంటూ.

"ఆ మాత్రం పుచ్చుకోలేరూ! నా కోసమైనా" అంటూ గోణిగింది నీళ. నీళ జాలిగా చూస్తుంటే రామచంద్రం కాదన లేకపోయాడు. బలవంతాన పళ్ళన్నీ తినేశాడు. నిమ్మరసం పూర్తిచేశాడు. చేతులు కడుక్కోవటానికి లేచాడు. నీళ టవలూ, సబ్బూ, నీళ్లూ పట్టుకొచ్చింది. రామచంద్రం చెయ్యి తుడుచుకొని వచ్చి కూర్చున్నాడు.

నీళ పళ్లేలూ, గ్లాసులూ పట్టుకెళ్ళింది.

"చూశారా - అమ్మాయికి మీ మీద ఉన్న శ్రద్ధ! మీ కేమో _ టవలూ - సబ్బూ - నీళ్లూ అన్ని అందించింది. నా మాట మరచి పోయింది. ఇంతే - కనీ పెంచిన పెద్దల్ని మరిచే కృతఘ్నులు పిల్లలంతా" అంటూ నవ్వాడు.

రామచంద్రం నివ్వెర పోయాడు. నీళ మనసు తన మీద నిల్పిందని విని తండ్రి మండిపడ్డాడని బంట్రోతు చెప్పాడు. కానీ మున్సబుగారి ప్రవర్తన అందుకు పూర్తిగా వ్యతిరేకంగా ఉంది. ఇప్పటి పరిస్థితులు చూచి మారి పోయాడా? మనసు మార్చుకున్నాడా? అనుకున్నాడు రామచంద్రం.

"అయితే మీరిప్పుడేం చెయ్యదలచారు" అంటూ హఠాత్తుగా ప్రశ్నించాడు మున్సబుగారు.

"ఏమీ లేదు" అన్నాడు రామచంద్రం మున్సబుగారి ప్రశ్నలోని అంతరార్థం బోధపడక.

"మరి - పిల్లలేమైనా ఉన్నారా" అన్నాడు మున్సబుగారు.

"ఎవరికీ" అంటూ ఆశ్చర్యపోయాడు రామచంద్రం.

"మీకే" అన్నాడు మున్సబుగారు.

"ఊఁ - ఒక కుర్రవాడు - పుట్టాడు - పుడుతూనే తల్లిని చంపాడు" అన్నాడు రామచంద్రం.

"పిల్లవాడ్ని ఎవరు పోషిస్తారు - తాత ముత్తవలా ? మీరా" అన్నాడు మున్సబుగారు.

"తాత ముత్తవలే! వారికింక నా భార్య తప్ప ఎవరూ లేరు - పిల్లవాడ్ని వాళ్ళే పెంచుకుంటారు" అన్నాడు రామచంద్రం.

"మీరేమైనా డబ్బు పంపుతారా ?" అన్నాడు మున్సబుగారు.

"ఉహూ - నేనింకా అంతవరకు ఆలోచించలేదు - నా డబ్బుమీద ఆధారపడ వలసిన అవసరం మా అత్తగారికి లేదు. ఎందరు తిన్నా తరగని ఆస్తి ఉంది. ఒకరి డబ్బుకి ఆశించవలసిన అవసరం వారికిలేదు" అన్నాడు రామచంద్రం.

"అయితే మీరు - ద్వితీయ వివాహం చేసుకొనే ఉద్దేశ్యంలో ఉన్నారా ?" అన్నాడు మున్సబుగారు.

ప్రస్తుతం నాకలాంటి ఆలోచనేం లేదండి" అన్నాడు రామచంద్రం.

"మరి? ఇంత చిన్న వయస్సులో ఏం చేద్దామనుకుంటున్నారు" అన్నాడు మున్నబుగారు ఆజ్ఞాపిస్తున్నాట్లు.

"నేనేమీ ఆలోచించలేదు - పిల్లవాడున్నాడు. నేనింక చేయవలసిందేమీ లేదు" అన్నాడు రామచంద్రం.

"బాగుందండోయ్ - ఈ వయస్సులోనే - వైరాగ్యం బాగులేదు - ఇలా అన్నానని ఏమీ అనుకోకండి - మీరింకా కొన్నాళ్ళు గృహస్థాశ్రమం స్వీకరించాల్సి ఉంది. మీరేమీ అనుకోకుండా ఉంటే ఒక్కమాట చెప్తాను" అన్నాడు మున్నబుగారు.

"అదేమిటో-" అన్నాడు రామచంద్రం.

"ఏమీ లేదు - నీళ-మిమ్మల్ని తప్ప మరెవరినీ చేసుకోనని భీష్మించింది. అప్పుడు మీరు వివాహితులు. ఒక భార్య ఉంది. భార్య ఉండగానే మరో దాన్ని కట్టబెట్టటం నా కిష్టంలేదు - లోకులు కన్న బిడ్డ గదా అని - కట్టపెట్టటం నాకు బాగుండదు. ఇప్పుడా అడ్డంకిలేదు. అమ్మాయి కోర్కెని తీర్చటానికి అభ్యంతరం నాకు లేదు. మీ కేమైనా ఉందా?" అన్నాడు మున్నబుగారు.

"నా కిప్పుడలాంటి ఆలోచన లేమీ లేవు" అన్నాడు రామచంద్రం.

"మీరలా అనకూడదు - అమ్మాయి - మిమ్మల్ని మనసారా కోరింది - మీ రిదివరకామెతో సుఖపడ లేదన్న

విషయం నాకు తెలుసు. ఇప్పుడైనా సుఖపడండి - కోరి వచ్చిన కాంతని కాలదన్నటం కన్న మరోటిలేదు. మీకేం పిల్లవాడి బాదరబందీ లేదు స్వేచ్ఛ జీవులు - నా కసలే వెళ్ళ యిష్టంలేదనుకోండి. అదీ పిల్లల శ్రేయస్సు దృష్ట్యానే సుమండీ! ఇప్పుడు మిమ్మల్నిలా అర్ధించటానికి కారణం కూడా పిల్లల మంచి దృష్టిలో ఉంచుకొనే. వాళ్ళ కోర్కెలు తీర్చటం - తండ్రిగా నా బాధ్యత. అంత మాత్రాన - సబబూ, బే సబబూ చూడకుండా, వాళ్ళ భవిష్యత్తుని దృష్టిలో ఉంచుకోకుండా వాళ్ళు చెప్పినట్లు చేసేవాణ్ణి కాదు" అన్నాడు మున్సబుగారు.

"అమ్మగారితో సంప్రదించి చెప్తాను" అన్నాడు రామచంద్రం తప్పించుకో జూస్తూ.

"ఊహూ - మీరు మాటయిచ్చి వెళ్ళాలి. మీ అమ్మగారు మాత్రం యిందుకు వ్యతిరేకులని నేననుకోను. కొడుకు సుఖంకోరని తల్లి - తల్లే కాదు. మీ అమ్మగారు - అలాంటివారని నేనూహించలేను" అన్నాడు మున్సబుగారు.

రామచంద్రం మాట్లాడలేదు.

నీళ తలుపుచాటున నిలబడి అంతా వింటూ ఉంది. ఆతృతగా రామచంద్రంవంక రెప్పవాల్చకుండా చూస్తోంది. రామచంద్రం హఠాత్తుగా అటు చూచాడు. తనవంక తదేక దీక్షతో చూస్తున్న కళ్ళని గుర్తుపట్టాడు. నీళ అభ్యర్ధనని కాదనలేక పోయాడు. మళ్ళీ తలవంచుకున్నాడు.

మున్సబుగారు మళ్ళీ హెచ్చరించారు "ఏం బాబూ- ఏదో ఒకటి తేల్చండి. మిమ్మల్ని బలవంతంచేసి నా కూతురి కోర్కె తీర్చటం నా కిష్టంలేదు. దాంపత్యంలో - అన్యో న్యాను రాగాలుండాలి. కేవలం ఒకరు సుముఖంగా ఉంటే లాభంలేదు. ఎడముఖాలూ, పెడముఖాలతో జీవితం అంతా నరక తుల్యంగా గడపటం నా అభిమతం కాదు. దానికన్నా- దుఃఖంలో - వేరు వేరుగా బ్రతకటమే మేలు. నీవు నీ మనసు లోని మాట చెప్పు. కేవలం అమ్మాయికోర్కె తీర్చాలన్న మొక్కుతోనూ, నా మీదఉన్న అభిమానంతోనూ 'ఊ' అనకు. అంత్య నిష్ఠూరంకన్నా - ఆది నిష్ఠూరం మేలంటారు. ముసుగులో గ్రుద్దులాట మంచిది కాదు బాబూ" అన్నాడు మున్సబు.

"మీ యిష్టం - మీరు వచ్చి నాన్నగారితో మాట్లా డండి" అన్నాడు రామచంద్రం.

"మంచిది బాబూ - మంచిరోజు చూచి అలాగే వస్తాను" అన్నాడు మున్సబు.

"కానీ - ఒకవిషయం. మేమేమీ పెద్ద ధనికులం గాదు. మా సంగతి మీకు తెలిసే ఉండచ్చు. నాన్నగారు- వంటలు చేస్తారు" అన్నాడు రామచంద్రం తలవంచుకొని.

"అవును బాబూ - నా కన్నీ తెలుసు. మనిషి బ్రతక టానికి ఏదో ఒక పని చెయ్యాలి - కూటికొరకు కోటి విద్య లని - అదీ ఒకపనే. ఉచ్ఛత, నీచత మన మనస్సుల్లో కట్టు కున్న గూళ్ళు. కలిమి లేములు కావడికుండలు. ఇవన్నీ నీవు

Bk 210

| | | |
|---|---|---|
| ధన్యజీవులు | కొత్త లక్ష్మీరఘురాం | 2-00 |
| చిల్లిగవ్వ | ,, | 2-00 |
| జీవనమాధుర్యం | మునుపల్లె సరోజినీదేవి | 5-00 |
| మనుష్యులు - మనస్సులు | ,, | 2-50 |
| తాడు - బొంగరము | ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి | 2-00 |
| మంచుతెరలు | ,, | [illegible] |
| అనంతయాత్ర | కె. చిరంజీవి | 3-50 |
| ముళ్ళగులాబి | ,, | 3-00 |
| ఆఖరి ప్రేమలేఖ | శంకరమంచి సత్యం | 1-25 |
| రేపటిదారి | ,, | 3-00 |
| పంకజం | కొనరాజు శేషయ్య | 3-50 |
| బోడెమ్మ బ్రతుకు | ,, | 3-50 |
| పల్లెవాసి | ,, | 3-00 |
| కథాగేయ సుధానిధి | నండూరి రామమోహనరావు | 1-75 |
| మయూరకన్య | ,, | 1-50 |

# నవీన గ్రంథమాల

విజయవాడ - 2.

WRAPER PRINTED AT VIJAYA PRESS

